# జూలియస్ సీజర్



" సీజర్ ! నీవు మరణించినా బలవంతుడవే "

కాషియస్

# జూలియస్ సీజర్

షేక్స్పియర్ మహాకవి కృతము



అనువాదకుడు

వావిలాల సోమయాజులు



ప్రకాశకులు

విజ్ఞాన మంజూష

మెయిన్‌రోడ్ :: గుంటూరు 1

# భూమిక

కవి జీవిత విశేషాలు:

'ప్రపంచాగ్రగణ్యుడైన నాటకకర్త' అని ఖ్యాతివహించిన విలియం షేక్స్పియర్ క్రీ. శ 1564 ఏప్రియల్ మాసంలో ఆంగ్లదేశంలోని స్ట్రాట్‌ఫర్డ్-ఆన్ - ఆవన్ అనే నగరంలో జన్మించాడు. తన పదునాల్గోసంవత్సరం దాకా స్వల్పంగా విద్యాగ్రహణం చేసి తండ్రి జాన్ షేక్స్పియర్‌కు వ్యాపారంలో తోడ్పడటానికని విద్యార్జనకు స్వస్తిచెప్పాడు. పద్దెనిమిదో ఏట తనకంటే ఏడుసంవత్సరాలు వయస్సులో పెద్దదైన ఆనీ హాథవే అనే కన్యను వివాహమాడాడు.

యౌవనారంభదశలో సర్ జాన్ లూసీ అనే ధనికునితో వైరం పెట్టుకోటం వల్లా, వైవాహిక జీవితం జయప్రదం కాకపోవటం వల్లా షేక్స్పియర్ జన్మసీమను వదలి క్రీ. శ. 1584 లో లండన్ మహానగరం చేరుకున్నాడు. 'గ్లోబ్' నాటకశాలలో మొదట 'అశ్వపాలుడు' లాగానూ, 'ఆమంత్రణ-పాలు'డి లాగానూ ఉద్యోగనిర్వహణం చేసి క్రమంగా ఆనాటకశాలలోనే నటకుడు, నాటకరచయితగా ఉన్నతోద్యోగాలు వహించాడు. ప్రారంభదశల్లో అతడు ఇతరుల నాటకాలను ప్రదర్శనాయోగ్యాలుగా సరిదిద్ద నారంభించాడు. కాలక్రమాన అనుభవాన్ని సంపాదించి స్వయంగా నాటకరచనకు పూనుకొని సమకాలీన నాటకకర్తల్లో ప్రథముడని పరిగణింపబడుతూ వచ్చాడు. తన ఇరవైనాలుగుసంవత్సరాల సారస్వతజీవితంలో ముప్పైయేడు నాటకాలు రచించాడు. నటకుడుగా షేక్స్పియర్ ప్రజ్ఞావిశేషాలు ఏస్థాయిని అందుకున్నవో తెలుసుకోటానికి తగ్గ ఆధారాలు లేవు.

ఆత్మశక్తివల్ల నిత్యాభివృద్ధి పొందుతూ ప్రసిద్ధిగాంచి ధనార్జనంచేసి ప్రభువర్గంలో చేరి ఎసెక్స్, సౌతాంప్టన్ ఎరల్స్, పెంబ్రోక్ ప్రభువులతో మైత్రి సంపాదించి వారితో తుల్యుడనిపించుకున్నాడు. ఎలిజబెత్ రాణి, జాన్ రాజు ఆయన నాటకాలమీద ఆసక్తి వహించి శ్లాఘించి బిరుదులిచ్చి గౌరవించారు. [illegible] జీవితంలో [illegible] నాటకాలను [illegible] కీర్తి [illegible] షేక్స్పియర్ [illegible] జన్మ [illegible] స్ట్రాట్‌ఫర్డ్ వచ్చి ప్రశాంత జీవితాన్ని [illegible] 23 ఏప్రియల్ 1616 నాడు

జీవితాన్ని చాలించాడు.

## నాటకరచన ; వివిధదశలు :

1588 మొదలు 1612 వరకు సాగించిన ఇరవైనాలుగు సంవత్సరాల సారస్వతజీవితంలో షేక్స్పియర్ ముప్పైఏడు నాటకాలు, రెండు మహా కావ్యాలు, కొన్ని ఖండకావ్యాలు చెప్పాడు. షేక్స్పియర్ నాటకరచనా కాలాన్ని విమర్శకులు నాలుగుదశలుగా విభజించారు.

ప్రథమదశ 1588—1595 : ఈ దశలోని నాటకాల్లో చారిత్రాత్మకాలు, విషాదాంత, సుఖాంత నాటకాలూ ఉన్నవి. వీటిలో ప్రసిద్ధమైనవి హెన్రీ VI మూడుభాగాలు, మూడవ రిచ్చర్డు, రెండవ రిచ్చర్డు, రోమియో జూలియట్, వేసవి నాటిరాత్రి కల, మొదలైనవి. వీటిలో భాషా పాటవమే గాని భావగాంభీర్యం తక్కువ.

ద్వితీయదశ ( 1595 — 1601 ) : ఈ దశలో షేక్స్పియర్ కొన్ని సుప్రసిద్ధ సుఖాంత నాటకాలు, చారిత్రాత్మక నాటకాలు రచించాడు. వెనిస్ వర్తకుడు, జాన్ రాజు, నాల్గవ హెన్రీ రెండుభాగాలు, ఐదవ హెన్రీ ఈ కాలంనాటివి. ఈ దశలోని నాటకరచనాకాలం నాటికి షేక్స్పియర్ మహాకవి మనస్సు పరిపక్వం కావటం ప్రారంభించింది. వీటిలో ప్రపంచానుభవం, మనస్తత్వపరిశీలనం వెనకటిదశలోని నాటకాలలోకంటే విశేషంగా గోచరిస్తున్నవి.

తృతీయదశ ( 1601 —1608 ) లో జన్మించినవే జూలియస్ సీజర్, ఆంటొనీ క్లియోపాత్రా, కోరియొలానస్ అనే మూడు రోమ్‌దేశ చరిత్రాత్మక నాటకాలు. హామ్లెట్, ఒథెల్లో, లియర్, మాక్బెత్ — అనే విషాదాంత చతుష్టయంకూడా యీదశలో చెప్పినదే. ట్రాయిలస్ — క్రెసిడా వంటి సుఖాంతనాటకాలు కొన్ని ఉన్నప్పటికీ విమర్శకులు ఈదశను 'విషాదాంత దశ' అని నామకరణం చేశారు. ఈదశలో మహాకవి షేక్స్పియర్ విలాసం, ప్రణయం, యుద్ధవైభవాదులమీదకు పోయే బుద్ధిని మానవహృదయ కుహరాంతరాలను మథించి అంధకారం ఆవరించిన అక్కడి మానవ దౌష్ట్య స్వరూపస్వభావాదులను దర్శించు అవకాశం చేసి ప్రదర్శించాడు.

చతుర్థదశ (1608—1611) తుది దశ. ఇది ఒక నవచైతన్యదశ. శీతా

కాల కథ, సింబలైన్, తుఫాను, పెరిక్లిస్ ఈదశలో పుట్టిన రూపకాలు. ఈనాటకాలల్లో ప్రశాంతచిత్తం, సుఖదుఃఖాదులగూడ సమబుద్ధి ప్రకటితాలౌతుంటవి. దీన్ని విమర్శకులు షేక్స్పియర్ పరిపక్వదశగా భావిస్తుంటారు.

## రోమను నాటకాలు

తనతృతీయదశలో షేక్స్పియర్ చెప్పిన జూలియస్ సీజర్, ఆంటొని-క్లియోపాత్రా, కోరియలానస్, అన్న మూడు నాటకాలకూ ఆధారం రోమనుచరిత్ర. ఈమూడునాటకాలూ విషాదాంతాలు. మూడింటికీ ప్లూటార్క్ "జీవితాలు" ఆధారం. షేక్స్పియర్ మహాకవి కోరియలానస్ నాటకంలో వివిధవర్గాలవారు ఔన్నత్యానికోసం తమఅనంతశక్తిని ధారపోస్తూ కలహిస్తున్నరోంను, సీజర్ లో సిద్ధాంతాలమధ్య కలిగిన సంఘర్షణవల్ల అనతికాలంలో ఛిద్రంకానున్న మహత్తరసంపత్సమృద్ధమైన రోంను, ఆంటోనీ-క్లియోపాత్రాలో వ్యక్తుల స్వార్థపరత్వం వల్ల కొల్లబోవటానికి సంసిద్ధమైన అధికారప్రాభవాలుగల రోంను ప్రదర్శించాడు. రోమకనాటక త్రయంలోని నాయకులు ముగ్గురూ గొప్పవ్యక్తులు. సీజర్ నాటకానికి నాయకుడైన బ్రూటస్ స్వార్థరహితుడైన దేశభక్తుడు. ఆంటొనీ – క్లియోపాత్రాలో నాయకుడైన ఆంటొనీ విలాసప్రియత్వంతో అధఃపతితుడైన మహాసేనాని. కోరియలానస్ లోని నాయకుడు దేశభక్తిద్వారా సద్గుణాలను అధిగమించిన స్వార్థపరత్వంవల్ల దెబ్బతిన్న మహాగర్వి, ఆత్మాభిమాని. ఈనాటకత్రయం రోందేశచరిత్రకు ముకురాలు. ఈమూటిలోను జూలియస్ సీజర్ ఉత్తమోత్తమం.

## కథాకాలంనాటి రోం

కథాకాలంనాటి రోం మహత్తర విజయాలను సాధిస్తున్నా వర్గకలహాలతోనూ, అంతర్యుద్ధాలతోనూ నిండి ఉండేది. రోమనుసామ్రాజ్య పాలనను ప్రాచీన రోమనుప్రభుకుటుంబాలవారే సాగించాలని కొందరు, పౌరులకు, ఇతరప్రజలకు సమానసత్వాన్ని ప్రసాదించే పాలనను రూపొందించాలని కొందరు, ఈప్రజాస్వామికవిధానాలతో మాకేటువంటి ప్రమేయంలేదు, శక్తివంతుడైన ఒకపాలకుని క్రింద అభ్యుదయాన్ని పొందటమే మాఆశయమని కొందరూ భిన్నాభిప్రాయాలు వహిస్తూ పరస్పరం వైమన

స్యాలను వెళ్ళబోసుకుంటున్నారు. వీళ్ళని నిత్యచాంచల్యంగల సామాన్య జనసముదాయం వివక్షారహితంగా తోడ్పడుతూ వస్తున్నది. సక్రమప్రజాస్వామికానికి ఆవశ్యకాలైన ముఖ్యసూత్రాలు చెదిరిపోయినవి. రోంకు కావలసింది శక్తివంతమూ జ్ఞానోపేతమూ అయిన సుస్థిరప్రభుత్వం. ఇటువంటిదాన్ని ఆనాటిప్రజలు కల్పించుకోగలరా అన్నది ప్రశ్న.

రోమనులు ప్రధానంగా 'పెట్రీషియన్లు' (ప్రభువర్గం), 'ప్లెబియన్లు' (జనసామాన్యవర్గం) అని రెండు తెగలు. ఇంటిబానిసలు, యుద్ధబానిసలు, అంత దంతలు లేని విదేశీయులు ఇతరబానిసలూ, మష్టక్రియలు చేయటానికి స్వేచ్ఛగల స్వతంత్రులూ ఈ జనసామాన్యవర్గంలోవారు. వీరు ధర్మాధికారులమీదా సంగతులమీద తిరుగబడి హత్యలు చేస్తుంటారు. ధర్మానికి కట్టుబడేవారు కారు. పాంపేవిజయంతో వచ్చినప్పుడు ఆయనను గౌరవించి ఆహ్వానించారు. అతణ్ణి చంపివచ్చిన సీజర్‌కు ఘనస్వాగతం చెప్పారు. సీజర్‌ను హత్యచేసిన బ్రూటస్‌ను 'సీజర్'ను చేద్దామనుకున్నారు. వారినాయకులు చేకొన్న విజయం విదేశీయులమీదనైనా, స్వదేశీయులమీదనైనా వారికి ఒకటే. విషయగ్రహణశక్తిలేనివారిని ప్రసంగప్రావీణ్యమున్నవక్తలు తమవక్తృత్వశక్తితో కీలుబొమ్మలను చేసి ఆడిస్తుండేవాళ్లు. వారు స్వేచ్ఛాస్వరూపాన్నే మరిచిపోయారు. జనసామాన్యవర్గస్థితి ఇలా ఉంటే ప్రభువర్గస్థితిగతులు ఇంతకంటే అధ్వాన్నంగా ఉన్నవి. సభాభవనంలో వక్తలు ఒకరినొకరు తిట్టుకోటం, ఒకరిముఖాన ఒకరు ఉమ్మేసుకోటం, ఎన్నికలసమయంలో అసభ్యంగా ప్రవర్తిస్తూ పెద్దమనుష్యులు వీధుల్లోకి రావటానికి వీల్లేనంతగా అల్లరులు చేస్తూ, చేయిస్తూ ఉండటం వారికి నిత్యలక్షణాలైనవి. సభాభవనంలోనే తమలయుద్ధాలూ, హత్యలూ జరిగించేవాళ్లు. ఇటువంటి రోంలో ప్రజాస్వామికానికి తావెక్కడుంది? సీజరిజం (నిరంకుశత్వం) తప్ప మార్గాంతరం లేదు. రోం అటువంటి నిరంకుశుని ఆగమనంకోసం ఎదురుచూస్తున్నది.

సీజర్ తగినఅర్హతలతో ఉద్భవించాడు. ఆహారవినోదాలను కల్పిస్తే తృప్తిపడి ఎటువంటి ప్రభుత్వవిధానమైనా పట్టించుకోకుండా తమ స్వాతంత్ర్యాన్ని కోల్పోవటానికి సంసిద్ధులై ఉన్నారు రోం సామాన్యప్రజలు.

కానీ ప్రభుత్వసంస్థలలోని కొందరివ్యక్తుల హృదయాలలో కొంత స్వార్థం తోడ్పడ్డవల్ల నైతేనేం, కొంత చిత్తశుద్ధిగల స్వాతంత్ర్యప్రియత్వంవల్ల నైతేనేం సీజర్‌మీద వ్యతిరేకత ఉంది. ఈవ్యతిరేకతకు ఫలితమే సీజర్ వధ. సీజర్ వధాఫలితాలే ప్రజా క్రోధం, బ్రూటస్ కాషియస్‌ల పలాయనం. ఫిలిప్పి యుద్ధభూమిలో వాళ్ళకి అకారణనిరాశ, నిస్పృహలు, సంపూర్ణపరాజయం. బ్రూటస్ ఆత్మహత్యలో 'సీజరిజం'కు పరిపూర్ణవిజయం, స్వాతంత్ర్యేచ్ఛకు స్వస్తి చేకూరాయి. ప్రజల రాజభక్తిప్రియత్వం బయటపడ్డది. రోమక సామ్రాజ్యంలోని రాజకీయసాంఘికశక్తుల సంఘర్షణ అంతరించింది. ఆక్టేవియస్ సీజర్ సైనికరాచరికాన్ని స్థాపించి రోమకమహాసామ్రాజ్యాధినేత ఐనాడు.

## కథాసంగ్రహం

లూపర్ కేలియా ఉత్సవదినం నాడు రోంలో సామాన్యజనులైన ప్లీబన్లు ముండా అనే ప్రదేశంలో జరిగినయుద్ధంలో అతనిప్రబలశత్రువులైన పాంపే కుమారులమీద విజయాన్ని చేకొని వస్తున్న సీజర్‌ను మహావైభవంతో ఆహ్వానించటానికి ఆనాటిని సెలవుదినంగా భావించి వీధుల్లో గుంపులు చేరుకుంటారు. ప్రజాధర్మాధికారులైన ఫ్లేవియస్, మారులస్‌లు పాంపేయెడ వారి కృతఘ్నతను నిందిస్తూ చెదరగొడతారు (అం ౧ దృ ౧). లూపర్ కేలియా ఉత్సవాలను వేడుకున్న జనసమూహానికి ముందు సీజర్ పరివారంతో నడుస్తుంటాడు. ఒకశకునజ్ఞుడు అతణ్ణి 'మార్చి పదిహేనోనాడు జాగ్రత్త' అని హెచ్చరిస్తాడు. సీజర్ అతణ్ణి 'ఎవడో స్వాప్నికుడు' అని త్రోసిపుచ్చి క్రీడలను చూడటానికి వెళ్లిపొమ్మంటాడు. కాషియస్ బ్రూటస్‌ను ప్రక్కకు తీసికొనిపోయి సీజర్ జీవితంమీద జరిగే కుట్రలో చేరవలసిందని ఉద్బోధిస్తాడు. క్రీడలైపోయి సీజర్ వెళ్లిపోతున్నప్పుడు వాళ్లతో కాస్కా చేరి సీజర్‌ అంటొనీ అర్పించిన రాజకిరీటాన్ని ఎలా ముమ్మారు త్రోసిపుచ్చాడో వివరిస్తాడు. బ్రూటస్ మనస్సులో సీజర్ ఆశాపరత్వాన్ని గురించిన ఆలోచన ఆరంభమౌతుంది (అం ౧ దృ ౨). కాస్కా సిసెరోను కలుసుకొని కనిపించిన దుశ్శకునాల నన్నింటినీ వివరిస్తాడు. సిసెరో వెళ్లిపోయినతరువాత కాషియస్ అతణ్ణి కలుసుకొని అంతకు పూర్వమే దుశ్శకునాలను కల

వరిపడుతున్న అతనిమనస్సును నచ్చచెప్పి హంతకవర్గంలో చేర్చుకుంటాడు. అక్కడికి వచ్చిన సిన్నాకూడా వారిలో చేరుతాడు. ముగ్గురు బ్రూటస్‌ను తమవాణ్ణి చేసుకోటానికి పథకం వేస్తారు (అం౧ దృ 3).

సీజర్ ఆశాపరత్వం రోముకు ప్రమాదకారి అని భావిస్తూ మానసికాందోళనతో బ్రూటస్ తనతోటలో ధ్యానంలో రాత్రింతటినీ గడుపుతుంటాడు. హంతకులు వాతాయనంగుండా పడవేసిన ఉత్తరాలను చూచి రోం ప్రజాపాలనకు పాల్పడకుండా చేయటంకోసం 'సీజర్‌ను ఆరంభదశలోనే హతమార్చటానికి' నిర్ణయిస్తాడు. విద్రోహకవర్గం ఆయనను కలుసుకున్న తరువాత చర్చించి హత్యాపథకవివరాలను నిర్ణయిస్తారు. ప్రమాణాలు తీసుకోవాలెననీ, ఆంటొనీనికూడా తుదముట్టించాలె ననీ, సిసెరోను కలుపుకోవాలె ననీ కాషియస్ చేసిన సూచనలను బ్రూటస్ వ్యతిరేకిస్తాడు. కాషియస్ లొంగిపోతాడు. సభాభవనంలో సీజర్‌ను మరునాడు చంపటానికి అంతా అంగీకరించి వెళ్లిపోయినతరువాత బ్రూటస్ భార్య పోర్షియావచ్చి ఆరహస్యసమాలోచన లేమిటో కళవళపెట్టే విశేషా లేమిటో తెలియజేయవలసిం దని ప్రార్థిస్తుంది (అం ౨ దృ ౧). మర్నాడు సీజర్ భార్య కల్పూర్నియా శకునజ్ఞుని సూచననూ, రాత్రి తాను వచ్చిన కలనూ చెప్పి సీజర్‌ను సభాభవనానికి వెళ్లకుండా నిర్బంధిస్తుంది. సభాసభ్యుల్లో ఒకడైన డెసియస్ వచ్చి కల్పూర్నియాకల సవ్యమైనదని చెప్పి మరొకవ్యాఖ్యానాన్ని చేసి సీజర్ సభకు వచ్చేటట్లు చేస్తాడు. సభాభవనానికి తీసుకోపొయ్యే ఉద్దేశంతో బ్రూటస్ ప్రభృతులు సీజర్ ప్రాసాదానికి వస్తారు (అం ౨ దృ ౨). ఆర్టిమిడోరస్ సీజర్‌ను జాగ్రత్తగా ప్రవర్తించవలసిం దనే సూచికాపత్రాన్ని చదువుతాడు (అం ౨ దృ 3). భర్తృరహస్యాలను తెలుసుకున్న పోర్షియా మానసికవ్యథను భరించలేక సేవకుణ్ణి సభాభవనానికి వెళ్లి బ్రూటస్ క్షేమసమాచారాన్ని తెలుసుకోరావలసిం దని పంపిస్తుంది (అం ౨ దృ ౪).

శకునజ్ఞులు ఇచ్చిన సూచనలను తిరస్కరించి ఆర్టిమిడోరస్, సీజర్ సభాభవనంలో ప్రవేశిస్తాడు. తాము పూర్వం ఏర్పాటుచేసుకొన్న క్రమాన్ని అనుసరించి విద్రోహకవర్గంలో ఒకడైన మెటిల్లస్‌సింబర్ దేశబహిష్కృతుడైన తనఅన్నను తిరిగి దేశానికి పిలిపించవలసిం దని పెట్టుకొన్న వినతి

పత్రాన్ని సీజర్‌కు సమర్పిస్తాడు. సీజర్ అందుకు వ్యతిరేకాభిప్రాయాన్ని ప్రకటించగా బ్రూటస్ ప్రభృతులు జోక్యం కలిగించుకుంటారు. సీజర్ హత్య జరుగుతుంది. ఈకల్లోలంలో ఇంతకి పారిపోయిన ఆంటొనీ తిరిగి వచ్చి తనభావాలను గుప్తంగా ఉంచి సీజర్ అంత్యక్రియోపన్యాసాన్ని ఇచ్చేటందుకు బ్రూటస్ అనుజ్ఞను పొందుతాడు. ఆక్టేవియస్ సీజర్ రోం దగ్గరవరకూ వచ్చినట్లు వార్తవస్తుంది (అం 3. దృ 1). సీజర్‌కు తాను ఎందుకు వ్యతిరేకంగా తిరిగి అతణ్ణి హత్య చేయవలసి వచ్చిందో ఆ కారణాలను తెలుపుతూ బ్రూటస్ విపణిప్రదేశంలో ఉపన్యసిస్తాడు. ప్రజలు సంతృప్తివహించి బ్రూటస్‌ను మహోదాత్తుడని శ్లాఘిస్తారు. తరువాత మార్క్ ఆంటొనీ సీజర్ మృతకళేబరంతో ప్రవేశించి ప్రజలను ఉద్రేకపూరితులను గావించే ప్రసంగంచేసి విద్రోహులమీదికి వారు దండెత్తి గృహదాహం చేసేటట్లు చేస్తాడు. బ్రూటస్ కాషియస్‌లు రోంనగరాన్ని వదిలిపెట్టి పారిపోతారు (అం 3. దృ 3). రోషోద్రిక్తమైన సామాన్య జనసముదాయం సిన్నాకవిని చూచి అతడు విద్రోహియైన సిన్నా అని భ్రాంతిపడి అతణ్ణి చీల్చివేస్తారు ( అం 3 . దృ 3 ).

రోంపాలన త్రిసభ్యకూటమి — ఆక్టేవియస్, ఆంటొనీ, లెపిడస్‌ల-హస్తగతమౌతుంది. వారు తమఅధికారాన్ని సుస్థిరంచేసుకోటానికి హతమార్చవలసిన సభాసభ్యులసంఖ్యను తయారుచేస్తారు. బ్రూటస్, కాషియస్‌లను వెన్నాడి పీడించటానికి పథకం వేస్తారు (అం 4 దృ 1). సార్డిస్‌రంగస్థలంలో బ్రూటస్ కాషియస్‌లమధ్య కలహం ఏర్పడుతుంది (అం 4 దృ 2). బ్రూటస్ తనశిబిరానికి వచ్చిన కాషియస్‌ను లంచాలు తీసుకున్నావని, ప్రజలను హింసించి ధనం దోచుకున్నావనీ నిందిస్తాడు. అంతకాలంలోనే ఇరువురిమధ్య సంధికుదురుతుంది. వెంటనే బ్రూటస్ తనభార్య పోర్షియా మరణాన్ని గురించి కాషియస్‌కు తెలియజేస్తాడు. తరువాత కాషియస్ సలహాను అతిక్రమించి బ్రూటస్ సైన్యాలతో ఫిలిప్పైవరకూ ఎదురువెళ్లి శత్రువులను ఎదుర్కొనాలె నని నిర్ణయిస్తాడు. ఏకాంతంగా ఉన్న బ్రూటస్‌కు సీజర్ భూతరూపం కనిపించి అతడికి తిరిగి ఫిలిప్పైయుద్ధభూమిలో దర్శన మిస్తా నని చెప్పిపోతుంది. (అం 4 – దృ 3).

ఉభయసైన్యాలు మాసిడోనియాలోని ఫిలిప్పివద్ద కలుసుకుంటాయి. ఉభయపక్షాలనాయకులు మాట్లాడుకుంటారు. కాని నిష్ప్రయోజన మౌతుంది. తుదిసారిగా కాషియస్ బ్రూటస్‌లు ఇరువురూ కలుసుకొని పరస్పరంవీడ్కోలులను స్వీకరిస్తూ అవసరమైతే ఆత్మహత్యకు సుసిద్ధులైనట్లు వెల్లడించుకుంటారు. (అం ౫ దృ ౧). బ్రూటస్ తనసైన్యాలకు అనుజ్ఞఇచ్చి అవతలవైపున ఉన్నసైన్యాలను హఠాత్తుగా ఆక్టేవియస్‌మీదికి పంపించే టట్లు చేయ మని మెసెల్లాను పంపుతాడు (అం ౫ – దృ ౨). పొరబాటువల్ల పిండారస్‌తో ప్రథమయుద్ధంలో కాషియస్‌సైన్యాలు ఓడిపోతవి. అతడు దూరంనుంచి వచ్చేవి మిత్రసైన్యాలో శత్రుసైన్యాలో చూచిరావలసిందని టిటినియస్‌ను పంపిస్తాడు. టిటినియస్ పట్టుపడ్డట్లు వార్తతెస్తాడు. కాషియస్ నిరాశ చెంది సేవకుడిచేత పొడిపించుకొని మరణిస్తాడు. టిటినియస్ తిరిగివచ్చి జరిగినది చూచి తానూ ఆత్మహత్య చేసుకుంటాడు. బ్రూటస్ జరిగిన ఈ ఉదంతాన్నంతటినీ మెసెల్లావల్ల విని కాషియస్ టిటినియస్‌లను మహోదాత్తులైన తుదిరోమనులని పొగిడి వారి అంత్యక్రియలకు ఏర్పాట్లు చేయిస్తాడు (అం ౫ – దృ 3). యుద్ధభూమికి వెళ్లి బ్రూటస్ తిరిగీ ఒక యత్నం చేస్తాడు. ఆంటోనీసైనికులు లుసిలియస్‌ను పట్టుకొని అతడే బ్రూటస్ అనే భ్రాంతితో తమ నాయకుడిదగ్గిరికి తీసుకొనిపోతారు. ఆంటోనీ సత్యాన్ని గ్రహిస్తాడు (అం ౫ – దృ ౪). తనకు విజయం అలభ్యమైపోయిందని నిర్ణయించుకొన్న బ్రూటస్ తన్ను చంపవలసిందని మిత్రులను అర్థిస్తాడు. చివరకు 'స్ట్రాటో' అనే అతణ్ణి బలవంతపెట్టి అతడు కత్తిని పట్టుకోగా తాను దానిమీదపడి ప్రాణాలు తీసుకొంటాడు. ఆస్థలానికి ఆంటోనీ, ఆక్టేవియస్‌లు వచ్చి బ్రూటస్‌ను స్తుతించి ఆయన కుచితమర్యాదలతో అంత్యక్రియలు జరిపిస్తామని ప్రకటిస్తారు; కీర్తిప్రతిష్ఠలను పంచుకోటానికి నిష్క్రమిస్తారు.

నాటక నామకరణం :

సీజర్ ఈనాటకంలో మూడుదృశ్యాలల్లో తప్ప కనిపించడనీ, అప్పుడైనా కొన్ని గర్వోద్ధతవాక్యాలు తప్ప ప్రసంగించడనీ, నాటకానికి నిజమైన నాయకుడు బ్రూటస్ కావటంవల్ల దీనికి 'మార్కస్ బ్రూటస్' అని నామకరణంచేయటం ఉచిత మనీ విమర్శకులు కొందరు సూచిస్తున్నారు.

'జూలియస్ సీజర్' నాటకానికి నాయకుడు బ్రూటస్ ఐనప్పటికీ షేక్స్పియర్ ఈనాటకానికి ఉచితంగానే నామకరణం చేసినట్లు కన్పిస్తున్నాడు. సీజర్ చారిత్రాత్మకంగా సుప్రసిద్ధుడు; బ్రూటస్ పేరు ప్రేక్షక లోకంలో ఎక్కువమందికి తెలియదు. ఇది చారిత్రాత్మక నాటకం. ఈజాతి నాటకాలను సర్వసామాన్యంగా మహారాజుల పేర్లు చక్రవర్తులనామాలు ఉంచటం పరిపాటి. సీజర్‌ను సామ్రాట్టునుగానే జనసామాన్యం భావిస్తుంటుంది. కనక సీజర్‌ను సంబంధించిన నాటకానికి "జూలియస్ సీజర్" అని నామకరణం చేయటమే సమంజసమని షేక్స్పియర్ భావించిఉంటాడు. అంతేకాదు. నాటకంలో బ్రూటస్ నాయకుడుగా దృశ్యమానుడౌతున్నా నిజానికి సీజరే 'అశరీర నాయకుడు'. విద్రోహవర్గం సీజర్ వధను పథకాలను వేసుకొంటున్నప్పుడు "మనం మందరం సీజర్ తత్వాన్ని ఎదుర్కొందాం" అని అనటమూ, తృతీయాంక ప్రథమదృశ్యంలోనే సీజర్ వధ జరిగిపోయినప్పటికీ తదనంతరకథ నంతటిని అతడి ప్రభావం నడపించటమూ, నిరంకుశత్వంతో వ్యవహరించిన అతనిభూతిమూర్తి, 'మరణించినా సీజర్, నీవు బలవంతుడవే' అని ఆత్మహత్య చేసుకోబోతూ కాషియస్ చేసిన ప్రశంస మొదలైనవి 'జూలియస్ సీజర్' అని నాటకానికి నామకరణంచేయటంలో గల సామంజస్యాన్ని వెల్లడిస్తున్నవి. నిజానికి నాటకకథాచక్రపరివర్తనకు ఆధారం సీజర్ నిరంకుశత్వం. అతడు దేహంతో పాల్గొనటం అప్రధానం. నాటకాంతంలో విజయాన్ని పొందింది ఆక్టేవియస్ కాదు; ఈనిరంకుశత్వమే. అందువల్ల 'జూలియస్ సీజర్' అన్న నామం ఈనాటకానికి తగిఉందని చెప్పటంలో ఎట్టి విప్రతిపత్తి లేదు.

జూలియస్ సీజర్ - అధారాలు

జూలియస్ సీజర్‌లోని కథావస్తువు సర్వజనీనమూ, సర్వకాలికమూను. సర్వదేశాలల్లో, సర్వకాలాలల్లో నివసించే ప్రజలకు ఇది ఒక పాఠాన్ని నేర్పుతున్నది. ఇట్టికథావస్తువుమీదికి మహాకవి షేక్స్పియర్ దృష్టి ప్రసరించింది; 'జూలియస్ సీజర్' నాటకం అవతరించింది. ఈనాటకరచనకు షేక్స్పియర్ కొన్ని ఆధారాల సహాయాన్ని తీసుకున్నాడు.

షేక్స్పియర్‌కు జూలియస్ సీజర్ నాటకరచనలో తోడ్పడ్డ ఆధార

గ్రంథాలల్లో ప్రధానమైనది ప్లూటర్క్ చరిత్రకారుడి 'జీవితాలు'. ఆయనకు గ్రీక్ లాటిన్ భాషలు బాగా రావు. అందువల్ల ప్లూటర్క్ జీవితా లన్న గ్రంథానికి నార్త్ అనువాదాన్ని ఆధారం చేసుకొని ఉంటాడు. ఆ అనువాదం లోని దోషాలు కొన్ని షేక్స్పియర్ నాటకాల్లో కూడా కనిపిస్తున్నవని కొందరు విమర్శకు లంటున్నారు. సీజర్ ఇచ్ఛాపత్రాన్ని వినిపించే సందర్భం లోను ఆంటొనీ, బ్రూటస్, లెపిడస్ లు చేసిన ప్రసంగాలకు కావలసిన అంశాలను షేక్స్పియర్ ఎప్పియన్ వ్రాసిన 'రోమనుయుద్ధాలు' అన్న గ్రంథంనుంచి గ్రహించాడు. సీజర్ ను హత్యచేసినప్పుడు బ్రూటస్ ను చూచి 'నీవుకూడానా!' అని షేక్స్పియర్ చేత అనిపించాడు. ఇందుకు ప్లూటర్క్ లో ఎట్టిఆధారం లేదు. అతణ్ణి కాస్కా హత్యచేయగానే లాటిన్ భాషలో సీజర్ "ఓరీ అధమద్రోహీ, కాస్కా! ఏంచేశావు?" అన్నట్లుంది. కానీ సీజర్ గ్రీక్ భాషలో బ్రూటస్ తో "నీవుకూడానా నాతండ్రీ!" అన్నట్లు సుయటోనియస్ రచనవల్ల తెలుస్తున్నది. ఇతడి రచనను ఆధారంగా చేసు కొని ఒకలాటిన్ నాటకం జన్మించిం దనీ దానివల్ల షేక్స్పియర్ జూలియస్ సీజర్ కు ముందే పుట్టిన అనేకరచనల్లో 'నీవుకూడానా బ్రూటస్' అన్న లాటిన్ వాక్యంప్రసిద్ధమైం దనీ, దాన్నే ఆయన గ్రహించిఉంటాడనీ విమర్శ కులు అభిప్రాయపడుతున్నారు. షేక్స్పియర్ సీజర్ హత్యను దేవమంది రంలో (కాపిటోల్) పెట్టాడు. అది సత్యానికి పాంపేనాటకశాలావలపే ప్రదేశానికి ప్రక్కనే ఉన్న 'క్యూరియా పాంపేనియా'లో జరిగింది. ఈ మార్పు చాసర్ మహాకవి 'మంక్స్ టేల్'లోనే ఉంది. ఆచారంగా వస్తూ ఉన్న ఇది దోషమైనా సీజర్ వధను మహానగరోపకంఠసీమలో ఉన్న దేవ మందిరంలోనే కల్పించటంవల్ల నాటకంలో ఆసన్నివేశానికి ఉత్కర్ష చేకూరుతుందని భావించి షేక్స్పియర్ అనుసరించి ఉంటాడు. కొందరు షేక్స్పియర్ జూపిటర్ దేవమందిరాన్నే 'సభాభవనం' మని భ్రమపడ్డా డంటారు.

## షేక్స్పియర్ : ప్లూటార్క్

జూలియస్ సీజర్ నాటకంలో ప్రదర్శితమయ్యే నాటకకర్త ప్రతిభతప్ప తక్కిన సమస్తం షేక్స్పియర్ కు ప్లూటార్కు చేకూర్చి ఇచ్చాడు. ప్లూటార్కు

రచనతో ఈనాటకాన్ని పోల్చిచూస్తే సమస్తం అందులో గోచరిస్తుంది. షేక్స్పియర్ మహాకవి తాను వ్రాసిన ఆంగ్లదేశచరిత్రకు సంబంధించిన నాటకాల్లో తీసుకున్న స్వేచ్ఛను ఈనాటకవిషయంలోగానీ, ఇతరరోమక నాటకాలవిషయంలోగానీ తీసుకోలేదు. షేక్స్పియర్ చెప్పిన ఆంగ్లదేశ చారిత్రకనాటకాలకు కావలసిన వస్తువునిచ్చిన హాలిన్షెడ్‌కు రోమకచారిత్రక నాటకాలకు కావలసిన వస్తువునిచ్చిన ప్లూటార్క్‌కు ఎంతో విభేదం ఉంది. ఈవిషయాన్నే ఒక అనుభవజ్ఞుడు ఇలాచెప్పాడు: “షేక్స్పియర్‌కు హాలిన్షెడ్ తరువాత తాల్చి బాగుచేసుకోవలసిన అపరిష్కృతలోహాన్నిస్తే కవి కళాదుడు తీర్చిదిద్దవలసిన నగిషీమినహాగా సర్వం ప్లూటార్క్ తానే ఏర్చి కూర్చిఇచ్చాడు. అందువల్ల షేక్స్పియర్‌కు స్వల్పమైన మార్పులుచేసి సీజర్, బ్రూటస్, ఆంటొనీల జీవితాల్లోనుంచి పుట తరువాత పుట గింపుకోటంతప్ప వేరే పనిలేకపోయింది.”

షేక్స్పియర్ ప్లూటార్క్‌దగ్గరనుంచీ మొత్తం కథను గ్రహించాడు. లూసియస్ తప్ప మిగిలిన పాత్రల నందరినీ స్వీకరించాడు. నాటకంలో కనిపించే పాంపేపుత్రులపై సీజర్ విజయం, ఇరువురు ధర్మాధికారులు (మరులియస్, ఫ్లేవియస్‌లు) ప్రజలను నిందించి చెదరగొట్టటం, లూపర్ కేలియా ఉత్సవాలు, ఆంటొనీ సీజరుకు చేసిన కిరీటప్రదానం, బ్రూటస్ పోర్షియాలసంభాషణ, సీజర్ పతనాన్ని సూచించే శకునాలు, కల్పూర్నియా పట్టుదల, డెసియస్‌బ్రూటస్ సీజర్‌ను ఒప్పించటం, శకునజ్ఞుడు, ఆర్టిమిడోరస్‌లు సీజర్‌కు చేసిన సూచనలు, హత్య, ఆంటొనీప్రసంగం, ఇచ్ఛాపత్రిపఠనం, సిన్నామరణం, సీజర్ భూతరూపదర్శనం, ఫిలిప్పీయుద్ధం, కాషియస్‌బ్రూటస్‌లమరణం అన్నీ ప్లూటార్క్‌లో ఉన్నవే. సీజర్ నుస్తి, మూఢనమ్మకాలమీద అభిమానం, ఆంటొనీవిలాసప్రియత్వం, సిసెరోగ్రీక్ భాషాభిమానం, కాసియస్ ‘పలచని ఆకలి చూపు’ అతని ఎపిక్యూరస్ అనుయాయిత్వం, అతని కోపస్వభావం, అన్నీ ప్లూటార్క్‌నుంచి సంగ్రహించినవే.

షేక్స్పియర్ ప్లూటార్క్‌కు భిన్నంగా కొన్నికల్పనలు చేశాడు. అరునెలలనాడే (సెప్టెంబరు 45 క్రీ. పూ, సీజర్ ‘విజయయాత్ర’ నుంచి తిరిగివస్తే ఈ అంశాన్ని షేక్స్పియర్ లూపర్కల్ ఉత్సవంనాటికి 15 మార్చి 44

క్రీ. పూ.) మార్చినాడు. సీజర్ హత్య క్యూరియాపాంపేలో జరిగితే దాన్ని దేవమందిరానికి మార్చాడు. హత్య మార్చి 15 న ఇచ్ఛాపత్ర ప్రచురణ మార్చి 18 న, అంత్యక్రియలు మార్చి 19 న, జరిగినవి. ఆక్టేవియస్ మే నెల దాకా రాలేదు. షేక్స్పియర్ అన్నీ ఒకనాడే జరిగినట్లు కల్పించాడు. 'వీరత్రయకూటమి' బొలోనియాలో కలుసుకుంటే షేక్స్పియర్ అసంఘటన రోంలోనే జరిగినట్లు చెప్పాడు. ఫిలిప్పీలో జరిగిన రెండుయుద్ధాలకు మధ్య ఇరవై రోజుల వ్యవధి ఉంది. షేక్స్పియర్ దాన్ని ఎత్తివేశాడు. కాలవ్యవధిని, సన్నివేశబాహుళ్యాన్ని తగ్గించి విషాదాంతస్థాయిని పట్టటంకోసం నాటకతత్వాభిజ్ఞుడైన షేక్స్పియర్ ఈ మార్పులు చేసిఉంటాడు. ప్లూటార్క్‌లో కేవలం సట్టికగా ఇచ్చిన శకునాలను, మహాత్సంభవాలనూ అతినైపుణ్యంతో షేక్స్పియర్ సమయోచితంగా ఉపయోగించుకొన్నాడు. ప్లూటార్క్‌లోని బ్రూటస్ క్రూరశక్తినే షేక్స్పియర్ సీజర్ భూతాకృతితో సమన్వయించాడు. ప్లూటార్క్ ఇచ్చిన కొద్దిసూచనలతో ఆంటొనీ మహా ప్రసంగాన్ని కల్పించటం, పోర్షియావర్ణనలోనూ, పాత్రపోషణలోనూ కన్పించే ప్రావీణ్యం, సిన్నాహత్యలో గోచరకమయ్యే పరిహాసరేఖలు, అక్కడ ప్రదర్శించిన జనసామాన్యస్వభావచిత్రణమూ ఇత్యాదులన్నీ షేక్స్పియర్ ప్లూటార్క్‌పై దిద్దిన వన్నెచిన్నెలు.

## షేక్స్పియర్ పాత్రోన్మీలనం — మార్పులు

షేక్స్పియర్ చిత్రించిన సీజర్ చరిత్రలో కన్పించే ప్రపంచాగ్రగామియైన మహావీరుడు, మహారాజనీతిజ్ఞుడు కాడు. అతడికి వైభవప్రియత్వం, గర్వోన్మత్తత, ఔద్ధత్యం, స్తోత్రప్రియత, కొన్ని శారీరక మానసికదౌర్బల్యాలను షేక్స్పియర్ మహాకవి కల్పించాడు. నిజానికి చరిత్రలో తోచే సీజర్‌నే చిత్రిస్తే ప్రేక్షకులకు విద్రోహవర్గంమీద అణుమాత్రమైనా అభిమానం ఉండటానికి తావుండదు. బ్రూటస్, కాషియస్‌లకు ఆదర్శాన్నిచ్చి షేక్స్పియర్ వారి పాత్రలను పోషించాడు. సీజర్ సామ్రాజ్యతత్వ ప్రవక్త; అతడికి ప్రతిగా ప్రజాస్వామికతత్వప్రవక్తనుగా బ్రూటస్‌ను తీర్చిదిద్ది షేక్స్పియర్ ప్లూటార్క్‌లో కనిపించే అతడిలోపాలనన్నింటినీ వదిలివేశాడు. మహానగరరక్షణాధికారవిషయంలో బ్రూటస్, కాషియస్‌లు ప్రత్యర్థులు.

అందువల్ల వారిద్దరిమధ్యా సన్నిహితత్వం లేదు. ప్లూటార్క్‌లో కన్పించే ఈ అంశాన్ని కొంతగా గ్రహించి వారిద్దరిమధ్య అసన్నిహితత్వాన్ని ప్రథమాంక ద్వితీయదృశ్యంలో ప్రదర్శించాడు గాని షేక్స్పియర్ అందుకు బ్రూటస్ మహాశయుని హృదయాంతస్సంఘర్షణాన్ని కారణంగా కల్పించాడు. అంతేకాక బ్రూటస్‌ను సీజర్‌కు సన్నిహిత మిత్రుణ్ణి చేశాడు. దీనివల్ల బ్రూటస్‌ను ఒక ఆదర్శంకోసం నిలిచి మిత్రుణ్ణికూడా హత్యచేయటానికి వెనుకాడని నీతిపురుషుణ్ణిగా చిత్రించటం జరిగింది. పోర్షియా బ్రూటస్‌ను వివాహమాడకపూర్వం బిబులస్ అనే భర్తను చేపట్టి అతడివల్ల ఒక కుమారుణ్ణి పొందినట్లూ, అతడు కథాకాలంనాటికి యవ్వనదశ ననుభవిస్తున్నట్లూ ప్లూటార్క్. బ్రూటస్ వంటి అత్యుత్తమవ్యక్తికిది కళంకాపాదకం కాబట్టి తొలగించి బ్రూటస్‌దంపతుల ప్రణయాన్ని ఆదర్శయుతంగా చిత్రించాడు షేక్స్పియర్. చతుర్థాంకంలోని బ్రూటస్‌కాషియస్‌లకలహం మానవత్వసముపేతమై మహోదాత్తంగా నడవటానికి కారణం షేక్స్పియర్ ప్రతిభే. సీజర్‌కు ప్రథమానుచరుడుగా ఉన్న అంటొనీ పాత్రను ప్లూటార్క్‌లో ఉన్న అంటొనీ పాత్రకంటే ఉదాత్తునిగా సృష్టించి షేక్స్పియర్ వన్నెపెట్టాడు.

లుసియస్ పాత్రసృష్టి, అతడికీ యజమానియైన బ్రూటస్‌కుమధ్య ఉన్న సంబంధం నాటకకర్త కల్పనే. షేక్స్పియర్ చిత్రించిన కాస్కాపాత్రకు ప్లూటార్క్‌లో ఆధారం లేదు. ద్వితీయాంక ప్రథమదృశ్యంలోని బ్రూటస్ స్వగతం నాటకకర్త ప్రతిభాజన్యం. ప్లేటోత్వతాన్ని అనుసరించే బ్రూటస్ సీజర్‌ను హత్యచేయటానికి పూనుకోవటంమకు ఇది ఎంతో తోడ్పడ్డది. ఆర్టిమిడోరస్‌కు సీజర్ సమాధానాలు, కాషియస్‌తప్ప మిగిలిన విద్రోహవర్గంలో అందరూ కలిసి సీజర్‌ను సభాభవనానికి తీసుకొనిపోవటానికి ఆయన ఇంటికికలిసిరావటం, ఈతనుగురించిన కాషియస్‌సంభాషణం, వధాదృశ్యంలో సీజర్‌సంభాషణ, సీజర్ మానసికశారీరక దౌర్బల్యం, నాలుగో అంకంలో సంగీతాన్నిప్రవేశపెట్టి సేనాపతులమధ్య కలిగిన కల్లోలాన్ని కప్పిపుచ్చటం, బ్రూటస్ కాషియస్‌ల వీడ్కోలు సంభాషణలు, టిటినియస్ కాషియస్‌ను మాలాలంకృతుణ్ణి చేయటం ఇత్యాదికల్పనలన్నీ షేక్స్పి

యర్ వే. నాటకీయప్రదర్శనాపరిపుష్టికోసం, పాత్రపోషణంకోసం షేక్స్పియర్ చేసిన మార్పులవల్లనే "జూలియస్ సీజర్" ఒక అద్భుతదృశ్య కావ్యంగా పరిణమించి సర్వకాలీనమైన సాహిత్యసృష్టి ఐనదనటంలో ఎటువంటి సందేహం లేదు.

## నాటక నిర్మాణం :

నిర్మాణవిషయంలో ఎట్టిక్లిష్టతా లేకపోవటంలో జూలియస్ సీజర్ విశిష్టమైన నాటకం. ఇది ఏకవస్తుకము; ప్రాసంగికాదులు లేవు. ఇందులో సన్నివేశాలు బహుస్వల్పాలు; అలాగే పాత్రలూను. ఈవిషయాలల్లో ఇది మేక్బెత్ ను పోలిఉంది. షేక్స్పియర్ మహాకవికృతాలైన లియర్, ఆంటొనీ-క్లియోపాత్రాలవంటి విషాదాంతనాటకాలకు ఇది చాలా భిన్నమైంది. లియర్ రాజులో ప్రాసంగికకథావస్తువు ఉంది; ఆంటొనీక్లియోపాత్రాలో క్లిష్టసన్నివేశ బాహుళ్యం కనిపిస్తున్నది.

నిరంకుశప్రభువైన సీజర్ వధవరకూ విద్రోహవర్గానికి తాత్కాలిక విజయమైనా, వారిపతనంతో, రోంపౌరుల స్వాతంత్ర్యవినాశనంతో, రాచరికం పునరుద్ధరింపబడటంచేత అంతంలో దానికి పరాజయం అన్నది జూలియస్ సీజర్ నాటకానికి వస్తువు.

సీజర్ హత్య, బ్రూటస్ మరణం లేదా సీజర్ హత్య, ప్రతీకారం — అన్న రెండువిభాగాలుగా నాటకం నడిచింది. కాబట్టి ఇది నిర్మాణాత్మకమైన దోష మని విమర్శకులుకొందరు పదేపదే సూచిస్తూవచ్చారు. కానీ నిర్మాణంలోవారు భావించే టంతటి అనిబద్ధత గోచరించటం లేదు. కొందరు సూచించినట్లు 'బ్రూటస్' అని నాటకాన్ని వ్యవహరించి నంతమాత్రంచేత గూడా ఈఅనిబద్ధత తొలగిపోయి వస్త్వైక్యం చేకూరదు. షేక్స్పియర్ ప్లూటార్క్లో లభించిన వస్తువును యథాతథంగా గ్రహించి నాటకీకరణం చేశాడేగాని నిర్మాణవిషయంమీద దృష్టి నిల్పినట్లు కన్పించదు. అయినా నాటకమంతటిలోనూ అనుస్యూతంగా ఒక సూత్రం గోచరిస్తున్నది. అదే నిత్యాభివృద్ధిని పొందుతున్న అనివార్యమైన రాజరికశక్తి. ఇది నాటకానికి నిర్మాణసంబంధమైన ఐక్యతను ఇచ్చిన దని చెప్పవచ్చు. 'ప్రాయశ్చిత్త' మనేభావం నాటకంలో సర్వేసర్వత్రా గోచరిస్తున్నది. 'చేసినక్రియకు

ఫలాన్ని అనుభవించితీరాలి'. పాంపేప్రత్రులవధించి విజయం చేకొన్నా నన్న గార్వాహంకారాలకు తగ్గ ప్రాయశ్చిత్తాన్ని సీజర్ అనుభవించాడు. విద్రోహవర్గం సీజర్‌ను వధించి తగ్గప్రాయశ్చిత్తాన్ని పొందారు. అందువల్ల ఈ ప్రాయశ్చిత్తభావంకూడా నిర్మాణైక్యతను కొంతవరకు చేకూరుస్తున్నది.

రాజకీయభావం : గుణపాఠం

'జూలియస్ సీజర్' వల్ల అభివ్యక్తమయ్యే రాజకీయభావం ఏమిటి? ఈ ప్రశ్నకు విమర్శకులు ఇలా సమాధానం చెబుతున్నారు. "ప్రతిజాతికీ దాని యోగ్యతనుబట్టి ఉత్తమప్రభుత్వం ఏర్పడుతుంది. ఒకక్రూరపాలకుణ్ణి హత్యచేసినందువల్ల ప్రయోజనం ఏమీఉండదు; అతడిస్థానే మరొకడు వస్తాడు. భ్రమప్రమాదరాహిత్యంవల్ల పాలకులశీలంలో పరివర్తన కలగదు. జాతి నిర్మించిన రాజకీయసంస్థలో మార్పు కలగాలనంటే జాతిలోని జన సముదాయమంతటిలోనూ శీలపరివర్తన జరిగితీరవలసిందే." 'జూలియస్ సీజర్' నాటకంలో ప్రజాస్వామికం పతనమై నిరంకుశత్వం తలయెత్తటం ప్రదర్శితమైంది. జనసామాన్యబుద్ధిహీనతను దీర్ఘదృష్టితో దర్శించిన మహా మేధావి సీజర్ తాను నిరంకుశుడు కావటానికి ప్రయత్నా లారంభించాడు. ప్రజలు రాచరికంవంకే మొగ్గచూపటంవల్ల ప్రజాస్వామికానికి ప్రమాదం ఉందని భ్రాంతిచెంది బ్రూటస్ సీజర్‌ను హతమార్చాడు. ప్రజాస్వామిక విధానస్వరూపం జీర్ణంకాని ప్రజలు అతణ్ణే సీజర్‌ను చేయటానికి ఉద్దేశ పడ్డారు. తుదకు ప్రజలచిత్తచాంచల్యంవల్ల ప్రజాస్వామికోద్ధరణయత్నం వీగిపోయింది; నిరంకుశత్వం విజయంపొందింది. హత్యవల్ల ఒకసీజర్‌ను తొలగిస్తే మరోసీజర్ ఆస్థానాన్ని ఆక్రమించాడు. రోమనులు మహత్తర సామ్రాజ్యాన్ని నిర్మించుకున్న తరువాత ఇంకా ప్రజాస్వామికవిధానాన్ని నిలుపుకోటానికి యత్నించటమే దోషం. హత్య మహాదోషం; దానికి ఫలాన్ని అనుభవించవలసిందే. అందులో రాజకీయహత్య దేశసౌభాగ్యానికే దెబ్బ. జూలియస్ సీజర్ వధానంతరం ప్రమాదోపేతాలైన తత్ఫలితాలను రోం అనుభవించక తప్పిందికాదు.

పాత్రగత గుణపాఠం

సీజర్ వధ, తత్ఫలితాలను కథావస్తువుగా గల సీజర్ నాటకానికి

విషాదాంతనాయకుడు బ్రూటస్. అతడు హృదయాశయసౌందర్యాల రెంటినీ కలిగిన అభ్యుదాత్తుడైన వ్యక్తి అని అందురూ అంగీకరించితీరవలసిందే. ప్రబలశత్రువైన ఆంటొనీకూడా అంగీకరించాడు. కానీ అతడు తాను చేసినది హత్య అనీ తాను హంతకుడననీ ఊహించనైనా లేదు. కారణం రాజకీయమైతే నేం మరేదైతే నేం హత్యే హత్య. దానిఫలితాన్ని అనుభవించి తీరవలసిందే. భగవంతునిఆజ్ఞ, మానవధర్మశాస్త్రం రెండూ దాన్ని నిషేధించాయి. మహోత్తముడైన బ్రూటస్ ఈహత్యఅనే ఏకైకదోహంవల్ల తన జీవితనౌకాభంగానికే కాకుండా జాతిజీవితసాంయాత్రికతకు మహాభంగాన్ని కల్పించాడు. బ్రూటస్ చేసిన నేరానికి అనుభవించిన శిక్ష కేవలం కాలం, చరిత్ర కల్పించినవి కావు; షేక్స్పియర్ సృష్టించింది అంతకంటే కాదు. భగవత్ప్రేరణవల్ల సంఘనైతికశాసనం విధించింది. 'దౌష్ట్యంవల్ల సౌభాగ్యం ఏనాడూ చేకూరదు; చేకూరినా అది తాత్కాలికమే గాని సుస్థిరమైంది కాదు' అన్నది షేక్స్పియర్ మహాకవి బ్రూటస్పాత్రమూలంగా లోకానికి నేర్పిన నిత్యసత్యమైన గుణపాఠం.

## పాత్రలు

## సీజర్

రోమకు చరిత్రలో కనిపించే సీజర్ ధీరోదాత్తుడు. మహాసేనాని రాజకీయప్రజ్ఞాధురంధరుడు. జూలియస్‌సీజర్ నాటకంలో మహాకవి షేక్స్పియర్ సీజర్‌ను కొంతగా లోపాలకు లోనైనవానినిగా చిత్రించాడు. ఇందులో సీజర్ వ్యాధిగ్రస్తుడు, దుర్బలుడు. కాషియస్‌తో ఈతలో ఓడిపోవటం, సుస్తిచేసినపుడు ఆడపిల్లలా ఏడవటం, చెవుడు, కిరీటప్రదానసమయంలో మూర్ఛపోవటం బహుశః కాషియస్‌ను చూచి భయపడటం అతని కంటే బలహీనుడు కావటంవల్లనేమో! ఇంతను నిదర్శనాలు భుజశక్తితో ప్రబలులైన శత్రువులను ఎందరినో జయించినా అతనికి అంధవిశ్వాసాలు తప్పలేదు. లూపర్‌కేలియా ఉత్సవాల్లో ఆంటొనీని కల్పూర్నియాను స్పృశించమని కోరాడు. యాజ్ఞికులు శకునాలు అనుకూలంగా లేవని చెప్పించినప్పుడు అంతను స్వప్నమే కల్పూర్నియా కలను గురించి భయపడుతున్న అనేడు సభా

భవనప్రయాణాన్ని మానుకున్నాడు. సభాసభ్యులు కిరీటప్రదానం చేద్దామని నిర్ణయించుకున్నట్లు డెసియస్ బ్రూటస్ తెలియజేసిన తరువాత అతని రాజ్యాధికార లోభం, ఆశాపరిగతం అతణ్ణి సభకు రప్పించాయి. స్తోత్రపాత్ర మంటే తనకు గిట్టనట్లు ప్రసంగాలల్లో పదేపదే ప్రకటించుకున్నా అతడికి స్తోత్రపాఠమన్నా, స్తోత్రపాఠకు లన్నా మహాభిలాష. 'మీకు స్తోత్రపాఠ మంటే గిట్టదని నే నంటే స్తోత్రప్రియుడైతే అతడు ఔనంటాడు' (అం ౨ దృ౧) అన్న డెసియస్ బ్రూటస్ వాక్యం ఇందుకు నిదర్శనం. సభాభవనంలో అతడి ప్రవర్తన, సభాసభ్యులతో అతడు జరిపిన సంభాషణలు సీజర్ గర్వోన్మత్తతనూ, ఔద్ధత్యాన్ని, నిరంకుశత్వాన్ని నిరసనభావాన్నీ నిరూపిస్తున్నవి.

ఇంతమాత్రంచేత షేక్స్పియర్ సీజర్‌ను సంపూర్ణంగా లోపభూయిష్టుణ్ణిగా చిత్రించ దలచాడని భ్రాంతి పడరాదు. ఆయన ఘనతనుకూడా చిత్రించాడు. అయితే ఈచిత్రణలో సీజర్‌ను 'ఆత్మనిష్ఠుణ్ణి' చేసి తనఆధిక్యాన్ని తానే విశేషంగా వ్యక్తీకరించుకొనే నిరంకుశుణ్ణిచేశాడు. కొన్ని లోపాలున్నప్పటికీ షేక్స్పియర్ చిత్రించిన సీజర్‌కు ఇతరులను ఆకర్షించే రూపంగానీ, వ్యక్తిత్వంగానీ లేకపోలేదు. వీటితో అతడు ఇతరులను భయభ్రాంతులను చేయగలడు. రోమకసామ్రాజ్యంలో అతడు ప్రథమవ్యక్తి. పూర్వం అతడు చేకొన్న విజయాలు అతడికి అట్టి అద్వితీయ స్థానాన్ని కల్పించాయి. ప్రభువర్గం సామాన్యజనం ఇరువురూ అతడి ప్రభావానికి ప్రస్తుతం తలఒగ్గుతున్నారు. అతడికోపం నాటి ప్రళయం. ఆంటొనీ "సీజర్ ఇది చెయమంటే అది జరిగిపోయినట్లే" అని అనటం, కాస్కా సీజర్ మాట్లాడబోయే ముందు ఏదో దేవవాణి వినిపించు నున్నట్లు "శాంతించింది సీజర్ మాట్లాడుతున్నా" డనటం, మెటలస్ సింబర్ అతణ్ణి దేవతామూర్తిగా భావించి వ్యవహరించటం, కాసియస్ చేసిన 'ఎందుకయ్యా! అతడు కొలొసస్ లాగా ....' ఇత్యాది ప్రసంగం, సీజర్ ప్రభువర్గంమీద ఎట్టిప్రభావాన్ని కలిగించాడో ఊహించవచ్చుననటానికి కొన్ని నిదర్శనాలు. ఇక సామాన్యజనానికి అతడు లేని రోమక సామ్రాజ్యమే లేదు. "నాకు సీజర్ ఉండాలి" ... సింహాసనం. సీజర్ వ్యక్తిత్వానికి ఘనతను 'సీజర్! నీవు గణించినా ... కాలం

నిన్ను చంపిన కత్తితోనే ప్రతీకారాన్ని పొందావు; నీవు మరణించినా బలవంతుడవే' అన్న మరణసమయాలల్లోని బ్రూటస్ కాషియస్ వాక్యాలకంటే ప్రబలనిదర్శనా లింకేమి కావాలి? అతడి శరీరాన్ని రూపుమాపినా అతడి శక్తి జీవించి విజయం చేకొన్న దని గ్రంథంలోని యావన్మందీ అంగీకరించారు. షేక్స్పియర్ సీజర్ పాత్రను శారీరక మానసిక, నైతికదౌర్బల్యాలను కొన్నింటిని కల్పించటం విగ్రహారాధనమీద కొంతగా అభిమానాన్ని కల్పించటంకోసం కావచ్చు.

కొందరు విమర్శకులు సరియైన సీజర్ ను 'జూలియస్ సీజర్'లో సీజర్ భీరుత్వం, అస్థిరత్వం, చిత్తచాంచల్యాలతో కూడిన పరిహాసరూప మని భావించారు. అది పొరబాటు. భార్య ప్రార్థనమీద సభాభవనానికి పోనని మాటఇచ్చి తరవాత డెసియస్ బ్రూటస్ ప్రసంగంవల్ల మారిపోవటంచేత ఇలా తోచినా అందులో చిత్తచాపల్యంగాని, అస్థిరత్వంగాని, భీరుత్వంగాని లేదు. భార్యను సంతోషపెట్టటానికి మొదట మాటిచ్చాడు. తరువాత కిరీటంమీది ఆశాపహృతంవల్ల నైతేనేం నిర్భయత్వ, వ్యక్తిత్వప్రకటనలకోసమైతేనేం సమస్తాన్ని ధిక్కరించి సభాభవనానికి వచ్చాడు.

షేక్స్పియర్ సీజర్ ఘనతను ఎరుగనివాడు కాడు. ఆయన అతణ్ణి వాతావరణంమీద ఆధారపడని స్వయంవ్యక్తినిగా సృజించాడు. అతడికి జన్మతః సంభవించిన అధికారాధిక్యాన్ని నిర్భయత్వాన్ని, సర్వవ్యాపిత్వాన్ని, సార్వభౌమత్వాన్ని ఆపాదించాడు. ఎప్పుడైనా ఇంచుక భీరుత్వం, చాంచల్యం గోచరిస్తే అది అతడిలోని మానవత్వావేశంవల్లనే. మానవుడై ఉండి తనకు దివ్యత్వాన్ని ఆపాదించుకొని దెబ్బతిన్న వ్యక్తి సీజర్.

## బ్రూటస్

విజ్ఞాని దేశభక్తుడు, నీతిప్రవర్తకుడు. ప్రియహృదయుడు, ఉదాత్తమానవుడు. నీతి నియమాలతో శౌచగుణభూయిష్ఠుడై ప్లేటో తత్వశాస్త్రమార్గాన్ని గవేషిస్తూ తనజీవితాన్ని తీర్చిదిద్దుకొన్న మహోదారమూర్తి బ్రూటస్. ఉత్తమాశయుడు. ఆశయసాధనలో అచంచలదీక్షాపరుడు. వ్యక్తిగతాద్వేషాలకు లొంగని ఉదాత్తాశయానికి స్వస్తిచెప్పని మహనీయుడు. మానవ

స్వభావపరిణామంలో ప్రజ్ఞాలోపంవల్ల దెబ్బతిన్న వ్యక్తి. మానవనీతికి వెరిచి ఆంటొనీ ప్రాణహరణానికి ఒప్పుకోకపోవటంవల్ల అతడికి ప్రమాదం చేకూరింది. ఆంటొనీశక్తిని అపార్థం చేసుకొన్నాడు. ఇతరులను అతితీక్ష్ణమైన నైతికనిబంధనలతో కొలిచి చూచే స్వభావంవల్ల ఇతను సీజర్ హత్య తన కొక రాజకీయ కర్తవ్యమని భావించి నిర్వహించాడేగాని నైతికశాస్త్ర దృష్ట్యా తానొక 'హంతకు' డన్న ఊహ ఆయనకు కలగలేదు. బ్రూటస్ కేవలం స్వాప్నికుడు, ఆదర్శారాధకుడు. కాషియస్ కున్న రాజనీతిజ్ఞతలో ఏకాంతభాగమున్నా ఆయనకు అపజయం చేకూరేదికాదు. అయితే ఇప్పటివలె ఉదాత్తమానవుడని అనిపించుకోగలిగి ఉండేవాడు కాదు. స్వభావతః తనప్రవృత్తికి విరుద్ధమైన రాజకీయాధిక్యసంపాదనను పూనుకొని క్లేశాన్ని తెచ్చిపెట్టుకొన్నాడు. అపజయాన్ని పొందాడు. అయినా విజయాన్ని సాధించిన ఆక్టేవియస్ ఆంటొనీలకంటె అత్యధికంగా యుగయుగాల మానవహృదయాలను ఆకర్షించి అభిమానాన్ని చూరగొన్నాడు. బ్రూటస్ నామానికి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో దృఢానుబంధంఏర్పడి అతడికి ప్రపంచ మానవస్వేచ్ఛాప్రయత్నచరిత్రలో నిత్యత్వాన్ని కల్పించింది.

ఆత్మమిత్రుడైన సీజర్‌ను రోంస్వేచ్ఛకోసం బలిఇవ్వటానికి ఎంతో ఆత్మబలం, దేశాభిమానం అవసరం. "సీజర్‌ను హత్యచేసింది నేను అతణ్ణి తక్కువగా ప్రేమిస్తున్నానని కాదు; రోంను అంతకంటే అధికంగా ప్రేమించటం వల్ల" అన్న ఆయనమాటల్లో అసత్యం అణుమాత్రం లేదు. ఇందు ఆయనకు శత్రువైన ఆంటొనీ బ్రూటస్‌మృతకళేబరాన్ని చూచి చేసిన ప్రసంగంలోని "సంఘసంక్షేమాన్ని భావించి వీరిలో (విద్రోహకవర్గంలో) చేరింది ఇతడొక్కడే." అన్న వాక్యాలు నిదర్శనం. ఆఆంటొనీయే బ్రూటస్‌ను సద్గుణసంపన్నుడని శ్లాఘించాడు. బ్రూటస్ ఆదర్శజీవి. విద్రోహకవర్గంలోని ఇతరసభ్యులందరూ తనవలెనే మహోత్తమాశయసిద్ధి కోసం తనవంటి పవిత్రహృదయంతోనే సీజర్ హత్యను పూనుకుంటున్నారని భ్రమపడ్డాడు. వారి వ్యక్తిగతవిద్వేషాలను ఈర్ష్యాదిదుర్గుణాలను గమనించలేకపోయ్యాడు. వారికి నిరంకుశత్వనిర్మూలనంకంటే సీజర్ మృతి కావాలి. అతడికి అవకాశం ఉంటే సీజర్‌ను సజీవుణ్ణిగా నిల్పి అతడినిరంకుశతత్వాన్ని

వినాశనం చేస్తే గాని. ఈ అపార్థాయాలవల్లనే ఆంటొనీనికూడా చంపాలన్న కాషియస్ భావంతో ఏకీభవించక త్రోసివేయటం, సీజర్ అంత్యక్రియల్లో ప్రసంగించటానికి ఆంటొనీకి అనుజ్ఞనివ్వటం, కాషియస్ సలహాను త్రోసిరాజని ఫిలిప్పియుద్ధంలోనే తమసర్వస్వాన్నీ ఒడ్డటం మొదలైన కొన్ని దోషాలు చేశాడు.

బ్రూటస్ ప్రజాస్వామ్యపక్షపాతి. రోంకు రాజనే పేరునే అతడు సహించలేడు. అంతశ్శుద్ధితో తనపూర్వుడైన బ్రూటస్‌చర్యను (టార్క్విన్ను పారద్రోలటం) ఆదర్శంగా పెట్టుకొని సీజర్ విషసర్పాన్ని అండంలోనే అవియించటానికి పూనుకొన్నాడు. బ్రూటస్ ఉద్వేగాలకు లొంగని విజ్ఞాని. అందువల్లనే సీజర్ హత్యానిర్ణయానికి పూర్వం ఆయనమనస్సు డోలాందోళితమైంది. అందులో మహత్తరమైన అంతర్యుద్ధం చెలరేగింది. ఈ ఉద్వేగరాహిత్యంవల్లనే విపణిలో ఆయన చేసిన అనుద్వేగకరప్రసంగం ఆంటొనీ చేసిన ఉద్రేకపూరితమైన గంభీరోపన్యాసంముందు పేలవమై పోయింది.

ఎటువంటి విషమజీవితసంఘటనలనైనా అతిప్రశాంతంగా సహనంతో భరించి సుఖదుఃఖాలకు అతీతంగా ప్రవర్తించటాన్ని నేర్పే స్టోయిక్ తత్వశాస్త్రాభిమాని బ్రూటస్. కానీ కథాసందర్భాలు అట్టి తత్వశాస్త్రంతో పరిచయంగల అతణ్ణికూడా కలవరపెట్టాయి. మిత్రుడిహత్యనుగురించి నిర్ణయించుకుండేటప్పుడు చిత్తం అంతర్యుద్ధావిద్ధమైంది. రాజకీయరహస్యాలను భార్యకుచెప్పకుండా దాచలేకపోయాడు. యుద్ధసమయంలో కోపాన్ని తెచ్చుకొన్నప్పుడు కాషియస్ "అనుభవంలో లేకపోతే మీరు చేసిన తత్వశాస్త్రజిజ్ఞాసవల్ల ప్రయోజనమేమిటి?" అని అడగటానికి అవకాశంకలిగింది.

కొన్ని విపరీతపరిస్థితుల్లో అతడిలో తత్వశాస్త్రదృష్టి తొలగటంవల్లనే మానవత్వం బహిర్గతమైంది. బ్రూటస్ కరుణాహృదయుడు. ప్రేమించగలడు. ఇతరులప్రేమను చూరగొనగలడు. భార్యయెడ, మిత్రులయెడ, స్నేహితులయెడ అతడిప్రవర్తన ఈవిషయాలను సుస్పష్టంగా సర్వేసర్వత్రా అభివ్యక్తం చేస్తున్నది.

పఠనాభిమానం, సంగీతరసికత బ్రూటస్‌ను మహోత్తరునిగా తీర్చి

దిద్దాయి. ఆశయపావిత్ర్యం, నైతికవిజయం మరుపురాని మహోదారునిగా భావియుగశుభ్రచరిత్రల్లో అతడికి స్థానాన్ని కల్పించాయి. ఆంటొనీ అన్నట్లు భూతాలన్నీ ఏకమై "మానవు డంటే ఇతడు" అని చెప్పదగ్గ సద్గుణపుంజం బ్రూటస్.

# కాషియస్

కాషియస్ స్వభావంచేత, శిక్షణవల్లా ఎపిక్యూరస్‌తత్వం కలవాడు. పునర్జన్మమీద నమ్మకం అతడికి లేదు. 'మానవజీవితాలమీద దేవతల కెట్టి ప్రభావం లేదు' అని అతని విశ్వాసం. మరణానికి ఇంచుకపూర్వం తనఅభిప్రాయాలను మార్చుకున్నా అతడు శకునాలంటే నమ్మడు. బ్రూటస్‌లా కష్టసుఖాలకు అతీతుడుగా ఉండలేనివాడు. అతికోపస్వభావం కలవాడు. ఈగుణాన్ని తల్లివల్ల పొందానని తానే బ్రూటస్‌తో చెప్పుకున్నాడు.

ప్రజాస్వామికమంటే అతడికి ప్రియమైందే. కానీ ఆప్రేమ ఒకవిశాల సిద్ధాంతమీద ఆధారపడి ఉండదు. తాత్కాలికప్రయోజనం చేకూరితే అది తృప్తిపడుతుంది. అరాచకానికి దారితీస్తున్నా నేమో అన్న భయం దానికి లేదు. సిద్ధాంతాన్ని బ్రూటప్ అనుసరించి వ్యవహరిస్తే కాషియస్ కేవలం ఉద్రేకాన్నిబట్టి నడుచుకుంటాడు. అతడు ఉదాత్తసిద్ధాంతప్రభోధకుడు; ఇతడు రాజనీతిచతురుడు. కాషియస్‌లో ఉదాత్తదుష్టప్రకృతులు రెండూ సమ్మేళనాన్ని పొందాయి. సీజర్‌ఘనతయెడ ఈర్ష్య వహించాడు. కానీ కేవలం ఈర్ష్యవల్లనే ఇతడు సీజర్‌యెడ విద్రోహవర్గాన్ని కల్పించటంలో సమాహర్త ఐనాడనటానికి వీల్లేదు. ఇతడికి ప్రజాస్వామ్యాభిమానం లేకపోలేదు; అయితే అది సంకుచితమైంది. ఐనప్పటికీ ఇతడు దానికోసం తనప్రాణాలు అర్పించి తనదోషాల నన్నింటినీ దగ్ధంచేసుకొన్నాడు.

తనకు అంతశ్శక్తి క్రమశిక్షణాలేదని కాషియస్ ఆత్మపరీక్షవల్ల తెలుసుకున్నవాడు; కావటంవల్లనే నాయకత్వాన్ని బ్రూటస్‌పరంచేసి తాను అనుచరుడైనాడు. తననిర్ణయాలు సక్రమమైనవనీ, కార్యసాధకాలైన వనీ అతడికి తెలిసినా బ్రూటస్‌కున్న నైతికబలం తనకు లేకపోవటంవల్ల ఎల్ల వేళలా లొంగిపోతుండేవాడు. బ్రూటస్‌కంటే కాషియస్ నైతికంగా తక్కువవాడైనా రాజకీయంగా ఎక్కువవాడు. రాజకీయాలల్లో అతడిబుద్ధి

అతినిశితంగా వ్యవహరిస్తుంది.

అతను వ్యవహారదక్షుడైన రాజకీయవేత్త. వ్యక్తులను అతినిశితంగా పరిశీలిస్తాడు. మానవస్వభావపరిశీలనలో అందవేసిన చేయి. తనయుక్తితో, చాతుర్యంతో సీజర్ మీద విద్రోహాన్ని సన్ని క్రమంగా ఒక్కొక్కరిని ఆవర్గంలోకి చేర్చగలిగాడు. బ్రూటస్ వంటి మహోత్తముణ్ణి తనపక్షానికి చేర్చుకోటానికి క్రమమైన విధానాన్ని అనుసరించి సాధించాడు. అతడు క్రమమైన రాజకీయవేత్త. లక్ష్యమే ముఖ్యం కాని అతడికి సాధన ఎటు వంటిదైనా సరే. సీజర్‌తోబాటు ఆంటొనీనికూడా చంపవలసిన అగత్యాన్ని దూరదృష్టితో గమనించి సూచించాడు. సీజర్ అంత్యక్రియల్లో ఆంటొనీ ప్రసంగానికి అవకాశం కల్పించటం ప్రమాదకారి అని పలకటం అతనిబుద్ధినైశిత్యానికి విషయోన్నయనానికీ నిదర్శనం. సిసెరోను తమ పక్షంలోచేర్చుకో వలసిన అగత్యాన్ని దర్శించి సూచించాడు. అతడు ఉన్నట్లైతే బహుశః ఆంటొనీవక్తృత్వప్రభావాన్ని తగ్గింపగలిగి ఉండేవాడు. బ్రూటస్‌తో సంబంధంలేకుండా ఉంటే కాషియస్ విద్రోహకవర్గానికి విజయాన్ని చేకూర్చగలిగి ఉండేవా డనిపిస్తుంది.

కాషియస్‌లో బ్రూటస్ చూపించిన లంచగొండితనం మొదలైన నైతికదోషాలు రాజకీయప్రయోజనదృష్టితోచూస్తే దోషాలే కావు. క్లిష్ట పరిస్థితుల్లో ఎవరైనా చేయక తప్పనివి. ఇతడు ఎంతటి రాజకీయప్రవీణుడో అంతటి యుద్ధతంత్రప్రవీణుడు. ఎదురుపోయి శత్రువును ఎదుర్కోటం కంటే శత్రువునే రానివ్వటం మంచిది అన్న అతడు చేసిన సమంజసమైన సూచనను బ్రూటస్ త్రోసిపుచ్చాడు. అందువల్లనే కాషియస్ చెప్పినట్లు విద్రోహవర్గంవారు ఫిలిప్పీయుద్ధరంగంలో వారి సర్వస్వాతంత్ర్యాలు కోల్పోవలసివచ్చింది. తత్వవేత్తఐనబ్రూటస్ రాజకీయచతురుడు, యుద్ధతంత్ర ప్రవీణుడుఐన కాషియస్ సలహాలను త్రోసిరాజనటంతో చేటుమూడింది.

బ్రూటస్ అనేకరీతుల తన్ను త్రోసిపుచ్చుతున్నా కాషియస్ అచంచలభక్తితో ఆయన్ను అనుసరించాడు. బ్రూటస్ ఉత్తమవ్యక్తిత్వానికి తాను ముగ్ధుడు కావటమే ఇందుకు కారణం. వారిద్దరిమధ్య చెలరేగిన మనస్పర్థలకు అతడు ఎంతో నొచ్చుకున్నాడు; సంధి జరిగిన తరువాత మన

సారి కౌగలించుకున్నాడు. పోర్షియామరణానికి ఎంతో చింతపడ్డాడు. బ్రూటస్ పట్టుబడ్డాడన్న అబద్ధపువార్త విన్నప్పుడు 'నాకంటెనుండు నా ప్రియమిత్రుడు పట్టుబడ్డతరువాత నే నింకా బ్రతికి ఉన్నా' నని బాధ పడ్డాడు.

ఇంతగా బ్రూటస్ యెడ అభిమానాన్ని వహించి లొంగిపోయిన కాషియస్‌ను చూసి సీజర్ "ఇట్టి ఆకలి కళ్ళతో చూచే బక్కపలచనివారు తమ కంటె అధికులైన వారిని చూచి ఈర్ష్యవహిస్తుంటారు" అని ఆంటోనీతో అనటం సమంజసంగా లేదు. అతడి రాజకీయాలకు ఒక నైతికసిద్ధాంతం ఆధారంగా లేకపోవటంతప్ప వేరే కాషియస్‌లో దోష మేమీ లేదు. అతడే దోషభూయిష్ఠుడైతే బ్రూటస్ అతణ్ణి ప్రేమించేవాడే కాడు; దుష్టత్వం, ఈర్ష్యాపరత లక్షణాలైతే మరణపర్యంతం అనుసరించే అనుయాయులు కొందరు అతడికి ఏర్పడేవారు కారు. అతడిలో కొన్నిలోపాలున్నా ఉదాత్తగుణాలు లేని వాడు కాడు. బ్రూటస్ అతణ్ణి మరణానంతరం "రోమనులలో తుదివా" డనీ, నిన్ను బోలినవ్యక్తి లిక రోంలో జన్మించరని ప్రశంసించే వాడు కాడు.

# ఆంటోనీ

ఆంటోని మేధావి, భావోద్వేగి, ధైర్యసాహసాలుకలవాడు, ఎట్టి క్లిష్టపరిస్థితినైనా తన కనుకూలంగా త్రిప్పుకోగల ప్రవీణుడు. గౌరవాధికారాలపై ఆసక్తికలవాడు. విలాసప్రియుడు. వినోదశీలి. సీజర్ ఎడ అతని భక్తిభావం అచంచలం, అమలినం, పరిపూర్ణం. ప్రభువర్గతత్వం అతడిలో జీర్ణించిన గుణం. ఆతడు పన్నుగడలు పన్నగల కుశాగ్రబుద్ధి. హృదయసౌభాగ్యంకంటె విధానానుసరణంమీద అతడికి దృష్టి విశేషం. కాని ఇతరుల ఉదాత్తతయెడ అంధుడుమాత్రం కాడు. బ్రూటస్‌వలె ఇతడు నీతిసూత్రాలతో కొలిచి ఇతరులకు విలువ కట్టడు. ఆంటోని రాజకీయజ్ఞుడే కాని అతడిరాజకీయాలకు వ్యక్తిగతకారణాలు కాని సుస్థిరసూత్ర మేదీ ఆధారం కాదు. అందువల్లనే అతడు తన సంతతి చరిత్రలో పరాజితుడైనాడు.

సీజరంటే అతనికి అపారభక్తి. 'సీజర్ ఏదైనా చెయ్యమంటే అది

జరిగినట్టే' అన్న అతడివాక్యంలో అణుమాత్రమైనా స్తోత్రప్రియత్వం లేదు. సీజర్ మీద భక్తి అతణ్ణి వధానంతరం హంతకులమధ్యకు నడిపించింది. సీజర్‌కు జరిగిన మహాద్రోహం అతడిలో నిస్సీమమైన ఉద్రేకాన్ని కల్పించి దౌష్ట్యాచరణకు ప్రేరేపించింది. విజయాన్ని చేకొన్న విద్రోహులతో స్నేహంచేసుకొని అధికారాన్ని పంచుకోవటానికి పూనుకోవటమే ఆంటొనీ స్వార్థరహితమైన స్వామిభక్తిని ప్రకటిస్తుంది.

అతడు రాజకీయాలల్లో నీతివిరహితుడు. ప్రజలను వక్తృత్వంతో ఉద్రేకపరచి "ఇది ఇక వ్యవహరించుగాక! దౌష్ట్యమా! నీవు పయన మారంభించావు; స్వేచ్ఛానుసారంగా విహరించు" అని అనటంవల్ల అతడి హృదయకౌటిల్యం వ్యక్తమౌతున్నది. ప్రజలకు సీజర్ ఇచ్ఛాపత్రంలోని ప్రజాదానాలను గురించి తెలియజేసి తరువాత వాటిలోని ఆభాగాలను తొలగించి ప్రజలను మోసగించటానికి లెపిడస్ చేత ఇచ్ఛాపత్రాన్ని తెప్పించటం, వీరత్రయకూటమిలో సభ్యుడైన లెపిడస్‌ను గురించి అతడు ఆక్టేవియస్‌తో వెల్లడించిన భావాలు మాటలకు మనస్సుకూగల అసంబద్ధతను తెలియజేస్తున్నవి. తనతోసమానుడైన వీరుడు గదా లెపిడస్! అతడు భారవహనానికి పనికివచ్చే గార్దభమట!! అతడిది ఎంతటి కుటిలహృదయం.

అతని క్రీడాభిరతి, విలాసప్రియత్వం, కొంతవరకు సహించ దగ్గవైనా అతడి క్రూరత్వం, హృదయరాహిత్యత క్షంతవ్యాలుకానివి. లెపిడస్ కోరితే తన మేనల్లుని "ఒక్క చుక్కతో తుడిచిపెడుతున్నా" నన్నాడు.

షేక్స్పియర్ చిత్రించిన సీజర్ నాటకంలోని ఆంటొనీని చూచి నప్పుడు కాలం ఒకదుష్టుణ్ణి దేవతను చేసి కూర్చోపెట్టిందనీ, అతడే చెప్పిన ఆంటొనీక్లియోపాత్రాలోని ఆంటొనీని చూచినప్పుడు ఆదేవతామూర్తి దుష్టుడుగా పరిణమించాడనీ అనిపిస్తుంది. సీజర్ నాటకంలోని ఆంటొనీ వక్తృత్వశక్తితో రోమనుప్రజను తాను పలికించినట్లు పలికే పిల్లనగ్రోవినిగా చేసుకుంటే, ఆంటొనీ—క్లియోపాత్రాలోని ఆంటొనీని 'అతిఅపూర్వ సమ్మోహని' (క్లియోపాత్రా) తన ఇష్టానుసారంగా పలికించుకున్నది అని ఒక విమర్శకుడు పలికిన వాక్యాలు ఎంతో సముచితాలైనవి.

ఇన్నిదోషాలున్నా ఆంటొనీ సమర్థుడు. ఆత్మసంయమనం కలవాడు.

క్లిష్టపరిస్థితుల్లో చిత్తస్థైర్యాన్ని అచంచలంగా నిలుపుకోగల గంభీరుడు. ఉపాయశాలి. శిలలకు ప్రాణంపోసి తన పనులు నెరవేర్చుకోగల ప్రజ్ఞాశాలి. కార్యనిర్వహణదక్షుడు. కాషియస్ సీజర్ ఎడ విద్రోహవర్గాన్ని చేకూర్చి వధతో విజయాన్ని పొందితే విద్రోహకవర్గానికి ప్రతివర్గాన్ని సృష్టించి విజయాన్ని సాధించిన మహామేధావి. యుద్ధతంత్రజ్ఞుడు. ఉదాత్త గుణాలు తనకు లేకపోయినా బ్రూటస్‌లోని నైతికాధిక్యాన్ని గమనించి "మానవుడంటే ఇతడే" అని శ్లాఘించటం, సీజర్ ఎడ అచంచలభక్తి ప్రపత్తులు ప్రకటించటం ఈకుటిలపాత్రకుగల రెండు మధురగుణాలు.

## స్త్రీ పాత్రలు

సీజర్ నాటకంలో స్త్రీపాత్రలు ఇరువురు. ఇందులో పోర్షియా స్త్రీరూపంలో ఉన్న బ్రూటస్. అత్యుదాత్తఅయిన రోమనునారీమణి. ఉత్తమ ధర్మపత్ని. భార్యకుగల హక్కులను కర్తవ్యాలను ఎరిగిన వ్యక్తి. తనచిత్త దార్ఢ్యనిరూపణకోసం ఊరువులో గాయాన్ని కల్పించుకొని భర్తకు తన పౌరుషశీలాన్ని ప్రకటించిన వీరనారి. అయితేనేం? ఆమె కేవలం స్త్రీమూర్తిగానే వ్యవహరించింది. భర్త యుద్ధభూమిలో ఉండటంవల్ల కలిగిన వియోగాన్ని భరించలేక మరణించిన ఆమె స్త్రీజనసహజమైన హృదయదౌర్బల్యాన్ని జయించలేకపోయిందనే చెప్పవచ్చు. కాని వ్యక్తిత్వం గల స్త్రీ.

కల్పూర్నియా సీజర్ భార్య. వ్యక్తిత్వం లేని వ్యక్తి. అంతటి మహావీరునికి పత్నిఐఉన్నా, అంధవిశ్వాసాలమీద అపరిమితమైన నమ్మకం కలది. తనదుస్స్వప్నానికి వెరిచి భర్తను సభాభవనానికి వెళ్లవద్దని తొలుత ప్రార్థించినా ఆయన వెళ్లటానికి నిశ్చయించుకొన్నప్పుడు హృదయదార్ఢ్యంతో ఈమె ఎదురునిల్వలేదు. పోర్షియావలె తనకున్న వైవాహిక సత్వాలనుగురించి పట్టుబట్టుకపోయినా వాటిప్రశంసైనా జేయలేదు. నిరంకుశునికి పత్నిఐన ఆమె తనకున్న సత్వాలనే ఎరిగదో, తెలిసి మరుపుకు అలవాటుపడిందో! లేక శకునాలను ఒకవంక జంకుతున్నా భర్తకులభించనున్న రాజకిరీటంమీద ఆమెకుకూడా అభిమాన ముందేమో! లేకపోతే

తనప్రార్థనలను సీజర్ తిరస్కరించి వెళ్లుతుంటే నోరైనా ఎత్తకుండా ఉంటుందా? కల్పూర్నియా లోకసామాన్యురాలైన స్త్రీయేగాని పోర్షియా వలె విశిష్టమూర్తి కాదు.

పోర్షియా కల్పూర్నియాలు ఇరువురూ ఉత్తమపత్నులే కాని కల్పూర్నియా సీజర్‌కోసమే జీవించింది. పోర్షియా బ్రూటస్‌కోసం జీవిస్తూ కొంత తనకోసంకూడా జీవించింది. భర్తృహృదయసాన్నిహిత్యసంపాదనంలో పోర్షియాకున్నప్రజ్ఞ కల్పూర్నియాకు లేనట్లు కనిపిస్తుంది. ఇందుకు కారణాలైన గుణదోషాలు భర్తలవో భార్యలవో!

రోమనుప్రజ :

జ్ఞానహీనులు, చంచలస్వభావులు, ఉద్రేకపూరితులు ఐనరోమనుప్రజను మహాకవిషేక్స్పియర్ తన అనంతప్రతిభతో ఈసీజర్ నాటకంలో చిత్రించి చూపించాడు. నాటకాన్ని వారితో ఆరంభించాడు. ధర్మాధికారులు వారి మతిభ్రమణాన్ని కృతఘ్నతను, చంచలశీలాన్ని నిందిస్తూ పారద్రోలితే దోషులైనట్లు కన్నెరుపుకుండా వారు వెళ్లిపోయారు.

సీజర్‌వధాసందర్భంలో వీరిచంచలత్వాన్ని షేక్స్పియర్ ఇంకా స్పష్టంగా నిరూపించాడు. సీజర్‌ను హత్యచేసినందుకు విద్రోహవర్గంమీద వెర్రికోపాన్ని పొంది మింగేసేటట్లు వచ్చారు. కానీ కారణాలను చెప్పి సంతృప్తపరిస్తే చాలు నని ఏకకంఠంగా పలికారు. బ్రూటస్ ఇచ్చిన సమాధాన్ని విన్నారు. ఇంచుకైనా స్థిమితచిత్తాన్ని వహించి ఆసమాధానాన్ని పరిశీలించి అవగతంచేసుకోకుండానే సంతృప్తిని పొంది బ్రూటస్‌ను స్వాతంత్ర్యసముద్ధర్తనుగా నిర్ణయించి కీర్తించారు. సీజర్‌ను వధించటానికి బ్రూటస్‌ను ప్రేరేపించిన ప్రజాస్వామ్యసిద్ధాంతం వారికి అణుమాత్రమైనా విజ్ఞానభూయిష్టమైన బ్రూటస్‌ప్రసంగంవల్ల తెలిసిందని అనుకోటానికి అవకాశంలేదు. అయితేనేం? ఆయనఎడ అపారప్రేమానురాగాలను ప్రకటించి 'సీజర్‌నుకూడా చేద్దా' మనుకొన్నారు. నిరంకుశత్వాన్ని రూపుమాపటానికి నాయకత్వాన్ని వహించిన వ్యక్తినే నిరంకుశపదవికి ఎన్నుకోదలచటంకంటే ప్రజలమౌఢ్యానికి, అజ్ఞానానికి మరోనిదర్శనం ఏం కావాలి?

బ్రూటస్‌ప్రసంగానికిపూర్వం ప్రజ సీజర్‌యెడ అచంచలవిశ్వాసాన్ని

ప్రకటించింది. తరువాత బ్రూటస్ పక్షం వహించింది. ఆంటొనీ ప్రసంగించాడు. మళ్లీ అందర్నీ సీజర్ వంకకు త్రిప్పాడు. జనచిత్తచాంచల్యపరిగణనలో నిధిఅయిన ఆంటొనీ వారిని విద్రోహవర్గంమీదికి దండెత్తించి విజయం చేకొన్నాడు. బ్రూటస్ నిరూపించిన సమంజసమైన కారణాలతో వారి కేమి పని? ఆంటొనీ చేసిన భావోద్రేకసంధుక్షణం వారిమీద పని చేసింది. ఇక వారు తలపెట్టి సాగించని దౌష్ట్య మంటూ లేదు. నేను సిన్నాకవిని, సిన్నాకవిని అని ఎంత మొర పెట్టుకుంటున్నా వినిపించుకోక హంతకుల్లో ఒకడైన సిన్నాతో నామసామ్యమంగల సిన్నాకవిని చీల్చివేయటంతో వారి క్రోధోన్మత్తత పరాకాష్ఠ నందుకున్నది. నిరంకుశత్వ ప్రజాస్వామ్యాలల్లో వారే వంకకు మొగ్గుతారో! “ఇట్టి చిత్తప్రవృత్తిగల సామాన్యప్రజపై షేక్స్పియర్‌కు అభిమానం విశేషం. అందువల్లనే అతడు హృదయపూర్వకంగా వారితో క్రీడించాడు. దీర్ఘకాలంమీద వారినే ధర్మనిర్ణేతలనుగా తీర్చిదిద్ది రోమకప్రభువర్గంకంటే ఉన్నతస్థానాన్ని వహించినవారినిగా వారిని నిరూపించాడు.

ఇట్టి అపూర్వపాత్రసృష్టితోనేకాక, కాషియస్ బ్రూటస్ హృదయంలో విద్రోహబీజాలను నాటిన ప్రథమాంకద్వితీయదృశ్యం, విద్రోహకవర్గజననదృశ్యం, పోర్షియాబ్రూటస్‌ల సమావేశంతో ఒప్పిన ద్వితీయాంకప్రథమదృశ్యం, ఆంటొనీప్రసంగసన్నివేశం, బ్రూటస్‌కాషియస్‌ల కలహసన్నివేశం, బ్రూటస్‌లూషియస్‌ల సంభాషణం మొదలైన మహత్తరమనోజ్ఞసన్నివేశాలతో షేక్స్పియర్ మహాకవి తన పరిణత కళావైదగ్ధ్యాన్ని ప్రకటించిన సీజర్ నాటకం సమకాలీనుల్లోనే విఖ్యాతిగడించి నేడు ఆనాటిరోమకచరిత్ర కొక చక్కని ప్రతిబింబంగా ప్రవర్తిస్తూ వస్తున్నది.

‘ప్రతిజాతికీ దాని యోగ్యతనుబట్టి ఉత్తమప్రభుత్వం ఏర్పడుతుంది. జాతి నిర్మించుకొన్న రాజకీయసంస్థల్లో మార్పు కలగాలంటే అందులోని జనసముదాయమంతటిలోనూ శీలపరివర్తన కలగవలసిందే. అంతవరకూ ఒక క్రూరపాలకుణ్ణి తొలగిస్తే మరొకడు ఆస్థానాన్ని ఆక్రమిస్తాడు.

హత్యా మహాదోషం. రాజకీయాశయంకోసమైనా హత్య చేసింది వ్యక్తి ఐతే వ్యక్తి, జాతిఐతే జాతి తత్ఫలితాన్ని అనుభవించక తీరదు. ఉదాత్తలక్ష్యసిద్ధికి ఉదాత్తసాధనాన్నే ఉపయోగించాలి '

అన్నవి ఈనాటకం నేర్పే గుణపాఠాలు. ఇవి సార్వజనీనాలు, సర్వకాలీనాలు. ఈనిత్యసత్యప్రవచనంవల్ల సీజర్ నాటకం విశ్వసాహిత్యంలో సుస్థిరమైన విశిష్టస్థానాన్ని పొందుతున్న దనటంలో అతిశయోక్తి అణుమాత్రమైనా లేదు.

## పాత్రలు

**పురుషులు**

జూలియస్ సీజర్ : మహాసేనాని. రోమకసామ్రాజ్యాధినేత
మార్కస్ బ్రూటస్ : విద్రోహవర్గ సభ్యుడు
కాషియస్ : ,,
కాస్కా : ,,
ట్రెబోనియస్ : ,,
ఆక్టేవియస్ సీజర్ : సీజర్ వధానంతరం ఏర్పడ్డ వీరత్రయకూటమి సభ్యుడు
మార్క్ ఆంటోనీ : ,,
లెపిడస్ : ,,
సిసెరో : శాసనసభా సభ్యుడు
పబ్లియస్ : ,,
పొపిలియస్ లేనా : ,,
లిగారియస్ : విద్రోహ వర్గ సభ్యుడు
డెషియస్ బ్రూటస్ : ,,
మెటెల్లస్ సింబర్ : ,,
సిన్నా : ,,
ఫ్లేవియస్, మరుల్లస్ : ప్రజాధర్మాధికారులు
ఆర్టిమిడోరస్ : ఛందశ్శాస్త్రోపాధ్యాయుడు, కవి
సిన్నా : కవి, మరొక కవి
లుసిల్లియస్, టిటినియస్, మెస్సాలా, యువకేటో వొలిమ్నియస్‌లు బ్రూటస్ మిత్రులు; వర్రో, క్లిటస్, క్లాడియస్, స్ట్రాటో, లుసియస్, డార్డానియస్‌లు బ్రూటస్ సేవకులు, పిండారస్ కాషియస్ సేవకుడు శాసనసభాసభ్యులు, పౌరులు, రక్షకులు, పార్శ్వచరులు తదితరులు.

**స్త్రీలు**

కల్పూర్నియా : జూలియస్ సీజర్ భార్య
పోర్షియా : బ్రూటస్ భార్య

# ప్రథమాంకము

## ఒకటో దృశ్యం

రోం మహానగరంలో ఒకవీథి. ఫ్లేవియస్, మరులియస్, కొందరు పౌరులు ప్రవేశిస్తారు.

*ఫ్లేవియస్*: వెళ్లిపొండి! పనిపందల్లారా, మీమీ ఇళ్లకు వెళ్లిపొండి. ఏమిటి? మీకేం తెలియదా? మీమీ వృత్తి చిహ్నాలు లేకుండా ఈ శ్రమదినంనాడు ఇలా తిరగరాదని మీకు తెలియదా? ఏమోయ్, నీ వృత్తేమిటి?

*ప్రథమపౌరుడు*: ఎందుకు బాబూ! నేనో వడ్రంగిని.

*మరులియస్*: అయితే నీవక్షస్త్రాణ మేది? దారుదండ మేది?

ఇంత మంచిదుస్తులు ధరించి తిరుగుతున్నా వేం? — నిన్నే నయ్యా! నీవృత్తేమిటి?

*ద్వితీయపౌరుడు*: బాబూ, నిజం చెపితే నిపుణుడైన శ్రామికునితో పోల్చి నన్ను ప్రావీణ్యంలేనివా డని మీ రంటారు.

*మరులియస్*: కావచ్చు. నీవృత్తేమిటో సూటిగా చెప్పు.

*ద్వితీయపౌరుడు*: నావృత్తా బాబూ, భయరహితంగా చెప్ప వచ్చు ననుకుంటాను, నిజం చెపితే చెడ్డచర్మాలను బాగు చేయటమే నావృత్తి.

*మరులియస్*: ఓరి తులువా! తల బిరు సెక్కిందా? నీదేం వృత్తి?

*ద్వితీయపౌరుడు*: వద్దు, కోపగించకండి బాబూ! నేను మీ చర్మాన్నికూడా బాగుచేస్తాను.

*మరులియస్*: అంటే నీఅభిప్రాయం? నా చర్మంకూడా

భాగుచేస్తావా, ఓరి పెంకివెధవా!

ద్వితీయపౌరుడు: ఎందుకు కోపగిస్తారు బాబూ, మీఅతక లనుకూడా బాగుచేస్తాను.

మరులియస్: అయితే నీవు చర్మకారుడి వన్నమాట! అంతేనా?

ద్వితీయపౌరుడు: నిజం చెప్పుతున్నాను బాబూ! నేను నా ఆరెతోనే జీవిస్తున్నాను. మరోవృత్తిగలవాళ్లతో గాని, స్త్రీలవిషయాలల్లోగాని నేను ఏటువంటి జోక్యం కలిగించు కోటం లేదు. అయితే, సత్యంచెప్పుతున్నాను, ఆపదలోఉన్న పాతచర్మాలకు నేను ఘనవైద్యుణ్ణి. తగ్గచికిత్స చేస్తాను. అందమైన చర్మాలు వేసుకొని నడుస్తున్నవాళ్లు ఎవరు కన్పించినా వారు నానైపుణ్యంవల్ల తయారైన చర్మాలను ఉపయోగిస్తున్నా రన్నమాటే!

ప్లేవియస్: అయితే, ఈనాడు మీరంతా మీమీ కర్మాగారాలల్లో పనిమానేశారా? ప్రజల నందరినీ గుంపులుగా నడిపించుకుంటూ వీథుల్లో ఇలా తిరుగుతున్నారేం?

ద్వితీయపౌరుడు: వాళ్లచర్మాలు అరిగిపోవటానికి; నాకు మరింతపని దొరకటానికి — కాదు బాబూ! సీజర్ను చూడ టానికీ, అతడివిజయానికి ఆనందించటానికీ ఇవాళ మేము సెలవుతీసుకొన్నాం.

మరులియస్: ఆనందించటానికా! ఏముందికనక? అతడు ఏంవిజయాలు నెత్తికెత్తుకో వచ్చాడని. కప్పాలు చెల్లించ గల బందీలను రథానికి కట్టి వెంటబెట్టుకొని రోముకు నడి పించుకో వస్తున్నాడనా!

వీళ్లు వట్టిమూర్ఖులు! రాతిగుండెలు!! భావ

హీనులు!!! ...ఓ శిలాహృదయులారా! రోంనగరక్రూర పౌరులారా!! పాంపేను అప్పుడే మరిచిపోయినారా ? రోం నగరమహావీథుల్లో అతడు విజయపరంపరలతో వచ్చి యాత్ర చేస్తున్నప్పుడు అతనిదర్శనంకోసం మీరు ఘనకుడ్యాలు, కోటకొత్తళాలు, హర్మ్యశిఖరాలు ఎగబ్రాకి ఎక్కి చేతుల్లోని పసిపాపల్తో, దీర్ఘమైన దినమంతా, ప్రశాంతంగా ఆశతో ఎన్నిమార్లు వేచిఉన్నారో మరిచిపోయినారా? అతడి రథం కనబడీ కనబడకముందే మీరంతా ఒక్కమారుగా చరిచిన కరతాళాల ప్రతిధ్వనులకు శూన్యతీరభూమితో టైబరునది వణికిపోవడం మరిచిపోయినారా ?

ఆమీరు ఈనాడు అత్యుత్తమమైన దుస్తులు ధరించారా ! ఆమీరు ఈనాటిని సెలవుదినంగా ఎన్నుకున్నారా? ఆమీరు పాంపేసంతానరక్తంతో చేకొన్న విజయాన్ని తెస్తున్నవాడిమార్గాలను పుష్పాలతో అలంకరిస్తున్నారా!!

పొండి ! వెళ్లిపొండి !! మీమీ ఇళ్లకు పరుగెత్తి పొండి !! తానుచూపిన కృతఘ్నతను ఇలా బహిరంగంగా ప్రకటించుకొనే ఈమహామూర్ఖిని కొంతకాలం ఆపవలసిం దని మీమీ దేవతలముందు మోకరిల్లి వేడుకోండి ! పొండి !!

ఫ్లేవియస్ : వెళ్లిపొండి ! ఉదాత్తులారా ! దేశీయులారా!! పొండి ! దీన్ని ఆనందసమయంగా చేసుకొన్న మీదోషానికి ప్రతిక్రియగా మీబోటి దీను లనందర్నీ గుంపుచేయండి. టైబరునదీతీరానికి వెళ్లండి ! ఆనదీవేదికలో మీకన్నీరును క్రుమ్మరించి అతరంగిణి సర్వోన్నతతీరభూములనూ చుంబించేటట్లు చెయ్యండి !!

[పౌరులు నిష్క్రమిస్తారు

చూడు, వారి అల్పలక్షణం. నా ప్రసంగంవల్ల మారిందో లేదో. చూడు, దోషులు కావటంవల్ల కిక్కురుమనకుండా వెళ్ళిపోతున్నారు.

నీవు సభామందిరంవైపుకు వెళ్ళు, నేను ఇలా పోతాను. ప్రతిమలకు ఏమైనా ఉత్సవాలంకరణలు కనిపిస్తే ఒలిచి వెయ్.

మరులియస్ : ఆపని మనం చెయ్యవచ్చా? ఇప్పుడు లూపర్కల్ ఉత్సవాలు జరుగుతున్న వని నీకు తెలుసుననుకుంటాను?

ఫ్లేవియస్ : ఇందులో దోష మేమీ లేదు. సీజర్ విజయ గౌరవచిహ్నాలతో ఏ ప్రతిమా అలంకరింపబడరాదు. నే వెళ్లి వీథుల్లో గుంపులుచేరే జనాన్ని చెదరగొడతాను. దట్టంగా జనం మూగిఉన్నట్లు కనిపిస్తే నీవూ చెదరగొడుతూ వెళ్లు.

సీజర్ రెక్కలమీద మొలుచుకొస్తున్న ఈకలను ఇలా పెరికివేస్తే అతడూ సామాన్యంగానే ఎగరగలుగుతాడు. లేక పోతే మన అందరిచూపులకూ అందకుండా అతడు విహాయస వీథుల్లో విహరిస్తూ మనలనందరినీ దాస్యభయంలో ముంచెత్తుతాడు.

[నిష్క్రమిస్తారు

# రెండో దృశ్యం

ఒక ప్రజాప్రదేశం. సంగీత, విజయోత్సవాలతో సీజర్ ప్రవేశిస్తాడు. ఉత్సవాచారాలకూ అంటొనీ, కల్పూర్నియా, పోర్షియా, డెసియస్, సిసెరో, బ్రూటస్, కాషియస్, కాస్కాలు ప్రవేశిస్తారు. వారివెంట ఒకమూక, అందులో ఒకశకునజ్ఞుడు ఉంటారు.

సీజర్ : కల్పూర్నియా!

కాస్కా : నిశబ్దం! సీజర్ ప్రవేశిస్తున్నాడు

[సంగీతం క్రమంగా అంతరిస్తుంది

సీజర్ : కల్పూర్నియా !

కల్పూర్నియా : ప్రభూ, ఇక్కడున్నాను.

సీజర్: ఆంటోనియస్ పయనించేపవిత్రమార్గంలోసూటిగా నిలు. ఆంటోనియస్ !

ఆంటొని : సీజర్ మహాప్రభూ !

సీజర్ : నీధావనవేగంలో కల్పూర్నియాను స్పృశించటం మరచిపోకు. అతిపవిత్రమైనఈవేటలో స్పృశింపబడ్డ స్త్రీకి వంధ్యాత్వశాపం తొలగిపోతుం దని పెద్దలు చెప్తుంటారు.

ఆంటొని : తప్పక జ్ఞాపకంపెట్టుకుంటాను. సీజర్ 'ఈపని చెయ్య్యి' మని కోరితే ఆపని జరిగిపోయినట్లే.

సీజర్ : ఇక బయలుదేరు. ఏఆచారభాగాన్నీ విడిచిపెట్టకు.

[సంగీతం వినిపిస్తుంది

శకునజ్ఞుడు : సీజర్ !

సీజర్ : ఆఁ. ఎవరు, నన్ను పిలుస్తున్నారు ?

కాస్కా : సర్వధ్వనులూ అంతరించాలి. వెనకటిలా నిశ్శబ్దంగా ఉండాలి.

[సంగీతం ఆగిపోతుంది

సీజర్ : ఆగుంపులోనుంచి ఎవరు పిలిచింది? ఈసంగీతం అంతటికంటే అవ్యక్తమైన ఒకకలస్వనం ఈగుంపులోనుంచి నన్ను పిలచినట్లు వినిపించింది. అ దెవరు? మాట్లాడు. సీజరు

ఈవంకకు తిరిగి వినటానికి సిద్ధంగా ఉన్నాడు.

*శకునజ్ఞుడు* : మార్చి పదిహేనోనాడు జాగ్రత్త!

*సీజర్* : ఎవ రది?

*బ్రూటస్* : ఒకశకునజ్ఞుడు మిమ్మల్ని మార్చి పదిహేను నాడు జాగ్రత్త అని సూచిస్తున్నాడు.

*సీజర్* : అతడిముఖాన్ని చూడాలి, నాముందుకు తీసుకో రండి.

*కాషియస్* : గుంపులోనుంచి ముందుకు రావయ్యా! సీజర్‌ను దర్శించు.

*సీజర్* : నీవు నాకు సూచించిం దేమిటి? ఏదీ మళ్ళీ ఒక మారు చెప్పు.

*శకునజ్ఞుడు* : మార్చి పదిహేనోనాడు జాగ్రత్త!

*సీజర్* : ఇత డెవరో స్వాప్నికుడు. అతణ్ణి వదిలెయ్యండి. పోదాం, కదలండి.

ఒక తుత్తారధ్వని వినబడుతుంది. (బ్రూటస్, కాషియస్‌లు తప్ప మిగిలినవారందరూ నిష్క్రమిస్తారు.

*కాషియస్* : మీరు వెళ్ళి 'ఆ పవిత్రధావనాన్ని' తిలకిస్తారా?

*బ్రూటస్* : లేదు.

*కాషియస్* : వెళ్ళి చూడవలసిం దని నేను మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను.

*బ్రూటస్* : క్రీడ లంటే నా కిష్టం లేదు. ఆంటొనీలో ఉన్న ఉద్వేగం నాలో లేదు. నీకోరికలకు నే నేం ఆటంక పడనులే. నిన్ను వదలిపెట్టి వెళ్ళిపోతాను.

*కాషియస్* : బ్రూటస్! కొంతకాలంనుంచీ మీకళ్ళల్లో

నాకు వెనకటి ఆప్యాయత ఎందుకోగాని కనిపించటం లేదు. మిమ్మల్ని మనసార ప్రేమించే మిత్రుడిమీద ఎందుకంత విముఖత్వంగానూ కఠినంగానూ ఉంటున్నారు?

బ్రూటస్: కాషియస్ మోసపోకు. నీకు అపరిచితమైన భావంతో నాముఖం కప్పుకోపోయి ఉంటే ఆబాధంతా కేవలం నాకోసమే. ఇతరులకు ఎట్టిసంబంధం లేని విషయాల వల్ల నాలో పరస్పరవిరుద్ధోద్వేగాలు కలిగి నన్ను అలాయించాయి. ఇదే బహుశః నావిచిత్రప్రవర్తనకు మూలకారణమై ఉంటుంది. అందువల్ల నాలో ద్యోతకమయ్యే మార్పుకు నాముఖ్యస్నేహితులు చింతపడరనుకుంటాను. వెర్రిబ్రూటస్, తన అంతరాత్మలో జరుగుతున్న అంతర్యుద్ధంవల్ల ఇతరులఎడ చూపవలసిన ప్రేమాభిమానాలను ప్రకటించటంకూడా మరిచి పోతున్నాడని అనుకుంటారు గాని అంతకుమించి ఏమీ ఆలోచించరనుకుంటాను. నాఆప్తమిత్రుల్లో నీవూ ఒకడివి.

కాషియస్: బ్రూటస్! అయితే మీమానసికోద్వేగాన్ని అపార్థంచేసుకున్నా నన్నమాట! తర్కించవలసిన అభిప్రాయాలను ఎన్నింటినో ఇన్నాళ్లబట్టీ నామనస్సులోనే దాచిఉంచాను. మిమ్మల్ని గురించి మీకు బాగా తెలుసా బ్రూటస్?

బ్రూటస్: లేదు, కాషియస్! అద్దంలో ప్రతిబింబాన్ని తిలకించటం వల్లనో లేదా మరోరీతిగానో తప్ప కన్ను తన్ను తాను చూచుకోగలుగుతుందా?

కాషియస్: సత్యం చెప్పారు. మీలో గుప్తంగా ఉన్న శక్తిని ప్రతిబింబించి మీకంటిముందు నిలిపి నిజరూపాన్ని మీరు చూచుకొనే అవకాశాన్ని కల్పించగల అద్దాలు

మీకు లేవని అంతా ఎంతగానో చింతిస్తున్నారు. దివ్యపురుషుడు సీజర్ తప్ప రోంమహానగరంలోని మహనీయులందరూ బ్రూటస్ మహాశయుడు తన్ను తాను దర్శించ వలెనని వాంఛిస్తున్నారు. వారందరూ ఈయుగంలోని క్రూర పాలనాభారాన్ని మోయలేక మూల్గుతున్నారు.

బ్రూటస్ : నాలో గుప్తంగా ఏదో మహాయోగ్యత ఉన్నదని, దాన్ని వెదకమనీ ఉద్బోధించి నన్ను ఏప్రమాదాలల్లోకి నడిపిస్తున్నావో నీవు అర్థంచేసుకుంటున్నావా ? అట్టిశక్తి ఏదీ నాలో లేదని నాకు తెలుసు.

కాషియస్ : అయితే, బ్రూటస్, వినటానికి సిద్ధపడండి. ఎంతయత్నించినా మీప్రతిబింబంతో తుల్యంగా మిమ్మల్ని మీరు తిలకించలేరు. నేను మీకు ముకురాన్నౌతాను. అత్యుక్తి లేకుండా మిమ్మల్నిగురించి మీ రెరుగని సర్వాన్నీ ద్యోతకంచేస్తాను.

బ్రూటస్ మహాశయా ! నన్ను అనుమానించకండి. నన్నుగురించి సామాన్యపరిహాసకుడని విన్నా, సాధారణ ప్రమాణశులాకానికి ప్రేమనటించే ప్రతినూతనవ్యక్తికీ మైత్రి నిస్తానని తెలుసుకున్నా, స్తోత్రపాఠాలకు లొంగి తొలుతగా కౌగిలించి తరువాత తిడతానని, సామాన్యజనానురాగాన్ని చూరగొంటానికి ఆరాటపడతాననీ తెలుసుకొన్నా నన్ను ప్రమాదకారినిగా భావించండి.

[కోలాహలము, కరతాళధ్వనులు వినిపిస్తవి

బ్రూటస్ : ఈకోలాహలానికీ, కరతాళధ్వనులకూ అర్థమేమిటి ? ప్రజలు సీజర్‌ను రాజుగా ఎన్నుకుంటున్నా రేమో, భయం వేస్తున్నది.

కాషియస్ : ఏమిటి ? నిజంగా మీరు భయపడుతున్నారా? అలా జరగకూడ దని మీరు వాంఛిస్తున్నట్లు నేను నమ్మ వలసిందే.

బ్రూటస్ : ఔను కాషియస్, అలా జరగకూడదు. అయినా, అత డంటే నా కెంతో అనురాగం.

— అయితే నీవు ఎందుకు న న్నింతసేపు ఇక్కడ ఆపుతున్నావు ? ఏమైనా చెప్పదలచుకున్నావా ? అది సమిష్టి శ్రేయసానికి సంబంధించిం దైతే మృత్యు, గౌరవాలు రెండూ చెరొకవంక దర్శనమిచ్చినా రెంటినీ సమదృష్టితో పరిశీలిస్తాను. మృత్యుభయాన్ని తొలగించి నాకు గౌరవం మీద అభిమానాన్ని ప్రసాదించి దేవతలు అభ్యుదయాన్ని చేకూర్చెదరుగాక !

కాషియస్ : బ్రూటస్ ! అంతటిమహోదారగుణం మీలో ఉందని మీబాహ్యరూపా న్నైన నాకు తెలుసు ; బాగుంది. వినండి. గౌరవమే నాకథనానికి వస్తువు. మీరూ ఇతరులూ ఈనాటి మనజీవితాన్నిగురించి ఏమనుకుంటున్నారో నేను చెప్పలేను. సర్వరీతులా నన్ను బోలిన ఒకవ్యక్తివల్ల కలుగు తున్న భయంతో బ్రతటంకంటే మరణించటమే మంచిదని నాకు నేను భావిస్తున్నాను.

నేను సీజర్‌లా స్వతంత్రుణ్ణిగా జన్మించాను. మీరూ అలాగే జన్మించారు. అతనితో తుల్యంగానే మన మిద్దరం పోషణను పొందాం. అతనిలాగానే శీతాకాలపుచలిని మన మిర్వురం భరించగలం.

ఎందువల్ల నంటారా, ఒకప్పుడు, ఒకశీతలమైన తుపాను నాటిరాత్రి, పొంగులువారే టైబరునది తనఒడ్డుమీద

క్రోధాన్ని వెళ్ళగక్కుతు న్నప్పుడు, సీజర్ నాతో "కాషి యస్! ఈ క్రోధోన్మత్తతరంగిణిలో దూకి ఆ లక్ష్యంవరకూ నాతోబాటు ఈదటానికి నీకు ధైర్యముందా?" అని అడిగాడు. మరుక్షణంలోనే నేను ఉన్నదుస్తులతోటే నదిలోకి దుమికి అనుసరించ మని అతణ్ణి ఆజ్ఞాపించాను. అతడు అనుసరించాడు. ప్రవాహం అతిభయంకరంగా గర్జిస్తున్నది. శక్తితో నీరాన్ని చిమ్మివేస్తూ, మనోధైర్యంతో నదీవేగానికి అడ్డునిలుస్తూ ఇద్దరం ఈదుతున్నాం. ఇంకా మాలక్ష్యం దూరాన ఉంది. "కాషియస్! నాకు సాయపడు, లేదా నేను మునిగిపోతాను" అని సీజర్ దీనంగా కేకపెట్టాడు. ట్రాయ్ అగ్నిజ్వాలల్లోనుంచి మనపూర్వుడు ఏయ్నియస్ తనభుజస్కంధాలమీద ఆన్ఛెసిస్‌ను మోసినట్లు టైబర్ అలలమీద అలిసిపోయిన సీజర్‌ను నేను మోసి బయటపడేశాను.

అతడు ఈనాడు మనకో దేవుడై కూర్చున్నాడు. కాషియసో ఒక అల్పప్రాణి! అలక్ష్యంతో సీజర్ తల పంకిస్తుంటే నేను వినమ్రభావంతో శరీరాన్ని వంచవలసి వచ్చింది.

స్పెయిన్‌లో ఉండగా అతడి కోమారు సుస్తిచేసింది. దానితీవ్రతలో అత డెలా వణికిపోయాడో నేను కళ్ళార చూచాను. ఈనాటిదేవుడు ఆనాడు గజగజలాడాడు. ఇది సత్యం. అతడి పెదవులరంగు అదృశ్యమైపోయింది. సమస్త ప్రపంచానికీ భయోత్పాతాన్ని కలిగిస్తున్న ఆ కన్నులు తమ కాంతిని కోల్పోయాయి. గాద్గద్యంతో కంపించిపోయిన ఆనాటిఅతనికంఠాన్ని నేను విన్నాను. తనఆజ్ఞాపన లన్నింటినీ రోమకపౌరులు అధికాసక్తితో వినేటట్లు చేస్తూ, తానిచ్చే

ఉపన్యాసాలను వారిచేత కంఠ స్థంచేయిస్తూ ఉన్న ఆనాలుక, అప్పుడు, అయ్యో, జబ్బుపడ్డ ఒక ఆడపిల్లలా, 'టిటినియస్! ఏదైనా పానీయా న్నివ్వు' అని దీనంగా అర్థించింది.

నాకెంతో ఆశ్చర్యంవేస్తున్నది. ఓ దేవతలారా! ఆదుర్బలుడే ఈనాడు ప్రపంచాగ్రగామియై ఎక్కటివీరు డైనాడు.

[కోలాహలమూ, కరతాళధ్వనులూ చెలరేగి వినిపిస్తవి

బ్రూటస్: మరో కోలాహలం! ఈకరతాళధ్వనులు సీజర్‌కు అబ్బిన నూతనగౌరవచిహ్నాలని నానమ్మకం.

కాషియస్: ఎందుకయ్యా! ఆత డీక్షుద్రప్రపంచంమీద కొలోసస్‌లాగా నిలుచుంటే అల్పప్రాణులమైన మనమంతా ఆతడివరిష్ఠపాదాలక్రిందుగా నడుస్తాం; అంతేకాదు. గౌరవ రహితాలైన మనశ్మశానశిబిరా లెక్కడున్నవా అని వెదకటం కోసం వంగివంగి ప్రాకిపోతాము.

కొన్నిసందర్భాలల్లో మానవులు తమఅదృష్టాలకు తామే అధికారు లౌతుంటారు. నెచ్చెలీ, బ్రూటస్! ఈదోషం మననక్షత్రాలది కాదు. మనదే. మనం అల్పులం.

బ్రూటస్! సీజర్!! ఆ'సీజర్'అన్న నామంలో విశేషం ఏముంది కనక? అది మీనామంకంటే ఎందుకు అధికంగా ఉచ్చరింపబడాలి? రెంటినీ జతచేసి వ్రాసి చూడండి. ఆపే రెంత మధురమైందో మీదీ అంతే మధుర మైంది. ఉచ్చారణాసౌలభ్యం దాని కున్నట్లు దీనికీ ఉంది. తూచండి; రెంటిభారం సమానమే. ఏదీ ఒకమారు రెంటినీ అభిమంత్రణం చేసి చూడండి. సీజర్‌నామం ఎంతవేగంగా ఒకశక్తిని ఉద్భవింపజేయ గలుగుతుందో బ్రూటస్‌నామం

కూడా అంతవేగంగానే ఒకశక్తిన్ని ఉద్భవింపజేయగలుగు తుంది. సర్వదేవతల నామోచ్చారణం చేసి ఒకటి నే నడుగు తున్నాను : ఏం భుజించటంవల్ల సీజర్ ఇంత ఘనుడైనాడు ?

కాలమా! నీవు అవమానిత వైనావు. రోంమహానగ రమా! నీవు మహోదాత్తులకు జన్మభూమివి కావటం మాని వేశావు. మహాప్రళయానంతరంనుంచి ఏయుగం అనేకమంది ఘనులు జన్మించిన ఖ్యాతిని పొందకుండా గడిచిపోయింది? రోంనగరం గర్వించదగ్గ పుత్రు డీతడొక్కడే అని ఒకవ్యక్తిని గురించి ఎన్నడైనా దాని ఘనకీర్తిని శ్లాఘించేవారు చెప్పు కున్నారా? ఈనాడు ఒకే ఒకవ్యక్తికి తప్ప తాను తావీయ కుండా అతివిచిత్రమైన దైపోయింది రోం.

ఈరోంను ఒకడు రాజై పాలించేదానికంటే ఒకపెను భూతం ఇందులో విశృంఖలవిహారం చేసినా సహిస్తా నని పూర్వం ఒకానొకప్పుడు ఒకబ్రూటస్ పలికి తదనుగుణంగా ప్రవర్తించినట్లు పెద్దలు చెప్పుకుంటే మీరూ నేనూ కథగా వినలేదూ?

బ్రూటస్ : నీకు నాయెడ అనురాగం అపారం. ఇందులో అణుమాత్రమైనా నా కేలనుమానం లేదు. ఏమి చేయవల సిందని నీవు నన్ను ప్రేరేపిస్తున్నావో, కాషియస్, అది నాకు కొంతకొంతగా బోధపడుతున్నది. ఈవిషయాన్ని గురించీ, ప్రస్తుతకాలగమనాన్నిగురించీ పూర్వం నే నేమేమి తలపోశానో నీకు తరువాత తెలియజేస్తాను. నిన్ను ప్రేమ పూర్వకంగాప్రార్థిస్తున్నాను : దాన్ని ఇప్పుడే వెల్లడించ వల సిందని కోరకు. నీవు సూచించటానికి యత్నించిన నాకర్త వ్యాన్ని గురించి నేను వివేచిస్తాను. ఇంకా నీ వేమైనా విని

పించ దలచుకుంటే ఓపికతో వింటాను. ఇటువంటి ప్రధాన విషయాలను వినటానికీ, సమాధానాలు చెప్పటానికీ తగ్గసమయాన్ని ఏర్పాటుచేస్తాను. అంతరకూ ఓనాపరమమిత్రుడా! ఈవిషయాన్నిగురించి యోచనచేస్తూ ఉండు. కాలం తెచ్చిపెట్టిన ఈకఠినస్థితిని భరిస్తూ రోంనగరపుత్రుడనే ఖ్యాతిసి వహించటంకంటే ఈబ్రూటస్ పల్లీయుడని అనిపించుకోటానికైనా ఇష్టపడతాడు.

కామియస్: సంతోషం! శక్తిహీనాలైన నామాటలు బ్రూటస్‌మహాశయుని ముఖంనుంచి ఇంతటి అగ్నిజ్వాలలను వెలిజిమ్మించ గలిగినందుకు సంతోషం.

బ్రూటస్: క్రీడలన్నీ ఐపోయినట్లున్నయ్. సీజర్ తిరిగి వచ్చేస్తున్నాడు.

కామియస్: వా రీమార్గాన వెళ్ళేటప్పుడు కాస్కాను టోగాకొనపట్టి పిలవండి. మనం గమనించవలసిన విశేషాలు ఈనాడు అక్కడ ఏమి జరిగాయో దాపరికంలేకుండా చెప్పేస్తాడు.

సీజర్, అతనిపరివారం తిరిగి ప్రవేశిస్తారు.

బ్రూటస్: అలాగే చేస్తాను. గమనించు, కామియస్!, సీజర్ ముఖంమీద ఏవో కోపరేఖలు కనిపిస్తున్నట్లున్నాయి? మిగిలిన పరివారమంతా గట్టిగా తిట్లు తిన్నట్లున్నారు? కల్పూర్నియాచుబుకం పాలిపోయి నట్లు తోచటంలేదూ? సభాభవనంలో సభ్యులు తన్ను వ్యతిరేకించినప్పుడు కనిపించే ధోరణిలో సిసిరో రక్తారుణనేత్రాలతో ద్యోతకమౌతున్నాడు కదూ?

కామియస్: కాస్కా వచ్చి విశేష మేమి జరిగిందో విని

పిస్తాడుగా.

సీజర్ : ఆంటోనియస్ !

ఆంటొనీ : సీజర్!

సీజర్ : నాకు అంగరక్షకులుగా బలిష్ఠులను, రాత్రిళ్ళు గాఢనిద్రనుపొందేవారిని కాపుంచు. అడుగో, దూరంగా బక్కపలచని ఆకలికళ్ళతో చూస్తున్నాడు కాషియస్. అత డెప్పుడూ అతిగా ఆలోచిస్తుంటాడు. అటువంటివారివల్ల అధికప్రమాదం.

అంటొనీ : అత డంటే భయపడకండి సీజర్ ! అతడివల్ల ప్రమాద మేమీ ఉండదు. అతడు మహోదారుడైన రోం పౌరుడు. అత్యుత్తముడు.

సీజర్ : ఇంతకంటే అతడు బలిసిఉంటే నేను భయపడే వాణ్ణి కాను. కానీ నేను అత డంటే జంకటం లేదు. అయితే భయంవల్ల సీజర్ ఎవరికైనా తొలగిఉండట మంటూ సంభవిస్తే అతడు ఆపలచని కాషియస్ మాత్రమే. అతడు అతితీక్ష్ణంగా గమనిస్తుంటాడు. వ్యక్తులుచేసే బాహ్యా కృత్యాలనుబట్టి ఆతడు వారిఅంతస్సుల్లోని అభిప్రాయాలను దర్శిస్తుంటాడు. నీవలె అతడికి ఆటలంటే అభిలాష లేదు. సంగీతమంటే ఆసక్తి అంతకంటే లేదు. ఎప్పుడోగాని చిరు నవ్వొరగడు. అదైనా నవ్వాట మనేతనబలహీనతను గురించి అసహ్యించుకున్నట్లుంది. తమకంటే అధికులైనవారిని చూస్తే అటువంటివారు హృదయశాంతి వహించలేరు. అందువల్ల వారు చాలా ప్రమాదకారులు. నే నెప్పుడూ భయరహితు డనైన సీజర్ నే. కానీ నేను భయపడేదానికంటే భయపడ వలసిం దేమిటో నీకు తెలియజేస్తున్నాను.

ఈనా చెవికి చెవుడు కదూ, ఇలా కుడివైపుకు రా. అతణ్ణిగురించి నీ వేమనుకుంటున్నావో నాకు సత్యం చెప్పు.

తుత్తారధ్వని వినిపిస్తుంది. సీజర్, కాస్కా తప్ప మిగిలిన పరివార మంతటితో, నిష్క్రమిస్తాడు.

కాస్కా : నాటోగాను పట్టిలాగి నన్ను పిలిచారు, నాతో మాట్లాడదలిచారా ?

బ్రూటస్ : కాస్కా ! సీజర్ అంతగా చింతాక్రాంతుడై ఉన్నాడు, ఏంజరిగిం దేమిటి ?

కాస్కా : అదేమిటి ? మీరూ ఆయన వెంటనే ఉన్నారుగా ? లేరూ ?

బ్రూటస్ : ఉంటే ఏం జరిగిందని నేను అడగనే అడగను.

కాస్కా : ఏముంది, అతడికి రాజకిరీటాన్ని సమర్పించారు. అతడు తనహస్తకరభంతో ఇలా వెనక్కునెట్టాడు. అప్పుడు ప్రజలుకరతాళధ్వనులతో ముంచెత్తారు.

బ్రూటస్ : మరి రెండో కోలాహలం ఎందుకు జరిగింది ?

కాస్కా : ఏందుకా ? అదీ అందుకే.

కాషియస్ : వాళ్లు ముమ్మారు కరతాళధ్వని చేశారు. చివరసారిధ్వనులు ఎందుకో.

కాస్కా : అవీ అందుకే.

బ్రూటస్ : అయితే అతనికి కిరీటాన్ని ముమ్మారు సమర్పించారా ?

కాస్కా : అవును, ముమ్మారు సమర్పించారు. ఒకమాటికంటే మరొకమారు మరింత నెంపాదిగా దాన్ని అతడు అవతలపెట్టాడు. దాన్ని స్వీకరించటానికి అతడు తిరస్కరించినప్పుడల్లా ప్రజలు కరతాళధ్వనులు చేశారు.

కాపియస్ : అతడికి కిరీటాన్ని ఎవరు సమర్పించారు ?

కాస్కా : అలా అడుగుతున్నా వేమిటి ? ఆంటొనీ !

బ్రూటస్ : సౌమ్యుడా, కాస్కా ! అదంతా ఎలాజరిగిందో మాకు తెలియజేయ్.

కాస్కా : అది ఎలాజరిగిందో చెప్పటమంటే ఉరివేయించుకోట మన్నమాట ! అదంతా నేను బాగా గమనించలేదు. అది ఒకవిచిత్రనాటకం. అతడికి మార్కు-ఆంటొనీ కిరీటాన్ని అర్పించటంమాత్రం చూచాను. అయినా అది రాజకిరీటం కూడా కాదు. కేవలం 'పత్రకిరీటం'. మీకు పూర్వం చెప్పినట్లుగా అర్పించిన కిరీటాన్ని ఆయన అవతలపెట్టాడు. కానీ అతడు చాలా సంతోషంతో దాన్ని స్వీకరించేవాడని నాఅభిప్రాయం. ఆంటొనీ మళ్లీ దాన్ని అర్పించాడు. అతడు మళ్లీ అవతలపెట్టాడు. మళ్లీ అవతలపెట్టే టప్పుడు అతడి వేళ్లలో లోభం కనిపించింది. అప్పుడు ఆంటొనీ మూడోమారు సమర్పించాడు. మూడోమారుకూడా అతడు అవతల పెట్టాడు. అప్పుడు ప్రజానీకం పొంగులువారి కరతాళధ్వనులు చేశారు. వారిచేతులు బీటలువారి పోయినాయి. వారు చెమటతో తడిసిన రేకుళాయీలు విసిరారు. సీజర్ కిరీటాన్ని తిరస్కరించా డని అతడు మూర్ఛలో మునిగిపోయేటంతగా గవులు నిట్టూర్పులు విడిచారు. అతడు అంతటితో మూర్ఛిల్లి క్రిందపడ్డాడు. పెదవులు తెరిస్తే దుర్గంధం ఎక్కడ ప్రవేశిస్తుందో అన్న భయంతో నేనుమాత్రం నవ్వటంకూడా మానేశాను.

కాషియస్ : నెమ్మదిగా మాట్లాడు. నిన్ను ప్రార్థిస్తున్నా! ఏమిటి, సీజర్ మూర్ఛపోయాడా ?

కాస్కా : అవును. విపణిప్రదేశంలో పడిపోయి నురగలు క్రక్కుకున్నాడు. నోట మాటరాలేదు.

బ్రూటస్ : కావచ్చు. అతడికి మూర్ఛలవ్యాధి ఉంది.

కాషియస్ : పొరబాటు. ఈవ్యాధి అతనికి లేదు. మీకు, నాకు, సత్యప్రియు డైన కాస్కాకు ఈమూర్ఛలవ్యాధి ఉంది.

కాస్కా : అంటే నీ అభిప్రాయ మేమిటో నా కేమీ అర్థం కావటం లేదు. కానీ ఇదిమాత్రం సత్యం. సీజర్ పడిపోయి నాడు. రంగస్థలంమీద నటకులు తమకు సంతృప్తినీ అసంతృప్తినీ కలిగించినప్పుడు జనం కరతాళధ్వనులు చేయటం, గేలిచేయటం చేసినట్లు సీజర్ ఎడ ప్రజానీకం ప్రవర్తించారని నేను చెప్పింది జరక్కపోయిన ట్లయితే నేను సత్యసంధుణ్ణే కాదు.

బ్రూటస్ : స్మృతివచ్చిన తరువాత అత డేమన్నాడు?

కాస్కా : మూర్ఛపోబోయేముందు అతడు కిరీటాన్ని పలుమారు తిరస్కరిస్తున్నప్పుడు ప్రజానీకం తమఆనందాన్ని ప్రకటిస్తుంటే ప్రచ్ఛదాన్ని విప్పమని నన్ను ఆజ్ఞాపించి వారికి ఉత్తరించటంకోసం కుత్తికను అందించాడు సుమా! ఆ సామాన్యజనంలో నేనూ ఒకకర్మకారుడి నైనట్లయితే అతడి కోరిక సత్యమైం దనుకోని, అతడికంఠాన్ని ఉత్తరించకపోతే తులువలతోపాటు నరకానికి వేళ్ళేవాణ్ణే.

అతడు మూర్ఛపోయినాడు. తిరిగి స్మృతి వచ్చిన తరువాత తా నేమైనా పొరబాట్లు చేసినా చేయరాని ప్రసంగాలు చేసినా అవి తన అస్వస్థతవల్ల జరిగినట్లు భావించవలసిందని ప్రజను ప్రార్థించాడు. నేను నిలుచున్నచోట ముగ్గురు నలుగురు దాసీముండలు 'పాపం! ఉత్తమాత్మ' అని అతణ్ణి

పొగిడి హృదయపూర్వకంగా క్షమించారుకూడాను. కానీ వా ళ్ళేమిటి? సీజర్ ఆ ప్రజాసీకంలోని అందరితల్లులనూ పొడిచి చంపినా అలాగే ప్రవర్తించేవాళ్లు వాళ్లు.

బ్రూటస్: అయితే అతను తరువాత అలాగే చింతా క్రాంతుడై వచ్చేశాడా?

కాస్కా: అవును.

కాషియస్: సిసెరో ఏమీ మాట్లాడ లేదా?

కాస్కా: లేకేం, ఏదో మాట్లాడాడు, గ్రీకుభాష. అది నాకు గ్రీకుగానే ఉంది.

కాషియస్: దానివల్ల ఏం ప్రయోజనం?

కాస్కా: అది నాకర్థ మైం దని అబద్ధమాడను; ముందు నీముఖం చూడకుండా ఉండిపోలేను. అయితే అతడు మాట్లా డిం దేమిటో అర్థంచేసుకున్న వాళ్లు ఒకరిముఖం ఒకరు చూచు కొని నవ్వుకున్నారు; తలలు పంకించారు. అయితే అది నాకు మాత్రం గ్రీకుభాషగానే ఉండిపోయింది. ఇంతకంటే విశేషాలు మీకు నే నేం చెప్పగలను? సీజర్ విగ్రహాలమీద అలంకరణాలను ఒలిచివేసినందుకు మరులియస్, ఫ్లేవియస్ లకు ఉద్యోగాల్లోనుంచి ఉద్వాసన చెప్పారు. వెధవజ్ఞాపక శక్తి, నాకు లేదు! ఉంటేనా అక్కడ జరిగిన నాటకాన్ని గురించి మీకు ఇంకా ఎంతో చెప్పేవాణ్ణి.

కాషియస్: కాస్కా-! ఇవాళ రాత్రికి నీభోజనం మా ఇంట్లో.

కాస్కా: వీ ల్లేదు. ఇదివరకే మరొకరికి మాటిచ్చాను.

కాషియస్: అయితే, మరి, రేపు నీవు నాతో కలిసి భోంచేస్తావా?

కాస్కా : తప్పకుండా — నేను బ్రతికిఉంటే, నీమనస్సు మారకపోతే, పై పెచ్చు నీ విచ్చేవిందు పుచ్చుకోదగ్గ దైతే.

కాషియస్ : మంచిది. నీకోసం రేపుఎదురుచూస్తూంటాను.

కాస్కా : సరే. మీఇద్దరికీ శుభం.

[నిష్క్రమిస్తాడు

బ్రూటస్ : వీ డెంత బండగా తయారైనాడు! పాఠశాలకు వెళ్ళేదినాలల్లో చాలా చురుకైనవాడు.

కాషియస్ : రూపంలో ఇప్పుడు బండగా కనిపించినా సాహసంలోగాని లేదా ఉదాత్తకార్యకరణంలోగాని వీడు ఈనాడూ అంతటి చురుకైనవాడే. ఈబండతనం వీడి హాస్యాన్ని జీర్ణంచేసుకోను అవసరమైన వ్యంజనంగా పని చేస్తుంటుంది.

బ్రూటస్ : ఔను నిజమే. నీవు రేపు నాతో మాట్లాడ దలచుకుంటే మీఇంటికి వస్తాను. లేదా నీకు ఇష్టమైతే మాఇంటికి రా : నీకోసమే వేచిఉంటాను.

కాషియస్ : తప్పకవస్తాను. అందాకా ప్రపంచాన్నిగురించి ఆలోచిస్తూ ఉండండి.

[బ్రూటస్ నిష్క్రమిస్తాడు

బాగుంది. బ్రూటస్ ! నివు అత్యున్నతుడవు. నీ ఉన్నతస్వభావధాతువును, అతిమెత్తని లోహంలా, ఇష్టం వచ్చినట్లు తీర్చిదిద్దుకోటానికి వీలున్నట్లు కనిపిస్తున్నది. ఎప్పుడూ ఉత్తములు ఉత్తములతో సాంగత్యం చేయటం మంచిది. ఎందువల్లనంటే : మలినంకానంతటి ధార్ఢ్యం ఎవరి కుంది ?

సీజర్‌కు నేనంటే అసహ్యం ; కానీ బ్రూటస్‌ను

ప్రేమిస్తాడు. ఇటువంటిస్థితిలో నేనే బ్రూటస్నై బ్రూటస్ కాషియస్ఐతే అతడు నన్ను ప్రభావితంచేయటానికి యత్నించనే కూడదు.

నేను ఈరాత్రే అనేకసహస్రపౌరుల దగ్గరనుంచీ వచ్చినట్లుగా భిన్నహస్తాక్షరులతో బ్రూటస్ వాతాయనంగుండా అతనిఇంట్లోకి లేఖలు పడవేయిస్తాను. వాటిలో లీలగా సీజర్ దురాశ ద్యోతక మయ్యేటట్లూ, రోంమహానగరమంతా బ్రూటస్మీదనే ఎంతటిగౌరవాన్ని నిలిపిందో తెలిపేటట్లూ లిఖిస్తాను. ఆతరువాత సీజర్ భద్రంగా కూర్చోగలుగుతాడో! లేక అతణ్ణి పెకలిస్తున్నాం గనక దుర్దినాలను అనుభవిస్తాడో!!

[నిష్క్రమిస్తాడు

# మూడో దృశ్యం

ఒకవీథి. ఉరుములు, మెరుపులు. ఒరనుంచి దూసిన కత్తితో కాస్కా, సిసెరోలు ఎదురుమళ్ళగా ప్రవేశిస్తారు.

సిసెరో : సుసాయంతనం కాస్కా! సీజర్ను ఇంటికి తీసుకోవచ్చావా? అదేమిటి, అలా నిట్టూరుస్తున్నావు? ఎగాదిగా అలా చూస్తున్నా వేమిటి?

కాస్కా : అస్థిరవస్తువులా భూమండలమంతా ఇలా కదలిపోతుంటే నీ వేం చలించటం లేదా! సిసెరో! తిట్టిపోస్తూ పెనుగాలులు మెలితిరిగిన ఓకువృక్షాలను చీల్చే పెనుతుపానులను ఎన్నింటినో చూచాను. భయభ్రాంతిని కల్పించగల వారివాహాలతో తుల్యమైన ఔన్నత్యాన్ని పొందటంకోసం సముద్రం ఉవ్వెత్తుగా ఉప్పొంగి క్రోధంతో నురగలు

గ్రక్కుతూ ఉండటం చూచాను. అయితే, ఈనాటిరాత్రి వరకూ, ఇంతవరకూ, అగ్నిపుంజాలను వర్షించే తుపానులను నే నెక్కడా చూడలేదు. స్వర్గంలో ఏదో అంతర్యుద్ధం వచ్చి ఉంటుంది. లేదా ప్రపంచం దేవతలయెడ అపచారంచేసి ప్రచండప్రళయాన్ని పంపించే టంతటి క్రోధా న్నైనా కల్పించి ఉంటుంది.

సిసెరో : ఎందువల్ల ? ఆశ్చర్యకరాలైన విశేషా లేమైనా చూచావా ?

కాస్కా: ఒకసామాన్య బానిస, చూస్తే నీవు అతణ్ణి వెంటనే గుర్తుపట్టగలవు కూడా, ఇరవై కాగడాలు జోడించినట్లు వెలుతున్న అతని వామహస్తాన్ని చాచాడు; అతడికి అగ్నిభయం ఉన్నట్లు అణుమాత్రం కనుపించలేదు.

అంతేకాదు. అప్పుడు దూసిన నాకత్తిని మళ్లీ ఒరలో నిలుపలేదు. సభాభవనానికి ఎదర నే నోసింహాన్ని కలుసుకున్నాను. అది నన్ను తేరిపారచూచి, కళవళపెట్టకుండానే హఠాత్తుగా అదృశ్యమైంది. ఆదృశ్యాన్ని చూచిన నూరుమంది స్త్రీలు కుప్పకూలారు. వారు వీథుల్లో కణకణలాడే నిప్పులమీద అటూఇటూ ముందువెనకలకు బహుపర్యాయాలు పచార్లు చేసిన పురుషులను చూచారట ! ప్రమాణం చేసి చెప్పారు. దివాంధ మొకటి నిన్నటి మధ్యందినాన్నే విపణిలో వింతగా అరుస్తూ కూతలువెట్టింది. ఇన్ని అపశకునాలు ఒక్కమాటుగా సంభవించాయి. అయినా సామాన్యులు 'ఇవి వాటి లక్షణాలు, వాటి స్వభావం' అని అంటారేమో ! అనకూడదు. ఇవన్నీ వాటి లక్ష్యమైన ఒకస్థితికి భవిష్యత్సూచకా లని నానమ్మకం.

సిసిరో : నిజంగా అంతే. ఇది చాలా విచిత్రమైన కాలంగా ఉంది. అయితే కలిగిన ఈవిషయాలన్నిటిని ఈ దృష్ట్యా కాకుండా జనం వారివారి బుద్ధిబలాన్ని అనుసరించి భావిస్తుంటారు. సీజర్ రేపు సభాభవనానికి వస్తున్నాడా ?

కాస్కా : తప్పకవస్తాడు. ఈవిషయం నీకు తెలియజేయవలసిందిగా ఆంటోనియోను ఆజ్ఞాపించాడు కూడాను.

సిసిరో : అయితే కాస్కా! శుభం. శాంతిరహితమైన ఈవాతావరణం ఎంతమాత్రం తిరగదగ్గదిగా కన్పించటం లేదు.

కాస్కా : సిసెరో! శుభమగుగాక!

[సిసెరో నిష్క్రమిస్తాడు ; కాషియస్ ప్రవేశిస్తాడు

కాషియస్ : ఎవ రక్కడ?

కాస్కా : ఒక రోంనగర పౌరుడు.

కాషియస్ : గొంతుకనుబట్టి ఊహిస్తున్నా, అది కాస్కా ఏనా?

కాస్కా : నీవి మిక్కిలి చక్కని చెవులు. కాషియస్! ఇ దేమి రాత్రోయ్.

కాషియస్ : సత్యప్రియులైనవారికి ఇది చాలా ఆనంద దాయకమైన రాత్రి.

కాస్కా : స్వర్గం ఇంతగా కోపించ గలదని పూర్వం ఎవ రన్నా ఊహించారా?

కాషియస్ : ఈభూమి దోషభూయిష్ఠమై పోయిందని గమనించినవాళ్ళు ఊహించారు.

నామటుకు నేను, ఇలాగే, ఇప్పుడు నిన్నుచూస్తున్నట్లు, మైమరుపు లేకుండా రొమ్మును పరీక్షించుకుంటూ ఒప్ప

జెప్పి, ఈభయంకరకాళరాత్రిలో వీధులవెంట విశృంఖలంగా విహరించాను. ఒకానొక శంప తన శాఖాద్వయంతో నీలాతి నీలమై అనుకంపారహితంగా ఆకాశగర్భాన్ని చీలుస్తున్నప్పుడు నేను దాని లక్ష్యసీమలో నిలిచాను. దానికాంతిలో నిలిచాను.

కాస్కా : తమబలాధిక్యతను చూపి మానవులమైన మనను ఆశ్చర్యమగ్నులను చేయటానికి దేవతలు తమభయంకరప్రతినిధులను పంపిస్తున్నారు. జనానీకం భయోద్వేగంతో వశికిపోతున్నదే, నీవు ఇంతగా ఎందుకా దేవతలను తిరస్కరించి తిరిగావు కాషియస్ !

కాషియస్ : కాస్కా ! నీవు వట్టి మందబుద్ధివి. రోమనగర నివాసిలో ఉండవలసిన జీవితాగ్నికణాలు నీలో లేవో ఉన్నా అవి ప్రజ్వరిల్లటం లేదో. ఉంటే దేవతల కోపోద్రేకాన్ని చూచి ఇలా పాలిపోయి ఎగాదిగా చూస్తూ భయభ్రాంతుడివీ, ఆశ్చర్యమగ్నుడివీ కావు. ఈమహాగ్నిపాతా లెందుకో, ఈ భూతాకృతుల విహారా లెందుకో, వృద్ధులు ఉన్మత్తులుగానూ బాలురు విజ్ఞానులుగానూ ప్రవర్తించట మెందుకో — ఇలా సర్వసత్వాలూ సహజగుణాలకు భిన్నంగా, ఉద్దిష్టాలకు విరుద్ధంగా రాక్షసప్రవృత్తిని ధరించట మెందుకో మూల కారణాన్ని అన్వేషించదలచుకుంటే స్వర్గం భూలోకంలో ఒక తామసికసృష్టిని కల్పించదలచుకొని ఇట్టిశక్తు లిచ్చి భయసూచనాసాధనాలుగా ఉపయోగించటానికి ఉద్దేశించి నట్లు అర్థమౌతుంది. అతడు కార్యాచరణదక్షతలో నీకంటే లేదా నాకంటే శక్తివంతుడు కాకపోయినా, ఈనాటిభయంకరకాళరాత్రిలా ఉరుముతూ, మెరుస్తూ, సమాధులు

తెరుస్తూ, సభాభవనంముందు గర్జిస్తూ కన్పించిన సింహం లాగానూ, ఈమహోత్పాతాలలాగాను భయంకరుడై మహా భూతరూపంతో పెరిగిపోయి ఉన్న ఒకవ్యక్తి పేరు చెప్తాను.

కాస్కా : అది 'సీజర్' అనేనా నీఅభిప్రాయం ? అంతేనా కాషియస్ !

కాషియస్ : అది ఎవరైతే నేం! మనపూర్వుల కున్నట్లే ఈనాటిరోంవాసులమైన మనకూ కండరాలు, అవయవా లున్నాయి. అయ్యో! ఎంతచెడుకాలం దాపురించింది. మనలో మనపితృపితామహుల మనఃప్రవృత్తి మరణించింది. మాతృదేవతాశక్తులు మనలను పాలిస్తున్నవి. మనమెడమీది కాడి, బాధాసహనశీలం, మన స్త్రీత్వాన్నే వెల్లడిస్తున్నవి.

కాస్కా : సభాసభ్యులు రేపు సీజర్‌ను రాజును చేస్తారని వా రంటున్నారు. ఇది నిజం. ఇటలీలో తప్ప అతడు సముద్రాలమీదా, భూమిమీదా కిరీటాన్నిధరించి తిరుగుతాడట!

కాషియస్ : అయితే ఈచురికను నిలపటానికి స్థానమేదో నాకు తెలుసు. కాషియస్ బానిసత్వంలోనుంచి కాషియస్‌ను ఉద్ధరించుకోగలడు. ఓదేవతల్లారా! ఈయత్నంలో దుర్బలులను బలశాలులనుగా తీర్చిదిద్దండి. క్రూరపాలకులకు అపజయాన్ని కల్పించండి. రాతిబురుజులు, కంచుగోడలు, గాలి-చొరని చీకటికొట్లు, ఇనుపసంకెళ్ళు, ఉత్సాహబలాన్ని బంధించలేవు. అయినా, జీవితం ప్రాపంచికబంధనాలవల్ల అలసిపోయినా, తన్ను తాను విడిపించుకోలేనంతటి అబల కాదు. ఈఅంశాన్ని తెలుసుకుంటున్నాను. అవగతమైన తక్షణమే నేడు నేను భరిస్తున్న క్రూరపాలనను స్వేచ్ఛానుసారంగా తొలగద్రోసుకో గలనని ప్రపంచానికి ప్రకటిస్తాను.

[ ఇంకా ఉరుములు

కాస్కా: నేనూ అంతే. ఇదేరీతిగా ప్రతిబానిసకూ తన బానిసత్వాన్ని రద్దుచేసుకొని శక్తిహస్తగతమై ఉంది.

కాషియస్: అయితే సీజర్ ఎందుకు క్రూరపాలకుడుగా ఉంటున్నాడు? వెర్రివాడు! అతడు తోడేలు కాదని నాకు తెలుసు; కానీ రోంప్రజలను అతడు గొర్రెలనుగా చూస్తున్నాడు. రోంప్రజలు వేటకుక్కలు కాకపోతే అతడు సింహమెలా కాగలుగుతాడు. మహాగ్నిని జ్వలింపజేయ దలచుకున్నవారు ఎండుగడ్డిపోచలతో ఆపనిని ఆరంభిస్తారు. సీజర్ వంటి క్రూరుడికి ఖ్యాతికల్పించి ప్రకాశింపజేయదలచుకొని రోం ఎంత నికృష్టమైపోయింది! ఎంతటి నింద్యపదార్థమైపోయింది!!

ఓ దుఃఖదేవతా! నీవు నన్నెక్కడికి నడిపిస్తున్నావో! నేను ఇదంతా ఇచ్ఛాపూర్వకంగా బానిసనైపోయినవాడి ముందు చెప్పాననుకుంటాను. అవసరమైతే తగ్గసమాధానం చెప్పటానికి నేను సంసిద్ధుడనై ఉండాలి. అందుకే ఆయుధధారణం చేశాను. రాబోయ్యే ఆపదలతో నా కెట్టి ప్రమేయం లేదు.

కాస్కా: కాషియస్! మాటలుమోయటం అలవాటుకాని కాస్కాతోటే నీవు ప్రసంగించావు. మన దుఃఖాన్ని పటాపంచలుచేయటానికి ఒకపక్షాన్ని స్థాపించు. నేను సుదూరం నడిచే అగ్రగామిని తుదిదాకా అనుసరిస్తాను. ఇదిగో ప్రతిజ్ఞ చేస్తున్నాను.

కాషియస్: ఇందుకు నాకు అంగీకారమే. కాస్కా, ఒక రహస్యం చెపుతున్నాను. గమనించు. గౌరవప్రదమూ,

భయోపేతమూ అయిన ఒకానొక సాహసకృత్యానికి నాకు తోడ్పాటు ఇవ్వవలసిం దసి ఇంతకు కొంతపూర్వమే కొందరు ఉదాత్తప్రకృతిగల రోంనివాసులను కదిలించాను. వారు నాకోసం పాంపేద్వారతోరణందగ్గర వేచిఉంటారు. ఈ భయంకరరాత్రి వీథుల్లో సంచలనంగాని, సంచారముగాని లేదు. మేము తలపెట్టిన పనిలా రక్తోపేతమై భయానకంగా ఉంది భౌతికస్థితి.

కాస్కా : ఎవరో అతివేగంగా ఒకవ్యక్తి ఇటు వస్తున్నాడు దగ్గరగా నిలు.

కాషియస్ : నడకనుబట్టే తెలుస్తున్నది. అది సిన్నా, మన మిత్రుడు.

[ సిన్నాప్రవేశిస్తాడు

సిన్నా ! ఎక్కడికి అంత వేగంగా వెళ్లుతున్నావు?

సిన్నా : మీ రెక్కడ ఉన్నారో తెలుసుకుందా మనే. ఎవ రిది ? మెటల్లస్ సింబర్ ?

కాషియస్ : కాదు, కాస్కా. మనయత్నాలల్లో ఒక సహచరుడు. సిన్నా ! వాళ్లందరూ నాకోసం వేచిఉంటా రనుకుంటాను.

సిన్నా : ఈనాడు నాకెంతో సంతోషంగాఉంది. అబ్బా! ఎంతభయంకరమైన రాత్రి! మాలో ఇద్దరు ముగ్గురం అతి విచిత్రమైన దృశ్యాలు చూచాం.

కాషియస్ : చెప్పు. వాళ్ళు నాకోసం వేచిఉండలేదూ?

సిన్నా : అవును. నీవు మహోదాత్తుడైన బ్రూటస్‌ను మనపక్షానికి చేర్చటంలో విజయాన్ని పొందితే.

కాషియస్ : తృప్తివహించు. సిన్నా ! ఇవిగో ఈపత్రా

లందుకో. చూడు, బ్రూటస్‌కుతప్ప ఇతరు లెవ్వరికీ కని పించని రీతిగా దీన్ని ఆన్యాయాధికారిఆసనంమీద ఉంచు. దీన్ని అతని వాతాయనంద్వారా లోపలపడ వెయ్యి. దీన్ని వృద్ధబ్రూటస్ ప్రతిమీద మైనంతో అంటించిరా. ఈపని ముగించుకొని పాంపేద్వారతోరణం దగ్గిరికి తిరిగిరా. అక్కడ మేమందరం ఉంటాము. డెసియస్ బ్రూటస్, ట్రెబోనియస్‌లు అక్కడ ఉన్నారా?

సిన్నా : మెటెల్లస్ సింబర్ తప్ప అందరూ ఉన్నారు. అతడు నీకోసం మీఇంటికి వెళ్ళాడు. సరే. నేను పరుగుల మీద ఈపత్రాలను నీవు ఆజ్ఞాపించినట్లు చేస్తాను.

కాషియస్ : పాంపేనాట్యశాలకు రావటం మరిచిపోవ్యేవు.

[సిన్నా నిష్క్రమిస్తాడు

కాస్కా! నాతో రా. నీవూ నేనూ బ్రూటస్‌ను అతడి ఇంటిదగ్గిర కలుసుకుందాం. అతడు ఇప్పటికే మూడుపాళ్ళు మనవాడు. మళ్లీ మనం కలుసుకుంటే పూర్తిగా మనవా డౌతాడు.

కాస్కా : అతడు సమస్తప్రజాహృదయాలల్లో మహోన్నత పీఠాన్ని అధిష్ఠించిన వ్యక్తి. ఆతడి తోడ్పాటు ఘనమైన రసాయనమై మనదోషాలుగా కనిపించేవాటిని అన్నింటినీ గుణాలుగా, సుగుణాలుగా, పరివర్తనచేస్తుంది.

కాషియస్ : బలే. అతణ్ణి, అతడిశక్తినీ, మనకు అతడి ఆవశ్యకతనూ చాలాజాగ్రత్తగా గమనించావు! అర్ధరాత్రి గడిచింది. ఇక మనం వెడదాం. తెల్లవారక ముందే అతణ్ణి మేల్కొల్పి గట్టి చేసుకుందాం.

[ఇరువురూ నిష్క్రమిస్తారు

# ద్వితీయాంకం

## ఒకటో దృశ్యం

బ్రూటస్‌ఫలోద్యానవనం. బ్రూటస్ ప్రవేశిస్తాడు.

బ్రూటస్ : ఏమిటి? లూషియస్! మేల్కో. నక్షత్ర గమనాన్నిబట్టి ఉదయానికి ఇంకా ఎంతప్రొద్దు ఉందో లెక్కించలేకుండా ఉన్నాను. లూషియస్! నిజం చెప్పనా? ఇంతగాఢంగా నిద్రపోవటంతో నే నెంతో దోషంచేసినట్లు భావిస్తున్నాను. ఎప్పుడు లూషియస్, ఎప్పుడు? మేల్కో. సంగ తేమిటి లూషియస్ ?

లూషియస్ : పిలిచారా ప్రభూ !

బ్రూటస్ : నావిద్యాకక్ష్యలో దీపం వెలిగించు. తరువాత ఇక్కడికి వచ్చి నన్ను పిలుచుకో వెళ్లు.

లూషియస్ : చిత్తం

[నిష్క్రమిస్తాడు

బ్రూటస్ : అది అతని మృతివల్ల జరగవలసిందే. అందరి కోసంతప్ప అతనిమీద నాకు వ్యక్తిగతంగా అణుమాత్ర మైనా క్రోధంలేదు. అతణ్ణి కిరీటాలంకృతుని చేస్తారు అని ఊహిద్దాం. అందువల్ల అతనిస్వభావం ఎలా మారుతుంది అన్నది ప్రశ్న. మంచిఎండ కాసేరోజు విషసర్పాన్ని వెలి జిమ్ముతుంది.

ఉచ్ఛదశ వ్యక్తి సత్యస్వరూపాన్ని వెల్లడిస్తుంది. అందువల్ల అతిజాగరూకతతో పయనించ వలసిందే. కిరీటా లంకృతుని చేస్తారు? చేస్తే. ఆతడికొక కొండి ఇచ్చిన ట్లౌతుంది.

దాంతో అతడు కోరుకున్నప్పుడు ప్రమాదాన్ని కల్పిస్తాడు. అధికారంనుంచి దయను విడిదీసినప్పుడే అది దుష్ప్రయోగ మహత్వ మౌతుంది.

సీజర్‌ను గురించి సత్యంచెప్పాలంటే అతడి తార్కిక ప్రతిభమీద అనురాగం అధికారం నెరపినట్లు నే నెన్నడూ గమనించిన జ్ఞాపకం లేదు. అణకువ యవ్వన ప్రాయంలో ఉన్న ఆశకు నిశ్రేణిక. దాన్ని ఎక్కేవాడు ఎప్పుడూ పైకే చూస్తుంటాడు. అతడు తుదిమెట్టు చేరుకున్నతరువాత నిచ్చెనవైపు వీపునిలిపి ఎక్కివచ్చిన మెట్లన్నిటినీ చూచి అసహ్యించుకుంటూ మేఘాలల్లోకి తిలకిస్తుంటాడు. సీజర్ కూడా ఇలాగే ప్రవర్తించవచ్చు. అందువల్ల అతని పురోగమనాన్ని ఆపివేద్దాం. అయితే అతడి ప్రవర్తన మనశ్శత్రుత్వానికి నేడు అనుగుణంగా ప్రదర్శితం కావటంలేదు. అందువల్ల అతణ్ణి స్వేచ్ఛగా వ్యవహరించనిస్తే పై ప్రమాదాలు తప్పవని నిరూపిద్దాం. అత డొకసర్పాండం. పొదగబడ్డ తరువాత అది తనస్వభావానికి తగ్గట్టే సహజదుష్టత్వంతో పెరిగిపోతుంది. కాబట్టి దాన్ని అండంలోనే అవియించటం క్షేమం.

[లూసియస్ తిరిగిప్రవేశిస్తాడు

లూసియస్ : ప్రభూ! మీవిద్యాకక్ష్యలో దీపాన్ని వెలిగించి వచ్చాను. శిలాశకలంకోసం మీవాతాయనంలో వెతుకుతుండగా అంటించి ఉన్న ఈపత్రం కనిపించింది. మొదట నేను నిద్రించటానికి శయ్యమీదికి వెళ్ళినప్పుడు అది అక్కడ లేదు; గట్టిగా చెప్పగలను.

[లేఖను అందిస్తాడు

బ్రూటస్ : ఇంకా తెల్లవారలేదు. నీవు వెళ్ళి నిద్రపో... లూసియస్ ! మార్చి పదిహేను రేపే కదూ?

లూసియస్ : అది నాకు తెలియదు ప్రభూ!

బ్రూటస్: పట్టికలు చూచి వచ్చి నాకు ఏసంగతీ చెప్పు.

లూసియస్ : చిత్తం ప్రభూ!

[నిష్క్రమిస్తాడు

బ్రూటస్ : ఈతోకచుక్కలు లేఖను చదవటానికి తగ్గ వెలుగునిస్తున్నవి.

[లేఖను విప్పి చదువుతాడు.

"*బ్రూటస్! మీరు నిద్రిస్తున్నారు. మేల్కొండి. స్వయంగా దర్శిం చండి....ప్రవచించండి, ఛేదించండి. ఉద్ధరించండి!*"

"బ్రూటస్, మీరు నిద్రిస్తున్నారు. మేల్కొండి" ఇలావ్రాసి పడవేసిన ఉద్బోధనలను ఎన్నింటినో ఎత్తు కొన్నాను. "రోం ఇత్యాది" బహుశః దీని అర్థాన్ని ఇలా వ్యాఖ్యానించుకోవా లనుకుంటాను. రోం ఒకవ్యక్తి భయంతో ఉండిపోవలసిందేనా ? ఏమిటి ? రోం ! కేవలం రాజునని చెప్పుకున్నంత మాత్రానికి మాపితరులు టార్క్విన్నును ఈ రోం నగరవీధులగుండా తరిమివేశారు. "ప్రవచించండి, ఛేదించండి, ఉద్ధరించండి". నన్ను ప్రవచించమనీ, ఛేదించమనీ ఉద్ధరించమనీ అర్థిస్తున్నారు. ఓ రోం! ఇదిగో ప్రతిజ్ఞ గైకొం టున్నాను. నిన్ను ఉద్ధరించటానికోసం బ్రూటస్ తన సర్వస్వాన్ని అర్పించటానికి సంసిద్ధుడైనాడు.

[లూసియస్ తిరిగి ప్రవేశిస్తాడు

లూసియస్ : ప్రభూ! మార్చిలో పద్నాలుగు రోజులు గడిచిపోయాయి.

బ్రూటస్ : మంచిది. (లోపలచప్పుడు) ద్వారందగ్గిరికి వెళ్లు, ఎవరో తలుపు తడుతున్నారు.

[ లూసియస్ నిష్క్రమిస్తాడు

కాషియస్! తొలుతగా నీవు నన్ను జాగృతం చేసింది మొదలు నిద్రన్నది ఎరగను. ఒకమహాభయంకర కార్యాకరణానికి, ప్రథమారంభానికీ మధ్యకాలం ఒక పెనుభూతంగానో, ఒకభయానకస్వప్నంలాగానో ఉంటుంది. మేధస్సు మానవ సాధనాలతో సభతీరుస్తుంది. మానవరాష్ట్రం, ఒకచిన్న రాజ్యంలా, విప్లవాలపాలౌతుంది.

[ లూసియస్ తిరిగిప్రవేశిస్తాడు

లూసియస్ : ప్రభూ! ద్వారందగ్గిర ఉన్నది మీబావమరది కాషియస్. మిమ్మల్ని చూడగోరుతున్నాడు.

బ్రూటస్ : అతడు ఒంటరిగానే ఉన్నాడా ?

లూసియస్ : లేదు ప్రభూ ! వారివెంట ఇంకా కొందరున్నారు.

బ్రూటస్ : వా రెవరో నీకు తెలుసునా ?

లూసియస్ : లేదు ప్రభూ! టోపీలతో వారు చెవులదాకా కప్పేసుకున్నారు. వారిముఖాలు సగంవరకూ దుస్తుల్లో మడిగిఉన్నాయి. అందువల్ల వారిని గుర్తించటానికి నాకు ఏచిహ్నం చిక్కలేదు.

బ్రూటస్ : వారిని ప్రవేశపెట్టు.

[ లూసియస్ నిష్క్రమిస్తాడు

వారే విద్రోహవర్గం. ఓవిద్రోహ దేవతా ! దుష్టభూతాలు స్వైరవిహారం చేస్తున్న సమయంలో ఈరాత్రివేళ ఆపత్తుతోకూడిన నీకనుబొమలను చూపించటానికి సిగ్గుపడు

తున్నావా? అయ్యో! అయితే, నీరాకాసిరూపాన్ని కప్పి పుచ్చుకోటానికి పగటివేళ కారుచీకట్లు నిండిన గుహాగహ్వారం నీ కెక్కడ లభిస్తుంది?

విద్రోహమా! అన్యసహాయాన్ని అపేక్షించకు. నీచిరునవ్వులో, నీకృతజ్ఞతాప్రకటనలో సర్వం కప్పిపుచ్చు. సహజరూపంతో నీవు పయనిస్తే ఎరుబస్‌నరకంలోని అంధకారానికి కూడా నిన్ను కప్పిపుచ్చే శక్తి లేదు.

కాషియస్, కాస్కా, డెషియస్, సిన్నా, మెటల్లస్, సింబర్, ట్రెబోనియస్‌లు ప్రవేశిస్తారు.

కాషియస్ : సుప్రభాతం, బ్రూటస్! మీ ప్రశాంతికి భంగం కల్పించటానికి చాలా సాహసించా మనుకుంటాను. ఏమైనా శ్రమకలిగిస్తున్నామా?

బ్రూటస్ : నేను ఇంతవరకూ రాత్రంతా మేల్కొనే ఉన్నాను. నీవెంటవచ్చిన వీరందరూ ఎవరో నేను తెలుసుకోవచ్చునా?

కాషియస్ : తప్పకుండా. ఇందులో ప్రతిఒక్కరినీ మీరు తెలుసుకోవచ్చు. మీమీద గౌరవం లేనివాడు వీళ్లలో ఒక్కడూ లేడు. ఉదాత్తుడైన ప్రతిరోంపౌరుడూ మీమీద ఎటువంటి అభిప్రాయాన్ని కలిగిఉన్నాడో మీరుకూడా మీమీద అటువంటి అభిప్రాయాన్ని కలిగిఉండాలె నని వీరిలో ప్రతిఒక్కరూ వాంఛిస్తున్నారు. — ఇతడు ట్రెబోనియస్.

బ్రూటస్ : ఇదే నాస్వాగతం.

కాషియస్ : ఇతడు డెసియస్ బ్రూటస్.

బ్రూటస్ : ఇతనికీ నాస్వాగతం.

కాషియస్ : ఇతడు కాస్కా, ఇతడు సిన్నా, ఇతడు మెటలస్ సింబర్.

బ్రూటస్ : వీరందరికీ నాస్వాగతం. కళవళపెట్టే ఏభావాలు మీనిద్రకు అంతరాయాన్ని కలిగిస్తున్నాయో అడగవచ్చునా?

కాషియస్ : నీతో ఒక్కమాట చెప్పాలి.

[బ్రూటస్, కాషియస్‌లు గుసగుసలాడుతారు

డెసియస్ : ఇదే తూర్పు. ఇక్కడే సూర్యోదయమౌతుంది.

కాస్కా : కాదు.

సిన్నా : క్షమించండి. ఇక్కడే ఉదయమౌతుంది. అవిగో, దూరంగా మేఘపుంజాలమీద కోసం క్రక్కుతూ, అవిగో అరుణరేఖలు. దివాదేవి వార్తావహులు.

కాస్కా : మీరు ఇరువురూ మోసపోయారు ; ఈవిషయం అంగీకరిస్తారుకూడాను. నేను నాకత్తిని చూపించేవంక, వత్సర యవ్వనకాలాన్నిబట్టి పరిశీలించండి, ఇంకా సుదూరాన, దక్షిణాన సూర్యుడు ఉదయిస్తాడు. ఇంకా రెండునెలలకు ఎంతో ఎత్తున ఉత్తరాన అతడు తనకాంతిపుంజాలతో ప్రకాశిస్తాడు. నిజమైన తూర్పుదిక్కు ఇక్కడికి సభాభవనంలా సూటిగా ఉంది.

బ్రూటస్ : ఒకరితరువాత ఒకరు నాతో కరచాలనం చెయ్యండి.

కాషియస్ : మననిర్ణయాన్నిగురించి శపథం చేద్దాం.

బ్రూటస్ : ఎందుకు శపథంతో పనిలేదు. మనముఖాలల్లో వ్యథ వ్యక్తంకాకపోతే, ఆత్మల్లో అశాంతి ప్రబలకపోతే, కాలంలో దౌష్ట్యం కలతపెట్టకపోతే, — ఈరీతికారణాలన్నీ బలహీనాలైతే - ఇంకా మనం ముందుకు పయనించకముందే

మాంద్యంవహించి మనశయ్యాగారాలను చేరుకుందాం. ఒక్కొక్కరివంతు వచ్చి పూర్తిగా మనం రాలిపోయేదాకా దీర్ఘదృష్టిగల క్రూరపాలనను కొనసాగనిద్దాం. ఈమూలకారణాలే శక్తివంతాలైతే, కాకేం - శక్తివంతాలే, పిరికిపందలను మహావీరులనుగా రగులుస్తాయి. కరగిపోయే స్త్రీలహృదయ భావాలకు పౌరుషకవచాలౌతాయి. దేశీయులారా! మనలను మనం ఉద్ధరించుకోటానికి ప్రేరేపించను మనకారణాలు తప్ప వేరే శపథాలతోగాని మరోవాటితోగాని మనకు పనేముంది? రహస్యగోపనంలో ఖ్యాతిగన్న రోంప్రజలమాట, కల్లబొల్లి కానిమాట, చాలదూ? 'సత్యసంధులు సత్యసంధులతో ఇది చేసితీరాలి; చచ్చి తీరాలి' అని చెప్పిన మాట చాలదూ? మరోబంధ మెందుకు? ఛాందసులు, పిరికిపందలు, మోసకారులు, నిరుపయోగులు, ఇలాగే ఇంకా చెడుగులను ఆహ్వానించే వ్యథితహృదయులూ శపథంచేస్తుంటారు. మానవులను అనుమానించేవ్యక్తులు దుష్టచర్యలకు పూనుకున్నప్పుడు శపథం చేస్తుంటారు. మనకారణాలుగాని, ఆభరణవిధానాలుగాని శపథాన్ని ఆశిస్తవని భావించి మన సాహసకృత్యసద్గుణాన్నిగాని, అణచరాని మన అనంత ధైర్యాన్నిగాని కళంకితం చెయ్యవద్దు. రోంపౌరుని నోట వెలువడిన శపథంలో ఏఅణుమాత్రం తప్పినా అతడు మహోదాత్తంగా శరీరంలో వహించే రక్తంలోని ప్రతిబిందువులోనూ ఏదో నైచ్యం ఉన్నదన్నమాట!

కాషియస్: అయితే సిసెరో సంగతేమిటి? వాణ్ణికూడా మనం కదిలించి చూద్దామా? అతడు మనతో అతిగాఢంగా తుదిదాకా నిలుస్తాడనే నానమ్మకం.

కాస్కా : వాణ్ణి మనం వదిలిపెట్టకూడదు.

సిన్నా : నిజమే. తప్పక వదిలిపెట్టకూడదు.

మెటిల్లస్ : అతడు మనలో తప్పకుండా ఉండితీరాలి. వాడి నెరిసిన జుట్టువల్ల మనకు ప్రజాభిప్రాయం ఎంతో అనుకూలమౌతుంది. మనం చేసే కృత్యాలను కీర్తించే గొంతుకలు దొరుకుతాయి. బుద్ధిబలంవల్ల అతడు ఆలోచించి నిర్ణయించినదాన్నే మనమంతా ఆచరిస్తున్నామని జనం అనుకుంటారు. మనయవ్వనోద్రేకాలు అతనిగాంభీర్యమనే కప్పు క్రింద ఒదిగిఉంటాయి.

బ్రూటస్ : అతడిపేరు చెప్పకండి. మనమహాకార్యాన్ని అతనికి తెలియజేయకూడదు. అతడు ఎన్నడూ ఇతరులు ఆరంభించినదాన్ని అంగీకరించి అనుసరించే స్వభావంకలవాడు కాడు.

కాషియస్ : అయితే మనం అతణ్ణి వదిలివేయవలసిందే.

కాస్కా : అవును. నిజం. వాడు ఇందుకు తగినవాడుకూడా కాడు.

డెసియస్ : సీజర్‌ను తప్ప మనం మరి ఇతరులను ఎవరినీ ముట్టుకోకూడదు.

కాషియస్ : సందర్భోచితంగా జ్ఞప్తికి తెచ్చావు. సీజర్ మరణానంతరం అతడికి అతిప్రియుడైన మార్క్ ఆంటొని సజీవుడై ఉండరాదు. ఉంటే అతడు మహామేధావి. మంచి అవకాశాలు కలవాడు. అతడు సమీకరిస్తే మన కైనైనా గట్టిచిక్కులు తెచ్చిపెట్టగలడు. అటువంటి పరిస్థితి రాకుండా చేసుకోటానికి మనం సీజర్ ఆంటొనీలను ఇరువురినీ ఏక కాలంలో తొలిగించాలి.

(బ్రూటస్ కైయస్ కాషియస్! ఇలా అయితే మన మార్గం మరింత రక్తోపేతంగా కనిపిస్తుంది. సీజర్‌కు ఆంటొనీ కేవలం ఒక అవయవం. చంపటంతో కోపం చల్లారుతుంటే ఇంకా ఈర్ష్యతో మోదటమెందుకు! శిరస్సును ఖండించిన తరువాత అవయవాలను చిత్రవధ చేయట మెందుకు?

కైయస్! యజ్ఞకర్తల మాదాముగాని మనం కసాయి వాళ్ళం కావద్దు. మనమందరమూ సీజర్ తత్వానికి వ్యతిరేకులం కాని అతడికి వ్యతిరేకులం కాదు. మానవుల తత్వాలకు రక్తమంటూ లేదు. సీజర్ తత్వాన్ని తొలగించటానికి మరోమార్గ మంటూ ఉంటే అతణ్ణి చంపవలసిన అగత్యమే మన కుండేది కాదు. కానీ, అందువల్ల, అయ్యో! సీజర్ రక్తాన్ని ఒలికించవలసి వస్తున్నది.

ప్రియమిత్రులారా! మనం సీజర్‌ను ధైర్యంతో అంత మొందించాలి. అంతేగాని కోపోద్రేకంతో చంపరాదు. అతణ్ణి దేవతలు స్వీకరించటానికి యోగ్యమైన హవిస్సుగా తుదముట్టిద్దాం. వేటకుక్కలకు ఆహారంగా పరిణమించే కబంధాన్ని చేయకూడదు. మనహృదయాలు జిత్తులమారి యజమాని సేవకులచేత కోపోద్రిక్తకృత్యాలను చేయించి తరువాత శిక్షించేటట్లుగా ప్రవర్తించాలి. ఇలా వర్తిస్తే మనం అవసరంవల్ల ఇట్టి చర్య తీసుకున్నామే గాని ఈర్ష్యవల్ల కాదని వెల్లడౌతుంది. జనసామాన్యనేత్రాల కిలా కన్పించడంవల్ల మనం పవిత్రకార్యకర్తల మాత్రామేకాని హంతకులం కాము. మార్క్-ఆంటొనీని గురించి మనం ఆలోచించవలసిన పనిలేదు. సీజర్ శిరస్సును ఛేదించినపుడు అతనిహస్తం ఏమీ చేయలేక ఎలా పడిపోతుందో అతడూ అలాగే ఐపోతాడు.

కాషియస్ : అయినా, నాకు అతడంటే భయం. అతడు తనహృదయాంతరాన్ని తొలిచి అందులో సీజర్ మీది ప్రేమను నిబద్ధంచేశాడు.

బ్రూటస్ : ప్రియమైన కాషియస్ ! అతణ్ణిగురించి ఇక ఆలోచించకు. సీజర్ మీద అతడికి అంతగాఢానురాగం ఉన్నా అతడు చేయగలిగిం దేమిటి? పదేపదే సీజర్‌ను గురించి ఆలోచించుకొని అతడికోసం మరణించటమే. క్రీడ లన్నా, తిరుగుబోతుతన మన్నా, గోష్ఠు లన్నా ఎప్పుడూ అతడికి ఆసక్తి అధికం. అంతపని చేయనే చేయడు.

ట్రెబోనియస్ : అతడివల్ల ఏప్రమాదమూ ఉండదు. అతడి మృతి మన కనవసరం. బ్రతికి అతడు తరువాత దీనికి పరిహాస మాడుతాడు.

[ఘంటిక మ్రోగుతుంది

బ్రూటస్ : నిశ్శబ్దం ! ఎన్ని కొట్టిందో లెక్కించండి.

కాషియస్ : మూడు కొట్టింది.

ట్రెబోనియస్ : ఇక మనం విడివడిపోవటానికి సమయ మైంది.

కాషియస్ : కానీ సీజర్ ఇవాళ వస్తాడా అన్నదే ఇంకా అనుమానంగా ఉంది. ఒకప్పుడు అతడికున్న భావాలకు భిన్నంగా ఇప్పు డతడికి భూతాలన్నా, కలలన్నా, శకునా లన్నా చేదస్తం పట్టుకొని బలిసిపోయింది. ఇంత స్పష్టంగా గోచరించే ఈశకునాలు, అసాధారణమైన ఈనిశీథిని కల్పిం చిన భయం, శకునజ్ఞుల నిర్బంధం — ఇవన్నీ ఏకమై అతణ్ణి సభాభవనానికి రానీయకుండా నిలిపివెయ్యవచ్చు.

డెసియస్ : అందుకు మీ రేం భయపడవద్దు. ఒకవేళ

అతడు రానని తీర్మానించుకున్నా నేను అతణ్ణి త్రిప్పేయ గలను. శృంగాశ్వాలను చెట్లతో, భల్లూకాలను అద్దాలతో, ఏనుగులను గర్తాలతో, సింహాలను వాగురులతో, మానవు లను స్తుతిపాఠకులతో మోసగించవచ్చు నని చెపితే అతడు ఎంతో సంతోషంగా వింటుంటాడు. అతణ్ణి మిక్కిలిగా స్తుతించి మీకు స్తుతిపాఠకు లంటే చాలా అసహ్యం అన్న ప్పుడు అతడు అవునని అంగీకరిస్తాడు. అతణ్ణి సభాభవనానికి రప్పించే పని నాకు ఒప్పచెప్పండి. చిత్తప్రవృత్తికి తగ్గ దోహదంచేసి అతణ్ణి నేను సభాభవనానికి తీసుకోవస్తాను.

కాస్కా : అం తెందుకు ? అతణ్ణి తీసుకోరావటానికి మన మందరం వెడదాం.

బ్రూటస్ : ఎనిమిది గంటలకు ? అంతకు మించకూడదు కదూ ?

సిన్నా : మించకూడదు; తప్పకూడదు కూడాను.

మెటల్లస్ : పాంపేనుగురించి మంచిగా మాట్లాడా డని సీజర్ అతణ్ణి కోపించాడట ! కెయస్ లిగారియస్‌కు అతడి మీద గుర్రుగాఉంది. మీలో ఎవరూ అతణ్ణిగురించి ఆలో చించకపోవటం నాకు వింతగా ఉంది.

బ్రూటస్ : ప్రియమిత్రుడా, మెటలస్ ! నీవు అతడి ఇంటి మీదుగా వెళ్ళు. అతడికి నేనంటే ఎంతో అనురాగం. ఇందుకు ఎన్నో కారణా లున్నాయి. అతణ్ణి నాదగ్గరకే పంపించు. నేను తగ్గట్టుగా అతణ్ణి తీర్చి దిద్దుతా.

కాషియస్ : ఇక మనకు తెల్లవారింది. బ్రూటస్ ! మేము సెలవుతీసుకుంటాము. ప్రియమిత్రులారా ! మీరు వెళ్ళండి. నిజమైన రోమనుపౌరుల్లాగా వ్యవహరించండి.

బ్రూటస్ : మిత్రులారా ! మీరందరూ ఉత్సాహంతో, మహానందానుభూతిని పొందుతున్నట్లుగా కన్పించాలి. మీ చూపులవల్ల మనఉద్యమం ఎక్కడా బయటపడిపోరాదు సుమా ! మీరు అలసటిలేని ఉత్సాహంతో, నిత్యాభ్యస్తమైన నైపుణ్యంతో రోంనటకుల్లా ప్రవర్తించాలి. – మీలో ప్రతిఒక్కరికీ రేపు సుప్రభాతం.

[ బ్రూటస్‌తప్ప మిగిలినవారంతా నిష్క్రమిస్తారు.

ఒరేయ్, లూసియస్ ! మంచినిద్రలో ఉన్నావా ? పోనీలే. నిద్రాదేవి నీకిచ్చే మరందమాధుర్యాన్ని అనుభవించు. నిరంతరం ఆందోళనపెట్టే జాగరూకతలు మానవుల బుద్ధికుడ్యాలమీద గీసే చిత్రాలవంటి భూతాకృతులు నీకు లేవు. అందుకనే నీవు గాఢనిద్రలో ఉన్నావు.

పోర్షియా ప్రవేశిస్తుంది

పోర్షియా : ప్రభూ ! బ్రూటస్!!

బ్రూటస్ : పోర్షియా! ఎందు కింత పెందలకడ మేల్కొన్నావు? బలహీనంగా ఉన్న నీవు ఇటువంటి ఉదయకాల శీతలపవనాలల్లో తిరగటం ఆరోగ్యానికి ఎంతమాత్రం తగదు.

పోర్షియా : ఇది మీకు తగిందేనా మరి? – ఔదార్యరహితంగా నాశయ్యనుంచి జారుకొచ్చేశారు. రాత్రి, భోజనసమయంలో హఠాత్తుగా లేచి, చేతులుకట్టుకొని, ఏమేమో ఇలోచిస్తూ, నిట్టూరుస్తూ, పచార్లు చేశారు. విషయ మేమిటని అడిగితే నావంక అనుదాత్తనేత్రాలతో తిలకించారు. నేను పట్టుపట్టి అడిగాను. మీరు శిరఃకంపం చేశారు; ఎంతో అశాంతితో అరికాలు నేలకు ఘట్టించారు. ఇంకా నేను పట్టిపట్టి అడిగాను. అయినా మీరు నాకేమీ సమాధానం చెప్ప

లేదు. అతికోపంతో మిమ్మల్ని వదలిపెట్టి వెళ్ళవలసిం దని సంజ్ఞగా హస్తచాలనం చేశారు. సుస్పష్టంగా అభివ్యక్త మయ్యే మీఅశాంతి ఇంకాపుష్టిని చేకూర్చుకుంటున్న దన్న భయంతోనూ, ప్రతివ్యక్తికీ ఎప్పుడో ఒకప్పుడు ధాతుసంచలనవిపర్యాసంవల్ల కలిగే స్థితిగతి తప్ప మరేమీ కాదని ఊహించుకోటంవల్లనూ మీరు కోరినట్లు మిమ్మల్ని ఏకాంతంగా వదలిపెట్టి వెళ్ళాను.

కానీ ఆస్థితి మిమ్మల్ని భోజనం చెయ్యనివ్వటం లేదు, మాట్లాడనివ్వటం లేదు. అది మీమనస్సుమీద ఎంతగా పనిచేస్తున్నదో అంతగా బాహ్యరూపంమీదకూడా పనిచేస్తే నేను మిమ్మల్ని గుర్తుపట్టగలిగేదాన్నే కాదు. ప్రియప్రభూ! మీదుఃఖకారణ మేమిటో నాకు తెలియజేయండి.

బ్రూటస్ : నాఆరోగ్య మంత బాగాలేదు; అంతే.

పోర్షియా : బ్రూటస్ బుద్ధికుశలుడు; ఆరోగ్యం బాగుండకపోతే తగ్గచర్యలు చేసి దాన్ని జయిస్తాడు.

బ్రూటస్ : జయించటం లేదని నీకు అనుమాన మెందుకు కలిగింది! అలాగే చేస్తున్నాను. —ప్రియా, పోర్షియా! నీవు వెళ్ళి శయనించు.

పోర్షియా : సుస్తిగా ఉన్న దంటున్నారు. నిజమైతే గుండీలు లేకుండా ఇలా ఉదయకాలపు చలిగాలిని పీలుస్తారా మరి? మీకే సుస్తిగా ఉంటే సౌఖ్యదాయకమైన శయ్య నుంచి జారుకొని రాత్రివేళ సాహసించి, ఎదుర్కోటానికి తడిగాఉన్న విషవాయువులను ఆహ్వానించి జాడ్యాన్ని వృద్ధి చేసుకుంటారా?

లేదు. ప్రియా! బ్రూటస్! మిమ్మ ల్నేదో మానసిక

వ్యథ వేధిస్తున్నది. నాకున్న సత్యాన్నిబట్టీ, నాస్థానాన్నిబట్టీ అ దేమిటో నేను తెలిసికోక తప్పదు. ఇదిగో, మీముందు మోకరిల్లుతున్నాను. ఒకనాడు మీరు స్తుతించిన నాసౌంద ర్యంమీద, సమస్తప్రణయప్రతిజ్ఞలమీద, మనఇసువురినీ ఏకం చేసిన ఆమహాప్రతిజ్ఞమీద ఒట్టుపెట్టి మిమ్మల్ని వేడుకొంటు న్నాను. మీహృదయభారమేమిటో, ఎవరో ఆరేడుగురు చీకటికి కూడా ఎరుకపడకుండా ముఖాలు కప్పుకొని వచ్చారు, ఈరాత్రి మీతో గోష్ఠిచేసిన ఆవా రెవరో, మీఅర్ధాంగి నైన నాకు తెలియచెప్పండి.

బ్రూటస్ : ప్రియా, పోర్షియా! మోకరిల్లకు.

పోర్షియా : మీరు ఉదాత్తులైన బ్రూటస్ ఐనంతవరకూ నాకు మోకరిల్లవలసిన పనిలేదు. మీకు సంబంధించిన రహస్యా లేవో నేను వినకూడ దని మనవివాహబంధంలో ఎక్కడైనా ఉందా? మీతో భుజించటానికి, శయనించ టానికి, లేదా కొన్నిసందర్భాలల్లో ప్రసంగించటానికి మాత్ర మేనా నేను మీఅర్ధాంగిని? మీహృదయబాహ్యభూమిలో మాత్రమే నేను వర్తిస్తున్నా నన్నమాట! నేను ఇంతకంటే అధికస్థితి వహించకపోతే పోర్షియా బ్రూటస్‌కు ఉంపుడు కత్తె; కానీ ధర్మపత్ని కాదు.

బ్రూటస్ : పోర్షియా! నాహృదయంలో ఉన్న వేడినెత్తురు బొట్లలా నీవు నాకు ప్రియమైనదానివి. సత్యం వచిస్తున్నాను, నీవు నాగౌరవనీయమైన ధర్మపత్నివి.

పోర్షియా : మీరు పలికేది సత్యమైతే మీఈ రహస్యం నాకు తెలిసిఉండవలసింది కదూ? నేను ఒకస్త్రీనని అంగీక రిస్తాను. కానీ, ప్రభువు బ్రూటస్‌కు పత్నినైన స్త్రీని. నేను

ఒకస్త్రీ నని అంగీకరిస్తాను; కానీ ప్రశస్తి కెక్కినదాన్ని, కేటో పుత్రికను. అటువంటి తండ్రికి కుమార్తెనూ, ఇటువంటి భర్తకు భార్యనూ అయిన నన్నే నాజాతిసామాన్యులకంటే ప్రబలను కానని భావిస్తున్నారా?

ప్రభూ! మీరహస్యాలేమో నాకు చెప్పండి. వాటిని నేను బయటపెట్టను. ఇందుకు ఆవశ్యకమైన నిశ్చలత నాకున్న దని నిరూపించటంకోసం ఇదుగో, ఈఊరువులో గాయాన్ని కల్పించుకుంటున్నాను. దీన్ని ఓర్పుతో భరించగలదాన్ని మీరహస్యాలను భరించలేనేమో పరికించండి.

బ్రూటస్: ఓ దేవతల్లారా! ఇంతటి ఉదాత్తప్రకృతిగల పత్నికి తగ్గభర్తనుగా నన్ను తీర్చి దిద్దండి.

[లోపల తలుపుచప్పుడు

వింటున్నావా, పోర్షియా, ఎవరో తలుపుతడుతు న్నారు. నీవు కొంచెంసేపు లోపలికి వెళ్లు. నారహస్యా లేమో నీకు కొద్దికాలంలో తెలియజేస్తాను. నాప్రవర్తనా సర్వస్వాన్ని నీకు వెల్లడిస్తాను. దీనమైతోచే నాముఖలక్ష ణానికి కారణం వినిపిస్తాను. — త్వరగా లోపలికి వెళ్లు. [పోర్షియా నిష్క్రమిస్తుంది.] లూసియస్, ఆ తలుపుతట్టేది ఎవరు?

[లిగారియస్‌తో తిరిగి లూసియస్ ప్రవేశిస్తాడు.

లూసియస్: ఎవరో జబ్బుమనిషి; మీతో మాట్లాడా లట!

బ్రూటస్: మెటెల్లస్ చెప్పిన కేయస్ లిగేరియస్ ఇతడే ఐఉంటాడు. లూసియస్, నీవు పక్కగా తొలుగు. కేయస్ లిగేరియస్! ఏమిటిది?

లిగేరియస్: బలహీనమైన నాకంఠం పలికే ప్రణామ వాక్యాలను స్వీకరించండి.

బ్రూటస్: కేయస్, సాహిసికుడవైన నీవు జబ్బుపడటానికి బలే మంచిసమయాన్ని చూచుకున్నావే.

లిగేరియస్: గౌరవప్రదమైన ఒకసాహస కృత్యానికి బ్రూటస్ పూనుకుంటే నేను జబ్బుపడ్డట్లే కాదు. నాకు జబ్బే ఉండదు.

బ్రూటస్: నేను అట్టిచర్యకు పూనుకున్నాను. నీకు ఆరోగ్యం బాగా ఉండిఉన్నట్లైతే అంతా విశదంగా చెప్పేవాణ్ణి.

లిగేరియస్: నిత్యం రోంనివాసులు ప్రణమిల్లే దేవతల సాక్షిగా నేను నారుగ్మతను పరిత్యజిస్తున్నాను. మీరు రోముకు అంతరాత్మలు. గౌరవనీయులైన మాతాపితరులకు జన్మించిన వీరపుత్రులు. ఒకఐంద్రజాలికుడిలాగా వ్యథిత హృదయుడనైన నాకు ఉత్తేజాన్ని ప్రసాదిస్తున్నారు. మీరు నన్ను పరుగెత్తమని ఆజ్ఞాపించండి. దేనినైనా వెనకపడేసేటట్లు పరుగెత్తుతాను. ఏమి చెయ్యమంటారో సెలవీయండి.

బ్రూటస్: ఏదైనా సరే అనారోగ్యవంతులకు ఆరోగ్యమిచ్చేది, నిర్జీవులకు జీవంపోసేదీ అయిన ఒకచర్య చెయ్యి.

లిగేరియస్: అయితే జీవించిఉన్న కొందరిని నిర్జీవులను చెయ్యటం మన కేమన్నా అవసరమా?

బ్రూటస్: అవును. అదికూడా నిర్వర్తించవలసి ఉంది. కేయస్! మనం ఎవరికి ప్రమాదాన్ని కల్పించదలచుకున్నామో అతడిఇంటికి వెళ్లేటప్పుడు దాన్నిగురించి సవిస్తరంగా తెలియజేస్తాను.

లిగేరియస్ : అయితే నడిపించండి. నవ్యోత్తేజాన్ని పొందిన హృదయంతో నేను అనుసరిస్తాను. నే నేం చెయ్యటానికి వెళ్లుతున్నానో నాకే తెలియదు ; అవసరం లేదుకూడాను. కానీ, బ్రూటస్ మహాశయుడు నన్ను నడిపిస్తున్నాడని మాత్రం నాకు తెలిస్తే చాలు.

బ్రూటస్ : అయితే, అనుసరించు.

[నిష్క్రమిస్తారు

# రెండో దృశ్యం

సీజర్ ప్రాసాదంలో ఒకఘనకక్ష్య. ఉరుములు, మెరపులు. సీజర్ రాత్రిదుస్తులతో ప్రవేశిస్తాడు.

సీజర్ : ఈరాత్రి భూవ్యోమాకాశాల రెంటిమీదా ఎక్కడా శాంతిఉన్నట్లు గోచరించటం లేదు. 'అయ్యో! సాయపడండి!! వారు సీజర్‌ను హత్యచేస్తున్నారు' అని కల్పూర్నియా ముమ్మారు నిద్రలో కేకలుపెట్టింది. —ఎవ రక్కడ?

సేవకుడు ప్రవేశిస్తాడు

సేవకుడు : ప్రభూ!

సీజర్ : వెళ్లు. 'వెంటనే దేవతలకు బలిఇచ్చి నావిజయాన్నిగురించిన వార్తలను తెలుసుకో' మని చెప్పు. వారు వినిపించే వార్తలను తీసుకోరా.

సేవకుడు : చిత్తం, ప్రభూ!

[నిష్క్రమిస్తాడు

కల్పూర్నియా ప్రవేశిస్తుంది.

కల్పూర్నియా : ఏమిటి ఎక్కడికైనా వెళ్ళటానికి నిశ్చయించారా ? మీరు ప్రాసాదాన్నివదలి ఈనాడు ఎక్కడికీ వెళ్ళటానికి వీల్లేదు.

సీజర్ : సీజర్ తప్పక వెళ్ళితీరాలి. నాఎదట నిల్చి ఇంత వరకూ ఎవరూ, ఏదీ, నన్నెదిరించ లేదు. నీవు ఇంతగా భయ పడుతూఉన్న భయంకరవిషయాలన్నీ నాముఖం చూచేటప్ప టికి అదృశ్యమైపోతాయి.

కల్పూర్నియా : సీజర్ ! నేను ఎన్నడూ శకునాలనుచూచి ఇంతవరకూ భయపడ్డదాన్ని కాను. కానీ, అవి ఈనాడు నన్ను కళవళపెడుతున్నవి. కొన్నింటినిగురించి మనం విన్నాం; మరికొన్నింటిని కళ్ళారా కన్నాం. మనప్రాసాదపాలకులు చూచినట్లు చెప్పేవి ఇంకా మరికొన్ని ఉన్నాయి. ఒకసింహి ప్రజావీథుల్లో విచ్చలివిడిగా సంచరించి సంతానాన్ని ప్రసవిం చిందట ! శ్మశానభూముల్లో సమాధులు ఆవలిస్తే అందులో నుంచి మృతిపొందినవారు లేచివచ్చారట ! యుద్ధోచిత వేషాలతో సైనికులు భయంకరంగా బారులుతీర్చి మేఘ మండలాల్లో పోరాటాలు సాగించారట !! అందువల్లనే సభా భవనంమీద రక్తవర్షం కురిసిందట !!! యుద్ధధ్వనులు ఆకసమంతా అలముకున్నాయి. అశ్వాలు భయంకరంగా హేషించాయి. మరణించేవారి ఆక్రోశకంఠాలు వినిపించాయి. భూతాలు వికటాట్టహాసాలతో వీథుల్లో విచ్చలవిడిగా సంచ రించాయిట ! సీజర్, ఇవన్నీ ఎంత అసహజమైన అంశాలు ! నాకు భయంవేస్తున్నది.

సీజర్ : దేవతలు ప్రబలులు. వారిఉద్దేశాలను ఎదు ర్కొనేశక్తి ఎవరికుంది ? అయినా, సీజర్ వెళ్ళితీరాలి. ఈ అపశకునాలన్నీ సీజర్ ఒక్కడికేనా ? ఇవి ప్రపంచమంతటికీ సమానమైనవి.

కల్పూర్నియా : భిక్షుకులు మరణించేటప్పుడు తోకచుక్కలు

కన్పించవు; రాజపుత్రుల మృతినే వినువీధి వెలిగి సూచిస్తుంది.

సీజర్ : భీరువులు మృతికిపూర్వం ఎన్నోమార్లు మర ణిస్తుంటారు. వీరులు ఒక్కమారుతప్ప మరణరుచిని చూడరు. నాజీవితంలో ఎన్నో వింతలు విన్నాను. మృత్యువు రావలసి నప్పుడు వస్తుందనీ, అది తమకు అత్యావశ్యకమైన అంతమనీ గమనించికూడా మానవులు దానికోసం భీతివహించటమే నాకు అతివిచిత్రవిషయంగా గోచరిస్తున్నది.

సేవకుడు తిరిగి ప్రవేశిస్తాడు

కాలజ్ఞులు ఏమన్నారు ?

సేవకుడు : మీ రీనాడు ప్రాసాదాన్ని వదలి ఎక్కడికీ వెళ్ళటానికి వారు ఇష్టపడటంలేదు. బలిపశువును విశసనం చేసి చూచినప్పుడు దానిగుండె వారికి కనిపించలేదట!

సీజర్ : తమ భీరుత్వాన్ని చూచుకొని మానవులు సిగ్గు పడటంకోసం దేవతలు ఇలాగే చేస్తుంటారు. భయంవల్ల సీజర్ ఈనాడు తనప్రాసాదంలోనే ఉండిపోతే అతడు గుండె లేని పశు వౌతాడు! వీల్లేదు. సీజర్ పశువు కావటానికి వీల్లేదు. అపాయానికి సీజర్ తనకంటే అపాయకరమైనవాడని తెలుసు. నేనూ ఆఅపాయం ఒకనాడే జన్మించాం. ఇరువురం సింహాలం. మాఇరువురిలో నేనే పెద్దను. నేనే భయంకరుణ్ణి. — సీజర్ వెళ్ళితీరవలసిందే.

కల్పూర్నియా : ప్రభూ! మీవిశ్వాసం జ్ఞానశక్తిని వినాశం చేస్తున్నది. ఈనాడు మీరు ఎక్కడికీ వెళ్ళవద్దు. మిమ్మల్ని మీభయం కాదు, నాభయం ఆపివేసిందని ప్రకటించండి. మనం మార్క్ ఆంటొనీని సభాభవనానికి పంపుదాం. అతడు మీకు ఈనాడు శరీరస్వస్థతలేదని నివేదిస్తాడు. ఇదిగో,

మీముందు మోకరిల్లి వేడుకొంటున్నాను, ఈవిషయంలో నాకు లొంగిపొండి.

సీజర్ : కల్పూర్నియా! నీఇష్టాన్ని తీర్చటానికి నేను ఇంటివద్దనే ఉండిపోతాను. మార్క్ ఆంటొనీ వెళ్లి నాకు స్వస్థత లేదని వారికి చెపుతాడు.

డెషియస్ ప్రవేశిస్తాడు

అడుగో డెషియస్. అతడు వారి కీవిషయం చెపుతాడు.

డెషియస్ : మహోదారపురుషా, సీజర్! శుభం. సుప్రభాతం. నేను మిమ్మల్ని సభాభవనానికి తీసుకోవెళ్ళటానికి వచ్చాను.

సీజర్ : సభాసభ్యులకు నాఆకాంక్షను తెలియజేయటానికి నీవు సరిగా సమయానికి వచ్చావు. నేను ఈనాడు సభకు రానని వారితో చెప్పు. రాజాల ననకు; అది అబద్ధం. రావటానికి ధైర్యం లేదనకు. అది అంతకంటే అబద్ధం. డెషియస్! ఈనాడు రానని చెప్పు.

కల్పూర్నియా : వారికి సుస్తిగా ఉందని చెప్పు.

సీజర్ : సీజర్‌కు అసత్యాన్ని చెప్పిపంపవలసిన పనేముంది? ఈ గడ్డాలు నెరసిన వృద్ధులందరికీ అసత్యాలు చెప్పిపంపటానికీ, భయపడటానికేనా జైత్రయాత్రల్లో విశ్రాంతిని ఎరుగకుండా నాబాహుదండాలను అలయించింది. డెషియస్, వెళ్లు. వారికి సీజర్ రాడని చెప్పు.

డెషియస్ : మహాబలశాలీ, సీజర్! నాకేదైనా ఒక కారణం చెప్పండి. లేకుండా మీరు చెప్పమన్నట్లు చెబితే వారందరూ నన్ను పరిహాసం చేస్తారు.

సీజర్ : కారణమా? నాఇచ్ఛ ఇందుకు కారణం. నేను

రాను. సభను తృప్తిపరచటానికి ఇది చాలు. కానీ, నీవు నాకు ప్రేమపాత్రుడివి కనుక నిజమైన కారణాన్ని నీకోసం చెప్పుతున్నాను. కల్పూర్నియా నన్ను ఇంటివద్ద ఆపివేస్తున్నది. గడచినరాత్రి నాప్రతిమ ఒక జలాధారలా నూరునాళికలతో స్వచ్ఛమైన రక్తాన్ని చిమ్మినట్లు ఆమె కలగన్నది. అనేకమంది లోభులైన రోమన్లు ఆరక్తంతో తమచేతులు ముంచెత్తారట! ఈశకునాలు రాబోయ్యే అశుభానికి సూచకాలని ఆమె వ్యాఖ్యానించింది. ప్రణమిల్లి ఈనాడు ఇంటివద్దనే ఉండిపొమ్మని ప్రార్థించింది.

డెసియస్ : కల అపమార్గంలో వ్యాఖ్యానితమైంది. ఈ దృశ్యం ఎంతో రమణీయమైంది; అంతేకాదు; శుభప్రదమైంది. అనేకమందిరోమన్లు తమచేతులు ముంచేటట్లు మీప్రతిమ ఒకజలాధార వలె రక్త మెగజిమ్ముం దంటే మీనుంచి రోం పునరుజ్జీవాన్ని పొందే రక్తాన్ని పానంచేస్తున్న దన్నమాట! పెద్దవాళ్లందరూ మీజ్ఞాపకార్థాలైన పట్టికలు, చిహ్నాలు ఇతరస్మృతిచిహ్నాలైన వస్తువులకోసం మీచుట్టూ మూగుతా రన్నమాట! ఇదీ కల్పూర్నియాదేవి స్వప్నానికి క్రమమైన అర్థం.

సీజర్ : ఆస్వప్నానికి ఇది నిజంగా రమణీయ మైన వ్యాఖ్యానం.

డెసియస్ : నేను చెప్పినదాన్ని మీరు విన్నారంటేనే చాలు, నేను సవ్యంగా వ్యాఖ్యానించా నన్నమాట! ఇంకా నేను చెప్పవలసింది కొంతఉంది. వినమని ప్రార్థిస్తున్నాను. మహాబలశాలిఅయిన సీజర్ మహాశయులకు కిరీటప్రదానం చెయ్యాలని సభ నిర్ణయించింది. 'నేను రాను' అని మీరు

వార్త పంపిస్తే సభవారి మనస్సు మారిపోవచ్చు. అంతే కాదు. 'సీజర్ భార్యామణికి ఇంకా మంచికల వచ్చేదాకా సభను వాయిదా వెయ్యండి' అని ఎవరైనా పరిహాసమాడ టానికి కూడా అవకాశముంది. ఇలా దాక్కుంటే 'అయ్యో! సీజర్ పిరికిపడ్డాడని గుసగుసలాడరూ? క్షమించండి! ప్రస్తుతం నాబుద్ధిబలాన్ని త్రోసిరాజని నాకు మీమీద, మీ కార్యనిర్వహణమీద ఉన్న ప్రేమ మీతో ఇంత స్వేచ్ఛగా మాట్లాడటానికి ప్రేరేపించి ఆజ్ఞాపిస్తున్నది.

*సీజర్* : కల్ఫూర్నియా! నీభయం ఎంతటి అర్థరహిత మైందో ఇప్పుడు అవగతం చేసుకున్నావా? దానికి నేను లొంగిపోయినందుకు నా కెంతో సిగ్గువేస్తున్నది. నేను వెళ్లి తీరుతాను. ఏవీ నాదుస్తులు.

పబ్లియస్, బ్రూటస్, లిగారియస్, మెటిల్లస్, కాస్కా, ట్రిబోనియస్, సిన్నాలు ప్రవేశిస్తారు.

అడుగో, చూడు; పబ్లియస్ నన్ను తీసుకోవెళ్లటానికని వచ్చాడు.

*పబ్లియస్* : సుప్రభాతం, సీజర్!

*సీజర్* : స్వాగతం, పబ్లియస్! ...ఏమిటి? బ్రూటస్, మీరుకూడా ఇంత పెందలకడే బయలుదేరారు. సుప్రభాతం, కాస్కా, కేయస్ లిగారియస్! ఇంతగా సన్నబడేసి జబ్బు నీకెంత శత్రువైంది. సీజర్ నీకెప్పుడూ ఇంతటిశత్రువు కాలేదు. కాల మెంతైంది?

*బ్రూటస్* : ఎనిమిది కొట్టారు.

*సీజర్* : మీరు తీసుకొన్న శ్రమకూ, కృతజ్ఞతకూ నాఅభివాదనాలు.

ఆంటొనీ ప్రవేశిస్తాడు

అటుచూడండి. ఆంటొనీ, రాత్రి ఎంతోపొద్దు పోయేదాకా విలాసాలతో గడిపేవాడుకూడా అప్పుడే మేల్కొనివచ్చేశాడు. ఆంటొనీ, సుప్రభాతం!

ఆంటొనీ : సీజర్ మహాశయా! సుప్రభాతం.

సీజర్ : వారిని అందరిని సిద్ధపడ మని ఆజ్ఞాపించు. మీ అందరికీ ఆలశ్యాన్ని కలిగిస్తున్నందుకు నిందాపాత్రుణ్ణి నేనే. సిన్నా! మెటలస్!! ట్రెబోనియస్ నేను నీతో ఒక అరగంట సేపు మాట్లాడాలి. మరిచిపోకు. ఈనాడే నన్ను పిలిచి మళ్లీ జ్ఞప్తిచెయ్. కాదు, నీవు నాప్రక్కనే ఉండు. ఈవిషయం నాకే జ్ఞప్తికి వస్తుంది.

ట్రెబోనియస్ : అలాగే సీజర్! [స్వగతం] నీఆప్తస్నేహితులు కొంతైనా దూరంగా ఉంటే బాగుంటుం దనుకొనే టంత సన్నిహితంగా ఉంటాను.

సీజర్ : ప్రియమిత్రులారా! లోపలికి రండి. నాతో కలిసి కొంతద్రాక్షాసవాన్ని సేవిద్దురుగాని. తరువాత మనం ఉత్తమ మిత్రుల్లాగా సభాభవనానికి కలిసివెడదాం.

బ్రూటస్ : [స్వగతం] సీజర్! ఒకలా నటించి మరొకలా ఉండటం బ్రూటస్‌ను ఎప్పుడూ బాధపెడుతుంది.

[నిష్క్రమిస్తారు

## మూడో దృశ్యం

సభాభవనందగ్గిర ఒకవీథి. ఒకపత్రాన్ని చదువుతూ ఆర్టిమిడోరస్ ప్రవేశిస్తాడు.

ఆర్టిమిడోరస్ : "సీజర్! బ్రూటస్‌నుగురించి జాగరూకత వహించు. కాషియస్‌ను గమనించు. కాస్కాను దగ్గిరకు

రానీకు. సిన్నామీాద ఒకకన్ను వేసిఉండు. ట్రెబోనియస్‌ను నమ్మకు. మెటల్లస్‌సింబర్‌ను బాగా గుర్తుపెట్టుకో. డెషియస్ బ్రూటస్‌కు నీమీాద అనురాగం లేదు. కెయస్ లిగారియస్‌కు నీవు అపరాధం చేశావు. ఈవ్యక్తులందరిదీ ఒకటే మనస్సు. అది సీజర్‌కు వ్యతిరేకంగాఉంది. 'నేను దివ్యుడను' అని అనుకోకపోతే నిన్నుగురించి ఆలోచించుకో. భద్రభావం ద్రోహానికి దారితీస్తుంది. బలవంతులైన దేవతలు నిన్ను రక్షింతురుగాక! — భవదీయానురాగి, ఆర్టిమిడోరస్ ''

సీజర్ ఇటు వెళ్ళేదాకా ఇక్కడనే నిలిచిఉంటాను. ఈపత్రాన్ని ఒకనివేదనగా అతనిచేతికి అందజేస్తాను. ఈశ్లాఘ్యుడైన శత్రుత్వపుకోరలనుంచి తప్పించుకొని ఉదాత్తగుణం బ్రతకలేక పోతున్న దని నాహృదయం ఎంతో దుఃఖపడుతున్నది. సీజర్! దీన్ని నీవు చదివితే, విధి ద్రోహులతో సహకరించకుండాఉంటే నీవు బ్రతకవచ్చు.

[నిష్క్రమిస్తాడు

# నాలుగో దృశ్యం

బ్రూటస్‌ఇంటిముందు వీథిలో మరోభాగం.

పోర్షియా లూసియస్‌లు ప్రవేశిస్తారు.

పోర్షియా : లూసియస్, కాలహరణం చెయ్యకు? సభాభవనానికి పరుగెత్తుకోవెళ్ళు. నా కేసమాధానాలూ చెప్పనవసరం లేదు వెళ్లు. ఇంకా నిలుచున్నావేం. వెళ్లు.

లూసియస్ : అమ్మా, వెళ్లి నే నేంచెయ్యాలో తెలుసుకుందా మని నిలుచున్నా.

పోర్షియా : నీవు ఏమిచెయ్యాలో చెప్పేలోగానే నీవు

అక్కడికి వెళ్ళి రావా లని నా ఉద్దేశం. [స్వగతం] స్థైర్యమా! నాకు బలాన్ని చేకూర్చు. నా హృదయానికీ మనస్సుకూ మధ్య మహా పర్వతాలను నిలుపు. నాకు పురుషులకు ఉండ వలసిన మనస్సుంది. అయితే నా శక్తి స్త్రీసహజమైంది. రహస్యాన్ని దాచటం స్త్రీల కెంత కష్టం? – ఇంకా నీవు ఇక్కడనే ఉన్నావా!

లూసియస్ : అమ్మా, నే నేం చెయ్యాను? సభాభవ నానికి పరుగెత్తటమేనా? ఇం కేం చెయ్య నవసరం లేదా? మళ్లీ తిరిగిరావటమేనా? ఇం కేం లేదా?

పోర్షియా : ఇంట్లోనుంచి ఏదో వ్యథతో వెళ్లారు! మీ ప్రభువు కుశలంగా కనిపిస్తున్నారో లేదో వార్త తీసుకోరా. సీజర్ ఏంజేస్తున్నాడో, అతడిఆప్తులు అతణ్ణి ఏమిచెయ్యామని ప్రబోధిస్తున్నారో బాగా గమనించిరా ... ఆకోలాహల మేమిటి?

లూసియస్ : కోలాహలమా! నా కేమీ వినిపించ టంలేదు.

పోర్షియా : ఒక జగడం జరుగుతున్నట్లు నా కేదో రొద వినిపిస్తున్నది. సభాభవనం వైపునుంచి వచ్చే గాలి దాన్ని తీసుకో వస్తున్నది. లూసియస్, అదిగో, జాగ్రత్తగా విను.

లూసియస్ : సత్యం తల్లీ! నా కేమీ వినిపించటం లేదు.

శకునజ్ఞుడు ప్రవేశిస్తాడు

పోర్షియా : రావయ్యా! ఎక్కడనుంచి వస్తున్నావు?

శకునజ్ఞుడు : మాఇంటినుంచే నమ్మా!

పోర్షియా : ఇప్పుడు కాల మెంతైంది?

శకునజ్ఞుడు : తొమ్మిదిగంటలు కావస్తున్నది.

పోర్షియా : ఈసమయానికి సీజర్ సభాభవనానికి వెళ్లి ఉంటాడా ?

శకునజ్ఞుడు : అమ్మా! ఇంకా వెళ్ల లేదు; అతడు సభాభవనానికి వెళ్లేసమయంలో అతణ్ణి చూడటంకోసం నేను నిలువబడటానికి వీధిలోకి వెళ్లుతాను.

పోర్షియా : ఆయనకు నివేదించుకో వలసిం దేదో నీకుంది గదూ ?

శకునజ్ఞుడు : అవును తల్లీ ! తనవిషయం జాగ్రత్తపడవలసిం దని నివేదించదలచుకున్నాను. నాప్రార్థన వింటే ఆయనకు ఎంతో క్షేమంజరుగుతుంది.

పోర్షియా : ఏం, అతడిమీద ఉద్దేశింపబడ్డ ఉపద్రవాన్ని గురించి నీ కేమైనా తెలుసునా ?

శకునజ్ఞుడు : స్పష్టంగా నాకు తెలియదు. ఏదైనా జరగవచ్చు నని నాభయం. ... సుప్రభాతం, తల్లీ! ఇక్కడ వీధి చాలా ఇరుగ్గా ఉంది. సీజర్ వెంట పాదచారులై వచ్చే గుంపు, సభాసభ్యులు, చోపుదార్లు సామాన్యజనం బలహీనుణ్ణి నన్ను మరణపర్యంతం నొక్కివేస్తారు. నేను విశాలంగా ఉన్న ఒకప్రదేశానికి చేరి ఘనుడైన సీజర్ వస్తున్నప్పుడు అతనితో మాట్లాడుతాను.

[నిష్క్రమిస్తాడు

పోర్షియా : నేనూ వెళ్ళిపోవాలి. [స్వగతం] అయ్యో! స్త్రీహృదయం ఎంత బలహీన మైంది ? బ్రూటస్ ! సాహస కృత్యంలో నీకు దేవతలు తోడ్పడెదరు కాక ! నిజం, నేను చెప్పింది లూసియస్ వినిపించుకున్నాడు.

బ్రూటస్ చేసే ఒకనివేదన ఉంది; దానికి సీజర్ ఇష్ట పడడు. అయ్యో! నాశరీరం తిరిగిపోతున్నది. లూసియస్! పరుగెత్తుకో వెళ్లి బ్రూటస్‌తో నన్ను గురించి చెప్పు. ఆనం దంలో ఉన్నా నని చెప్పు. నీతో ఆయన ఏమన్నారో తిరిగి వచ్చి నాతో చెప్పు.

[ఒంటరిగా నిష్క్రమిస్తుంది.

# తృతీయాంకం

## ఒకటో దృశ్యం

సభాభవనంముందు సభ్యులు పైన సభజరుపుతుంటారు; సభాభవనానికి వెళ్లే జనసమూహం; వారిలో ఆర్టిమిడోరస్, శకునజ్ఞుడు ఉంటారు; తుత్తారస్వనం వినిపిస్తుంటుంది. సీజర్, బ్రూటస్, కాషియస్, కాస్కా, డెసిషియస్, మెటలస్, ట్రెబోనియస్, సిన్నా, ఆంటొనీ, లెపిడస్, పాపిలియస్, పబ్లియస్ తదితరులూ ఉంటారు.

సీజర్ : మార్చి పదిహేను వచ్చింది.

శకునజ్ఞుడు : ఔను ; ఇంకా గడవలేదు.

అర్టిమిడోరస్ : సీజర్! ఈవినతిపత్రాన్ని చదువు.

డెషియస్ : ట్రెబోనియస్ తనవినతిపత్రాన్ని అమూల్యమైన మీావిశ్రాంతికాలంలో వినిపించమని అర్థిస్తున్నాడు.

అర్టిమిడోరస్ : సీజర్! నాపత్రాన్ని ముందు తిలకించండి. దీనితో సీజర్‌కు మిక్కిలి సన్నిహిత సంబంధం ఉంది తప్పక చదవండి సీజర్!

సీజర్ : నాకు సంబంధం ఉన్నదాన్ని అన్నిటికంటే చివరకు చూడాలి.

ఆర్టిమిడోరస్ : సీజర్! ఆలశ్యం చెయ్యకండి. వెంటనే చదవండి.

సీజర్ : ఏమిటి? ఇతడి కేమైనా వెర్రిఎక్కిందా?

పబ్లియస్ : ఏయ్! ప్రక్కకు తొలుగు.

కాషియస్ : ఈపత్రాలను సమర్పించటానికి మీాకు వీధి దొరికిందా? ఏమాతొందర. సభాభవనానికి రండి.

సీజర్ సభాభవనానికి వెళ్లుతుంటాడు ; అందరూ అనుసరిస్తారు.

పాపిలియస్ : ఇవాళ మీసమస్తోద్యోగాలకూ విజయం చేకూరుగాక!

కాషియస్ : ఏమి ఉద్యోగ మోయ్, పాపిలియస్!

పాపిలియస్ : విజయం చేకూరుగాక!

బ్రూటస్ : అది పాపిలియసేనా? ఏమిటి అంటున్నాడు?

కాషియస్ : ఈనాటి మీఉద్యోగా లన్నిటికీ వియజం చేకూరుగాక అని అంటున్నాడు. మనఉద్దేశం బయటపడి పోయిం దేమో అని నాకు అనుమానంగా ఉంది.

[ సీజర్‌ను అనుసరిస్తాడు.

బ్రూటస్ : గమనించు. అతడు సీజర్ దగ్గిరికి ఎలా వెడుతున్నాడో గమనించు.

కాషియస్ : కాస్కా, హఠాత్తుగా ప్రవర్తించాలి ; మనను కినిపెట్టారేమో నని అనుమానంగా ఉంది. బ్రూటస్ మహాశయా! మనకు కర్తవ్య మేమిటి? ఇది తెలిసిపోయిందా, కాషియస్ సీజరో మళ్లీ తిరిగి వెళ్లరు. నన్ను నేనే చంపుకుంటాను.

బ్రూటస్ : కాషియస్! స్థైర్యం వహించు. పాపిలియస్ లేనా సీజర్‌తో మనఉద్దేశాన్నిగురించి మాట్లాడినట్లు కనిపించటం లేదుకూడా.

కాషియస్ : ట్రెబోనియస్‌కు నిర్ణీతకాలం తెలుసు. చూడు, అతడు సమయానికి మార్క్-ఆంటొనీని అవతలికి తీసికొపోతున్నాడు.

[ ఆంటొనీ, ట్రెబోనియస్‌లు నిష్క్రమిస్తారు.

డెషియస్ : మెటల్లస్ సింబర్ ఏడి? అతణ్ణి వెళ్ళమనండి. సీజర్‌కు వెంటనే అతడి వినతిని సమర్పించమనండి.

బ్రూటస్: అతడు సిద్ధంగానే ఉన్నాడు. దగ్గరకురా. అతడికి సాయం వెళ్లు.

సిన్నా: కాస్కా, నీవు మొదటిపోటు పొడవాలి.

సీజర్: మనమందరం సిద్ధమేనా? సీజర్, అతడిసభాజనం సరిదిద్దవలసిన లోపా లేమిటి?

మెటల్లస్: ఘనకీర్తీ, బలశాలీ, సాహసీ, సీజర్! మెటల్లస్ సింబర్ సవినయంగా మీమహాసనానికి తనహృదయాన్ని నివేదనగాఇచ్చి... [ వంగుతాడు ]

సీజర్: సింబర్, ఈరీతిగా నీవు ప్రణమిల్లటాన్ని నేను అంగీకరించరాదు. ఇలా వినమ్రం కావటంవల్లా, ప్రణామాలర్పించటంవల్లా; ఎవరైనా జనసామాన్యులు, పసిబిడ్డల్లా, తొలిగా తాముచేసుకొన్న నిర్ణయాలను మార్చుకుంటే మార్చుకోవచ్చు. కానీ సీజర్ యెడ ఇటువంటివి నిష్ప్రయోజనాలు. తీయని ఉపోద్ఘాతాలు, వినమ్రప్రణామాలు, గోమాయువినయాలు మొదలైన ఆచారాలు అల్పబుద్ధులను కరిగించి నిర్ణయాలను మార్చుకొనేటట్లు చేయగలుగుతున్నవి గదా అనే ఉద్దేశంతో ప్రయోగిస్తున్నట్లున్నావు? వాటికి లొంగే రక్తం సీజర్ శరీరంలో ఉందని భావించి భ్రమపడకు. దీర్ఘంగా ఆలోచించి నిర్ణయించే మీఅన్నను దేశభ్రష్టుణ్ణి చేశాం. అతడికోసం నీవు ఇలా వంగిప్రణమిల్లుతుంటే నిన్ను నేనడిచే మార్గంలో ఉన్న ఒకగజ్జికుక్కనుగా అసహ్యించుకుంటాను. అంటే సీజర్ తప్పిదం చెయ్యడనీ, తగినకారణం లేకుండా అతడు సంతృప్తిని పొందడనీ తెలుసుకో.

మెటలస్: దేశబహిష్కృతుడైన మాఅన్నమీది అభిశంసనాన్ని రద్దుచేయవలసిందని అర్థించటానికి సీజర్ చెవులకు

నాకంఠంకంటే మధురంగా వినిపించే మరోకంఠం ఈసభలో ఏదీ లేదా?

బ్రూటస్: సీజర్, నీహస్తాన్ని చుంబిస్తున్నాను. ఇది నిన్ను స్తోత్రంచేయటానికి కాదు. పబ్లియస్‌సింబర్ మీాది అభిశంసనాన్ని తక్షణం రద్దుచేసి అతడికి స్వాతంత్ర్యప్రదానం చెయ్యటానికి.

సీజర్ : ఏమంటావు బ్రూటస్!

కాషియస్ : సీజర్! క్షమించు. పబ్లియస్‌సింబర్ స్వేచ్ఛ కోసం కాషియస్ మీాపాదపర్యంతం వినమ్రుడౌతున్నాడు.

సీజర్ : నేను మీారే అయిఉంటే కరిగిపోయి చలించే వాణ్ణి. ఇతరులమనస్సులు కరగటానికి నేను ప్రార్థించేవాణ్ణి ఐఉన్నట్లయితే ఇతరులప్రార్థనలకు నేను కరిగేవాణ్ణి. కానీ నేను ధ్రువతారలా నిశ్చలుణ్ణి. అన్నీ అగ్నిగోళాలే. ప్రకాశ వంతాలే. ఆకాశమంతా ఈఅగ్నిగోళాలతోనే అలంకృతమై తుంటుంది. అయితే, ధ్రువతార సుస్థిరస్థానాన్ని ఆక్రమించ గల సామర్థ్యం వీటిలో దేనికీలేదు. ఇదేరీతిగా ప్రపంచ మంతా మానవులతో నిండిఉంది. వీరు చర్మరక్తోపేతులు, విజ్ఞానవంతులు. అయితే నేం? వీరందరిలో ఎట్టిభయం లేకుండా నిశ్చలంగా తనస్థానాన్ని నిలుపుకుంటున్న ఒక్క వ్యక్తిని నే నెరుగుదును. ఆవ్యక్తిని నేనే. ఈవిషయంలో, సింబర్‌ను బహిష్కృతుని చేయటంలోకూడా, నేను అచం చలుడ నని నన్ను నిరూపించనివ్వండి.

సిన్నా : సీజర్, ప్రభూ...

సీజర్ : మీారు ఇక్కడినుంచి వెళ్ళిపొండి, ఒలింపస్‌పర్వ తాన్ని ఎత్తటానికి యత్నిస్తారు!

డెషియస్ : బ్రూటస్ మహాశయుని ప్రణామం కూడా ప్రయోజనరహితమైపోతుందని మీరు గమనిస్తున్నారా?

కాస్కా : ఇక నానోరు మాటాడదు ; చేతులే పూను కుంటాయి.

సీజరును మొదట కాస్కా, తరువాత ఇతరవిప్రోహ వర్గసభ్యులు మార్కస్ బ్రూటస్ పొడుస్తారు:

సీజర్ : నీవుకూడానా బ్రూటస్! సీజర్, ఇక ఒరిగిపో.

సిన్నా : స్వేచ్ఛ! స్వాతంత్ర్యం!! నిరంకుశత్వం వినాశమైపోయింది. ప్రజలారా! ఇక్కడినుంచి వేగంగా వెళ్లి పొండి. ఈవార్తను వీథివీథులా ప్రకటించండి.

కాస్కా : కొందరు ప్రజావేదికలదగ్గరకు వెళ్ళండి. 'స్వేచ్ఛ లభించింది, సాతంత్ర్యం చేకూరింది, సత్వం లభ్యమైంది' అని కేకపెట్టండి.

బ్రూటస్ : ప్రజలారా! సభాసభ్యులారా!! భయపడకండి. పరిగెత్తిపోకండి. మాఆశ, మాఆశయం, లభించింది.

కాస్కా : బ్రూటస్, మీరు వేదికమీదికి వెళ్ళండి.

డెషియస్ : కాషియస్, నీవుకూడా.

బ్రూటస్ : పబ్లియస్ ! ఏడీ ?

సిన్నా : ఇదుగో, ఇక్కడ ఈవిప్లవానికి విస్తుపోయినిలుచున్నాడు.

మెటల్లస్ : ఇక్కడ సుసంఘటితంగా గుమిగూడి నిలుచుందాం. లేకపోతే సీజర్‌మిత్రు లెవరైనా ... ...

బ్రూటస్ : గుమిగూడి నిలువడాన్ని గురించి చెప్పకు. పబ్లియస్, సంతోషంగా ఉండు. నీశరీరానికి ఏప్రమాదం లేదు. నీకే కాదు; మరేరోమనుపౌరుడికీ ఎట్టిప్రమాదం లేదు

ప్రజల కలా ప్రకటించు.

కాస్కా : మాదగ్గిరనుంచీ వెళ్లిపో పబ్లియస్! లేకపోతే మామీదికి వచ్చే ప్రజ వృద్ధుడవైన నీకుకూడా ప్రమాదాన్ని కల్గించ వచ్చు.

బ్రూటస్ : నిజం. అలా చెయ్యి. మేము చేసిన ఈకృత్యానికి మేముతప్ప ఇతరు లెవ్వరూ బాధనుపొందవద్దు.

(ట్రిబోనియస్ తిరిగి ప్రవేశిస్తాడు.

కాస్కా : ఆంటొనీ ఎక్కడ ?

ట్రిబోనియస్ : ఆశ్చర్యపడి ఇంటికి పారిపోయినాడు. పురుషులు, స్త్రీలు, బాలలు అందరూ దీన్ని ఒకమహాప్రళయ సమయంగా భావించి భయంతో పారిపోతున్నారు.

బ్రూటస్ : విధికన్యల్లారా! మీరు మమ్మల్ని ఏంచేయ దలిచారో మేము ఎరుగదుము. మేమూ మరణించవలసి ఉందని మాకు తెలుసు. ఇంకా ఈభూమిమీద ఎన్నాళ్లు మృత్యువుకోసం వేచిఉండాలె నన్నదే మానవులబాధ.

కాషియస్ : బ్రూటస్! మానవులు ఇంకా జీవించవలసిన కాలాన్నిగురించి ఎందుకు బాధపడాలి. ఒకరి ఇరవై సంవత్సరాలజీవితాన్ని త్రుంచినవ్యక్తి తనమరణభయానికి గల కారణాన్ని కూడా త్రుంచివేయగలడు.

బ్రూటస్ : అయితే మరణమే మానవులకు క్షేమకరమని అంగీకరిస్తున్నా మన్నమాట! అతని మరణభయకాలాన్ని తగ్గించి అతడికి మనం మిత్రులంగా ప్రవర్తించా మన్నమాట! నమ్రులు కండి. ఓరోమనుపౌరులారా! నమ్రులుకండి. మన మందరం మోచేతులదాకా హస్తాలను సీజర్ రక్తంలో ముంచెత్తుదాం. అతనిరక్తంతో మనకత్తులకు మలామా

చేద్దాం. తరువాత 'శాంతి, స్వేచ్ఛ, స్వాతంత్ర్య' మని కేకలు పెడుతూ మనరక్తారుణకౌశేయాలను శిరస్సులపై కెత్తి ఝళిపిస్తూ విపణివరకూ పురోగమిద్దాం.

కాస్కా : అయితే, నమ్రులుకండి. హస్తాలను క్షాళనం చెయ్యండి. భవిష్యద్యుగాలల్లో, ఇంకా పుట్టని రాజ్యాలల్లో, పుట్టని భాషలుగల ప్రజల్లో, ఈనాటిదృశ్యాలను మరిం కెన్నాళ్లకు అభినయిస్తారో!

బ్రూటస్ : ధూళిలో, ప్రణామంచేస్తూ, పాంపే ప్రతిమపాద దేశంలో ఈనాడు చచ్చిపడిఉన్న సీజర్ రక్తం రంగస్థలాల మీాద ఇకముందు రూపకాలల్లో ఎన్నిమార్లు స్రవిస్తుందో!

కాస్కా : అవును. ఎన్నిమార్లు ఈదృశ్యం అభినయింప బడుతుందో అన్నిమార్లు మనబృందాన్ని దేశస్వాతంత్ర్య ప్రదాతలుగా, స్వేచ్ఛాసముద్ధర్తలుగా కీర్తిస్తారు.

డెసియస్ : ముందు మనకర్తవ్య మేమిటి?

కాస్కా: మనం అందరం వెళ్లిపోవాలి. బ్రూటస్ మనకు నాయకుడై మనలను నడిపిస్తాడు. అత్యుత్తమసాహసోపేతా లైన రోమనుపౌరజనహృదయాలతో, అతని అడుగుజాడలను మనం అనుసరించి గౌరవిద్దాం.

ఒకసేవకుని ప్రవేశం.

బ్రూటస్ : నిశ్శబ్దం. ఎవరో వస్తున్నాడు. ఆంటొనీకి మిత్రుడిలా ఉన్నాడు.

సేవకుడు : బ్రూటస్ మహాశయా! ఈరీతిగా మాయజ మాని మీాయెడ వినమ్రభావాన్ని ప్రకటించమని ఆదేశిం చాడు. ఇలా భూస్పర్శగా మీాకు ప్రణమిల్లమన్నాడు. ఇలా నివేదించమన్నాడు.

"బ్రూటస్ ఉదాత్తుడు, విజ్ఞాని, వీరుడు, సత్యసంధుడు. సీజర్ మహాబలశాలి, సాహసోపేతుడు, రాచఠీవిగలవాడు, ప్రియమైనవాడు. అందువల్ల నేను బ్రూటస్‌ను గౌరవిస్తున్నాను, ప్రేమిస్తున్నాను. సీజరంటే నాకు భయముండేదనీ అందువల్ల అతణ్ణి ప్రేమించాననీ, గౌరవించాననీ చెప్పు. భద్రంగా ఆంటొనీ తనవద్దకు రావటానికీ, సీజర్ మృతి శయ్యను చేరటానికీ యోగ్యుడని భావించి అనుజ్ఞనిస్తే, మార్క్ ఆంటొనీ సజీవుడైన బ్రూటస్‌కంటే మృతుడైన సీజర్‌ను అధికంగా ప్రేమించడని చెప్పమనీ నన్నుకోరాడు. ఉదాత్తుడైన బ్రూటస్‌ను అతడి సర్వవ్యవహారాలల్లో, మంచి చెడ్డల్లో, సత్ప్రవర్తనతో ఒక్కడై అనుసరిస్తానని చెప్పమని మాయజమాని మార్క్ ఆంటొనీ చెప్పిపంపాడు.

బ్రూటస్ : మాయజమాని తెలివిగలవాడు; రోమన్ వీరుడు. అతణ్ణిగురించి నాకెప్పుడూ ఎటువంటి దురభిప్రాయం లేదు. ఇక్కడికి రావటం అతడికి అభీష్టమైతే సీజర్‌ను తుద ముట్టించినందుకు తగ్గకారణాలను వినగలడనీ, క్షేమంగా తిరిగి వెళ్లగలడనీ నాగౌరవంమీద ప్రమాణంచేసి చెప్పానని చెప్పు.

సేవకుడు : వెళ్లి వారిని వెంటనే ఇక్కడికి తీసుకోవస్తాను.

[నిష్క్రమిస్తాడు

బ్రూటస్ : అతణ్ణి మిత్రుణ్ణిచేసుకోవటం మనకు అవసరమనీ, క్షేమమనీ నాకు తెలుసు.

కాషియస్ : అదే నాఅభీష్టంకూడాను. కానీ అతడు మనకు మిత్రుడుగా ఉంటాడా అని అనుమానంగా ఉంది. అదీగాక నాఅనుమానాలు సర్వవేళలా సత్యాలౌతున్నవి.

ఆంటొనీ పునః ప్రవేశిస్తాడు

బ్రూటస్ : అదుగో ఆంటొనీ ఇక్కడికి వస్తున్నాడు. ... మార్క్ ఆంటొనీ, నీ కిదే స్వాగతం.

ఆంటొనీ : మహాబలశాలీ, సీజర్! నీ కింతటి పతనం సంభవించిందా? నీజైత్రయాత్రలు, కీర్తిప్రతిష్ఠలు, విజయాలూ సర్వం నిన్ను ఈదుస్థితికి తీసికొచ్చాయా? నీకు వీడ్కోలు.

ఓమహోదాత్తులారా! మీమహాశయాలేమిటో, ఇంకా ఎవరెవరి రక్తం స్రవించాలో నాకు తెలియదు. మీకు అందులో నన్ను ఒకణ్ణిగా భావిస్తే సీజర్ మరణించిన ఈసమయంకంటే మంచిది నా కెక్కడ లభిస్తుంది? ప్రపంచంలో కల్లా మహోదారమైన రక్తాన్ని మైపూత గావించుకొన్న మీశస్త్రాలకంటే నామృతికి మంచి సాధనా లెక్కడ దొరుకుతాయి? నామీద మీ కేమైనా ఉంటే రక్తారుణమైన మీహస్తాలతడి ఆగకముందే మీఆనందాన్ని తీర్చుకోండి. నేను ఇంకా వేయిసంవత్సరాలు జీవించినా మరణించటానికి ఇంతకంటే సుసమయం నాకు కలగదు. సీజర్‌తోపాటు మరణించే అవకాశాన్ని ప్రసాదించగల ఈప్రదేశంకంటే మరో తావు నాకు తృప్తిని కలిగించలేదు. ఈయుగం ఎన్నుకున్న ఉత్తములూ, మహోదారాశయులూ అయిన మీసాధనాలకంటే, సీజర్ మృతికి సాధనాలైన సాధనాలకంటే, మంచివి నా కెప్పుడూ లభించవు.

బ్రూటస్ : ఆంటొనీ! మరణదానం చెయ్యండని మమ్మల్ని అర్థించవద్దు. ప్రస్తుతం మేము నిర్వర్తించిన ఈకృత్యంవల్ల మమ్మల్ని రక్తపిపాసువులనుగా, క్రూరులనుగా ప్రదర్శించే మాహస్తాలు మాత్రమే నీకు కనిపిస్తాయి; కానీ మాహృదయాలు గోచరించవు. అవి కరుణారసపూరితాలు. రోంకు

జరుగుతూ వచ్చిన అపచారవిషయంలో అవి కరుణారసపూరి తాలు. ఒకఅగ్ని మరోఅగ్నిని తరిమివేసినట్లు ఒకకరుణ మరోకరుణను తరిమివేసింది. రోం ప్రజలమీది మాకరుణ సీజర్ మీది కరుణను పారద్రోలింది; సీజర్ యెడ ఈకృత్యాన్ని చేయించింది. నీయెడ మాఖడ్గాలు బండవారినవి. వాటికి అంచులు తప్పినవి. మాశస్త్రిలు నిరంకుశత్వంవిషయంలో ఈర్ష్యాయుతాలు. మాహృదయాలు నీయెడ భ్రాతృప్రేమ వహిస్తున్నవి. నిన్ను ప్రేమతో, గౌరవంతో, సదుద్దేశంతో ఆహ్వానిస్తున్నవి.

కాస్కా: ఉద్యోగప్రదానాలల్లోనూ, పోషణత్వపాలనల్లోనూ మాఅందరితో తుల్యంగా నీమాట చెల్లుబడి ఔతుంది.

బ్రూటస్: ఇక్కడ గుమిగూడిన జనానికి భయాన్ని పోగొట్టి ప్రశాంతిని కల్పించేటంతవరకూ కొంచెం ఓపికపట్టు. నీకు కారణాలను వినిపిస్తాము. సీజర్ యెడ అంతటి ప్రేమగల నేనుగూడా ఎందు కతడియెడ ఇలా ప్రవర్తించానో తెలియజెపుతాను.

ఆంటొనీ: మీవిజ్ఞానాతిశయంమీద నా కెన్నడూ సంశయం లేదు. మీలో ప్రతిఒక్కరూ రక్తాప్లావితమైన హస్తాలను నా కందివ్వండి. కరచాలనం చేస్తాను. మొదట మార్కస్ బ్రూటస్, తరువాత కేయస్ కాషియస్, పిమ్మట డెసి.యస్ బ్రూటస్, మెటల్లస్, సిన్నా, వీరాధివీరుడవైన నాకాస్కా! ఇప్పుడు నీహస్తాన్ని అందించు. తుదిదైనా అనురాగంలో ప్రథమమైన నీహస్త మేది ట్రెబోనియస్! — మీరందరూ ఉదాత్తవ్యక్తులు.

అయ్యో! మీతో నే నేమి సంభాషించాలో నాకు

తెలియటం లేదు. నాకీర్తికి నిలువనీడ తప్పింది. సీజర్‌ను పరిత్యజిస్తున్నందుకు మీరు నన్ను భీరువు నన్నైనా భావిస్తారు, లేదా స్తోత్రపాఠకుడినని ఐనా అనుకుంటారు. రెండురీతులా చెడుగానే తలపోస్తారు.

సీజర్! నిన్ను నేను సత్యంగా ప్రేమించాను. ఇప్పుడు మమ్మల్ని చూస్తే, నీకళేబరముండే, నీఆంటొనీ, నీశత్రువుల రక్తహస్తాలతో కరచాలనం చెయ్యటం చూస్తే, నీఅంతరాత్మ మరణసమయంలో పొందిన వేదనకంటే, ఓమహోదారా!, అధికవ్యథ పొందకుండా ఉండగలుగుతుందా? నీశరీరంమీద పడ్డ పోట్లన్ని కన్నులు నాకుంటే, నీగాయాలు రక్తాన్ని చిమ్మినట్లు అవి కన్నీరు కారుస్తుంటే నీశత్రువులతో మైత్రికంటే నా కటువంటిస్థితే ఎంతో ఆనందదాయకమైంది కదా!

జూలియస్! నన్ను క్షమించు. ఓవీరమృగమా! నిన్ను ఇక్కడివా రందరూ చుట్టుముట్టారు; ఇక్కడ నీవు భూమిమీది కొరిగావు. నిన్ను వేటాడినవారు ఇక్కడే నీమీద పొందిన విజయచిహ్నమైన నీఅరుణారుణరక్తకాంతితో నిలిచి ఉన్నారు. ఓప్రపంచమా! నీ వనే అరణ్యంలో సీజర్ మహామృగం అతిస్వేచ్ఛగా సంచరించింది. ఈమృగమే సర్వప్రపంచానికీ హృదయమై వర్తించింది. ఓసీజర్, ఒకహరిణంలా, అనేకమంది రాజకుమారులు ఏకకాలంలో వేటాడిదెబ్బలు కొట్టిన హరిణంలా, ఇక్కడ పడిఉన్నావా?

కాషియస్ : మార్క్ ఆంటొనీ!

ఆంటొనీ : కేయస్ కాషియస్ నన్ను క్షమించు. ఈస్థితిలో సీజర్ పరమశత్రువులుకూడా ఈమాత్రం పలకకుండా ఊరు

కోలేరు; ఇక మిత్రుడనైన నావిషయంలో ఇది ఎంత?

కాషియస్ : నీవు సీజర్‌ను స్తుతిస్తున్నందుకు నిన్ను నే నేమీ అనటంలేదు. అయితే నీవు మాతో ఎట్టిసంబంధాన్ని పెట్టుకుందామని అనుకుంటున్నావో తెలుసుకుందా మని. నిన్ను మామిత్రుల్లో ఒకణ్ణిగా లెక్కించుకోమన్నావా? లేక నీజోక్యం పెట్టుకోక మా ఇష్టంవచ్చినట్లు వ్యవహరించ మన్నావా?

అంటొనీ : ఆజోక్యం కోసమేగదా మీతో మైత్రినాశించి కరచాలనం చేసింది. కానీ దృష్టి సీజర్‌మీద నిలిచినప్పుడు నేను విషయంసర్వం మరిచిపోయినాను. నేను మీఅందరితో మైత్రినే అర్థిస్తున్నాను; అంతేకాదు మీయెడ అనురాగం వహిస్తున్నాను. ఏరీతిగా, ఏకారణంగా సీజర్ అపాయకారి అని మీరు భావించారో నాకు నిరూపిస్తా రని ఆశిస్తున్నాను.

బ్రూటస్ : కారణాలుచెప్పి మేము నిన్ను తృప్తిపరచ లేకపోతే చేసిం దొక కిరాతకకృత్య మౌతుంది. మాకార ణాలు ఎంతో బలవత్తరమైనవి. నీవే సీజర్‌కు పుత్రుడవై ఉన్నా వాటిని విన్నప్పుడు అవి నిన్ను తృప్తిపరచగలవనే మా నమ్మకం.

అంటొనీ : నాకు కావలసిందికూడా అదే; మరేమీ మిమ్మల్ని కోరబోను. అంతేకాదు. సీజర్‌కళేబరాన్ని విపణి ప్రదేశానికి తీసికోవెళ్లి సభావేదికమీద నిల్చి మిత్రుడికి యోగ్యమైన రీతిగా ఉపన్యసించేటందుకు నా కనుజ్ఞ ఇవ్వ వలసిందని మిమ్మల్ని అర్థిస్తున్నాను.

బ్రూటస్ : ఆంటొనీ!, అందుకు మేము అంగీకరిస్తున్నాం.

కాషియస్ : బ్రూటస్! ఒక్కమాట! [ అపవారితం ] ఏం

చేస్తున్నారో మీ కర్థం కావటంలేదు. సీజర్ అంత్యక్రియల సందర్భంలో ఆంటొనీ ఉపన్యసించటానికి అంగీకరించకండి. అతడి ప్రసంగం వింటే జనం ఎంతగా చలించిపోతారో మీకు తెలుసునా?

బ్రూటస్ : క్షమించు. ముందుగా నేను వేది కెక్కి—సీజర్‌ను మన మెందుకు తుదముట్టించామో తెలియజేస్తాను. మాఅంగీకారంతోటే ఆంటొనీ ప్రసంగిస్తున్నాడనీ, మాఅందరికీ సీజర్ అంత్యక్రియోత్సవాలు సక్రమంగా సాగిపోవటం సంతోషకరమైన విషయమనీ ప్రజలకు ప్రకటిస్తాను. ఇందువల్ల మనసదుద్దేశాలు వారికి అర్థమైపోతాయి. మన కెంతో ప్రయోజనం చేకూరుతుంది.

కాషియస్ : ఈపనివల్ల ఏంజరగనున్నదో నా కేమీ బోధపడటం లేదు; కానీ ఇది నాకుఅణుమాత్రం మనస్కరించటం లేదు.

బ్రూటస్ : మార్క్ ఆంటొనీ! ఇదిగో, సీజర్ మృతకళేబరం. విపణిప్రదేశానికి తీసుకోపో. నీఉపన్యాసంలో మామీద దోషారోపణలు చేయరాదు సుమా! సీజర్‌ను గురించి ఎంతైనా మంచి చెప్పు. —అంతే కాదు, మాఅనుజ్ఞతో మాట్లాడుతున్నా నని ప్రజకు ప్రకటించు. లేకపోతే అతడి అంత్యక్రియోత్సవాలల్లో నీకు ఎట్టి స్థానం ఉండదు. నేను మాట్లాడిన వేదికమీదనే, నాప్రసంగం ముగిసినతరువాత నే నీవు మాట్లాడవలసిఉంటుంది.

ఆంటొని : అలాగే కానివ్వండి. అంతకంటే నా కేమీ అనవసరం లేనుకూడాను.

[illegible] : అయితే సీజర్ శరీరాన్ని అంత్యక్రియోత్సవా

లకు అనుగుణంగా అలంకరించు. మమ్మల్ని అనుసరించు.

[ఆంటొనీతప్ప తక్కినవారందరూ నిష్క్రమిస్తారు

ఆంటొనీ : క్షమించు. రక్తస్రవంతివైన ఓ సీజర్ మృతశరీరమా ! నన్ను క్షమించు. ఈ కరుకుకసాయివారియెడ పిరికివై మెత్తబడ్డాను; క్షమించు. కాలపు ఆటుపోటుల్లో జీవించిన సమస్తమానవకోటిలో ప్రథమోదాత్తుని శిథిలరూపానివి నీవు. నీ అమూల్యరక్తాన్ని ఇలా చిందించిన ఆహస్తాలకు వినాశం కలుగుగాక ! నీగాయాలు మూగనోళ్లతో నాకంఠాన్ని విప్పి మాట్లాడమని నన్ను ప్రార్థిస్తున్నవి. ఈ క్షతసంచయం సాక్షిగా మానవజాతిజీవితాల కొక మహాశాపం సంభవింపబోతున్నదని నేను జోస్యం చెప్తున్నాను. ఇటలీదేశసర్వసీమలనూ అంతర్యుద్ధచ్ఛాయ లాచ్ఛాదితం చేస్తాయి. రక్తపాతం, వినాశం కలుగుతుంది. మహాదారుణకృత్యాలు సర్వసామాన్యాలై పోతాయి. యుద్ధహస్తాలల్లో బిడ్డలు చిక్కుబడి, మరణించటం మొదలైన క్రూరచేష్టలు నిత్యోత్పన్నాలు కావటం వల్ల తల్లులకు వికటాట్టహాసం తప్పని దౌతుంది. ప్రతీకారవాంఛతో సీజర్ అంతరాత్మ నరకంనుంచీ విచ్చేసే ఏతీ అనే ప్రతీకారదేవత తోడురాగా సర్వసీమల్లో స్వేచ్ఛాసంచారం చేస్తుంది. 'సర్వనాశన' మని క్షాత్రోన్మత్తకంఠంతో వికృతనినాదాలు వెళ్లబోస్తుంది. అంత్యక్రియలకోసం ఆక్రోశించే మృతకళేబరాల ఆర్తనాదాలతో సమస్తధరిత్రీమండలం మీద 'సీజర్ హత్య' అనే ఈ నీచకృత్యం వాసిస్తుంది.

సేవకుడు ప్రవేశిస్తాడు

నీవు ఆక్టేవియస్ సీజర్ సేవకుడివి కదూ ?

సేవకుడు : అవును. మార్క్ ఆంటొనీ!

ఆంటొనీ : అతణ్ణి రోంకు రావలసిందని సీజర్ ఉత్తరం వ్రాశాడు కదూ?

సేవకుడు : అవును. అది చేరింది. ఆయన వస్తున్నాడు. ఆయన నోటిమాటగా మీతో చెప్పమన్నాడు. [సీజర్ కళేబరాన్ని చూస్తూ] అయ్యో! సీజర్ మహాశయా!

ఆంటొనీ : నీహృదయం అతివిశాలమైందిగా కనిపిస్తున్నది. అవతలికి వెళ్ళి సీజర్ కోసం దుఃఖించు. దుఃఖం అంటువ్యాధి వంటిది. నీకన్నులనుచూచి నాకన్నులుకూడా నీరుకారుస్తున్నవి. మీప్రభువు రోముకు వస్తున్నాడా?

సేవకుడు : నాగ ఈరాత్రి రోంనగరానికి ఏడుమైళ్ల దూరంలో ఉంటాడు.

ఆంటొనీ : అతివేగంగా వెళ్లిపో. ఇక్కడ ఏం జరిగిందో చెప్పు. రోం దుఃఖసముద్రంలో మునిగి ఉంది. మహాప్రమాదకారిగా ఉంది. ఆక్టేవియస్ ప్రవేశించటానికి ఇంకా రోం ప్రమాదరహితం కాదని అతడికి నివేదించు. వెళ్లు.

కానీ, కొంచెమాగు; నేను ఈమృతశరీరాన్ని విపణి ప్రదేశానికి తీసికోవెళ్ళేదాకా నీవు వెళ్ళవద్దు. అక్కడ నేను నాగంభీరోపన్యాసమూలంగా రక్తపిపాసువులైన వీరు చేసిన చేష్టను ప్రజ ఏరీతిగా స్వీకరిస్తారో ప్రయత్నించి చూస్తాను. అది చూచి అనుగుణంగా నీవు యువకుడైన ఆక్టేవియస్‌తో మాట్లాడవచ్చు. ఈకళేబరాన్ని అక్కడికి చేర్చటానికి నాకు తోడ్పడు.

[సీజర్ శవంతో నిష్క్రమిస్తారు

# రెండో దృశ్యం

విపణిప్రవేశం. బ్రూటస్, కాషియస్‌లు జనసమూహం ప్రవేశిస్తారు.

*నగరనివాసులు*: మమ్మల్ని తృప్తిపరచాలి; తృప్తిపర చండి.

*బ్రూటస్*: మిత్రులారా! నన్ను అనుసరించండి. నా ప్రసంగం వినండి. కాషియస్, నీవు మరోవీథికి వెళ్లు. జన సమూహాన్ని గుంపులుచేరకుండా పంపివెయ్యి. నన్ను వినదల చినవారు ఇక్కడ ఉండండి. కాషియస్ వెంట వెళ్లదలచిన వారు వెళ్లిపొండి. సీజర్ వధకు కారణాలను బహిరంగం చేస్తాము.

*ప్రథమపౌరుడు*: నేను బ్రూటస్ ప్రసంగాన్ని వింటాను.

*ద్వితీయపౌరుడు*: నేను కాషియస్ ప్రసంగాన్ని వింటాను.

కాషియస్ కొందరుపౌరులతో నిష్క్రమిస్తాడు. బ్రూటస్ వేదిమీకదికి వెళ్లుతాడు.

*తృతీయపౌరుడు*: మహోదారుడు బ్రూటస్ వేదికమీదికి వచ్చాడు. నిశ్శబ్దం.

*బ్రూటస్*: తుదివరకూ ప్రశాంతంగా ఉండండి. రోం నగరనివాసులారా! దేశీయులారా!! ప్రియులారా!!! నేను వినిపించవలసిన కారణాలకోసం నా ప్రసంగాన్ని నిశ్శబ్దంగా వినండి. నామీద మీకున్న గౌరవాన్ని నిల్పివినండి. మీరు విశ్వసించటంకోసం నాగౌరవాన్ని గౌరవించండి. విజ్ఞానంతో నా ప్రసంగాన్ని పరిశీలించండి. ఉత్తమరీతిని అవగతం చేసుకోటానికి మీజ్ఞానశక్తిని మేల్కొల్పండి. ఈసభాసదుల్లో సీజర్‌కు మిత్రుడెవరైనా ఉంటే అతడికి నే చెప్పేమాట లివి: "సీజర్ మీద నీకున్న ప్రేమకంటే అతడిమీద నాకున్న ప్రేమ

అణుమాత్రం తీసిపోదు.” అయితే ఆమిత్రుడు నీవు సీజర్‌కు ఎందుకు వ్యతిరేకంగా తిరిగా వని ప్రశ్నిస్తే అతడికి నా సమాధాన మిది. ‘నేను వ్యతిరేకంగా తిరిగింది అతడిమీద తక్కువ ప్రేమ ఉండటంవల్ల కాదు; రోంమీద అంతకంటే అధికమైన ప్రేమ ఉండటంవల్ల’. సీజర్ సజీవుడై ఉండి మీరంతా బానిసలుగా మరణించా లని కోరుకుంటున్నారా? సీజర్ ఒకడే మరణించి మీరంతా స్వతంత్రులై జీవించాలె నని కోరుకుంటున్నారా? సీజర్ నన్ను ప్రేమించాడు; కనుక అతడికోసం నేను దుఃఖిస్తాను. అతడు అదృష్టవంతుడైనాడు ; నేను ఆనందిస్తాను. అతడు వీరగుణోపేతుడు; కనుక గౌరవిస్తాను. అతడు ఆశాపరుడైనాడు ; కనుక అంత మొందించాను. అతడి ప్రేమకు కన్నీరు, అదృష్టానికి ఆనందం, వీరగుణానికి గౌరవం, ఆశాపరతకు మృత్యువు — అన్నీ నాలో ఉన్నాయి. బానిసగా జీవించదలచిన నీచు డిక్కడ ఎవడైనా ఉన్నాడా? ఉంటే రావచ్చు. మాటాడవచ్చు. అతణ్ణి నేను అవమానించి ఆహ్వానిస్తున్నాను. స్వతంత్రరోంనివాసిగా ఉండదలచుకోని మందబుద్ధి మీలో ఎవరైనా ఉన్నాడా? ఉంటే, రావచ్చు. మాటాడవచ్చు. అతణ్ణి నేను అవమానించి ఆహ్వానిస్తున్నాను. మాతృదేశాన్ని మన్నించి ప్రేమించని ఆటవికు డెవడైనా మీలో ఉన్నాడా? ఉంటే అతడు రావచ్చు. మాటాడవచ్చు. అతణ్ణి పరాభవించి నే నాహ్వానిస్తున్నాను. —సమాధానంకోసం క్షణకాలం వేచిఉంటాను.

అందరు : ఎవరూ లేరు, బ్రూటస్, ఎవరూ లేరు.

బ్రూటస్ : అయితే నేను ఎవర్నీ, అవమానించలే దన్నమాట ! అత్యాశాపరుడ నైనప్పుడు నన్ను మీరందరూ

ఏం చేస్తారో అంతకు మించి సీజర్‌ను నే నేం చెయ్యలే దన్న మాట! ఎట్టిపరిస్థితుల్లో అతడికి మరణాన్ని కల్పించామో ఆవిషయమంతా సభాభవనంలో గ్రంథస్థం చేసేఉంచాం. సీజర్‌కీర్తి ప్రతిష్ఠలను అణుమాత్రమైనా తగ్గించలేదు. మర ణాన్ని తెచ్చిపెట్టిన అతడిదోషాలను విశేషంగా ఉటంకించనూ లేదు.

సీజర్‌మృతకళేబరంతో ఆంటొనీ ఇతరులూ ప్రవేశిస్తారు

అదిగో, సీజర్, మృతకళేబరం వస్తున్నది. వెంట ఆంటొనీ దుఃఖిస్తూ వస్తున్నాడు. అతడికి సీజర్‌వధతో ఎట్టి సంబంధం లేకపోయినా అతడు మనగణతంత్రరాజ్యంలో ఉచితపాత్ర వహిస్తాడు. ఆరాజ్యంలో మీలో ఉచితపాత్ర వహించనివా రెవరు గనక? రోంసంక్షేమంకోసం నన్ను అత్యధికంగా ప్రేమించేవ్యక్తిని వధించాను. దేశంకోరుకుంటే నామరణం కోసంకూడా ఉపయోగించటానికి అదే ఆయు ధాన్ని దాచిఉంచుతాను.

*బ్రూటస్*: బహుకాలం జీవించు బ్రూటస్, బహుకాలం జీవించు.

*ప్రథమపౌరుడు*: విజయోత్సవాలతో బ్రూటస్‌ను అతడి ఇంటివరకూ అనుసరిద్దాం.

*ద్వితీయపౌరుడు*: అతడివంశీయులవరుసలో బ్రూటస్‌కు ఒకప్రతిమను నిలుపుదాం.

*తృతీయపౌరుడు*: అతణ్ణే సీజర్‌ను చేద్దాం.

*చతుర్థపౌరుడు*: సీజర్‌కుండవలసిన గుణాలన్నీ బ్రూటస్‌ను వరించాయి.

*ప్రథమపౌరుడు*: కరతాళధ్వనులతో, హర్షనాదాలతో,

అతడిఇంటిదాకా మనం బ్రూటస్‌ను అనుసరిద్దాం.

బ్రూటస్ : స్వదేశీయులారా! ...

ద్వితీయపౌరుడు : ప్రశాంతి. నిశ్శబ్దం. బ్రూటస్ ప్రసంగిస్తున్నాడు.

ప్రథమపౌరుడు : నిశ్శబ్దం! నిశ్శబ్దం!!

బ్రూటస్ : గుణవంతులైన దేశీయులారా! నన్ను ఒంటరిగా ఇంటికి వెళ్ళనివ్వండి. మీరు నన్ను అనుసరించనవసరం లేదు. మాఅనుజ్ఞపొంది ఆంటొనీప్రసంగిస్తున్నాడు. నాకోసం మీరుఅందరూ అతడిప్రసంగాన్ని వినండి. సీజర్ మృతకళేబరాన్ని గౌరవించండి. నేనొకణ్ణి తప్ప ఆంటొనీ తన ఉపన్యాసాన్ని ముగించేటంతవరకూ ఎవరూ వెళ్లిపోకండి. మిమ్మల్ని నేను ప్రార్థిస్తున్నాను.

ప్రథమపౌరుడు : సోదరులారా! ఆగండి, మార్క్-ఆంటొనీ ప్రసంగాన్ని విందాం.

తృతీయపౌరుడు : అతడు వేదికను అలంకరించుగాక! మహాశయా, ఆంటొనీ! ప్రజాసనాన్ని స్వీకరించు.

ఆంటొని : బ్రూటస్ మహాశయునికోసం నేను ప్రసంగించవలసి వచ్చింది.

[వేదికమీదికి వెళ్ళుతాడు.

చతుర్థపౌరుడు : బ్రూటస్‌నుగురించి ఏమిటో అంటున్నాడు.

తృతీయపౌరుడు : బ్రూటస్‌కోసం తాను ప్రసంగం చేయవలసి వచ్చిందంటున్నాడు.

చతుర్థపౌరుడు : అతడు బ్రూటస్‌కు వ్యతిరేకంగా ఏమీ మాట్లాడకుండా ఉంటే ఎంతో మంచిది.

ప్రథమపౌరుడు : ఈసీజర్ నిరంకుశుడు.

తృతీయపౌరుడు : రోంకు ఇతనిపీడ వదలిపోవటం మన అదృష్టం.

ద్వితీయపౌరుడు : నిశ్శబ్దం. ఆంటొనీ ఏంచెప్తాడో విందాం.

ఆంటొనీ : మహాశయులారా! రోంపౌరులారా !!

పౌరులు : నిశ్శబ్దం. మనం అతణ్ణి విందాం.

ఆంటొనీ : మిత్రులారా! రోంపౌరులారా!! దేశీయులారా !!! ఇంచుక కర్ణదానం చెయ్యండి. మీ శ్రవస్సులకు శ్రమకలిగిస్తున్నాను. నేను సీజర్ అంత్యక్రియలను జరపటానికి వచ్చాను; ఆయన్ను కీర్తించటానికి రాలేదు. మానవులు చేసే చెడుగులు వారితో అంతరించవు. అవి తదనంతరం కూడా జీవిస్తాయి. కానీ వారినుంచి మరణంతోనే గతిస్తుంది. సీజర్ విషయంలోకూడా ఇంతే కాగాక! సీజర్ ఆశాపరుడని మహాశయుడు బ్రూటస్ మీకు వెల్లడించాడు. అది నిజమైతే నిజంగా బాధాకరమైన దోషమే! అంతేకాదు, సీజర్ అందుకు బాధాకరమైన ప్రతిఫలాన్ని అనుభవించాడు.

బ్రూటస్, ఆయనఅనుచరులైన ఇతరుల అనుజ్ఞతోటే నేను సీజర్ అంత్యక్రియల్లో ప్రసంగించటానికి వచ్చాను.

బ్రూటస్ గౌరవనీయుడు, ఆయన అనుచరులైన ఇతరులందరూ గౌరవనీయులు. సీజర్ నానెచ్చెలి. విశ్వాసపాత్రుడు. అయినా బ్రూటస్ ఆయన్ను ఆశాపరుడంటున్నాడు; బ్రూటస్ గౌరవనీయుడు. సీజర్ ఎందరినో బందీలనుగా రోంనగరానికి కొనివచ్చాడు. వారిప్రాణపరిహారద్రవ్యాన్నంతటినీ ప్రజాకోశానికి జమకట్టి దాన్ని నింపివేశాడు. ఇది

సీజర్ ఆశాపరత్వమా? దరిద్రులు దుఃఖిస్తే సీజర్ దుఃఖించాడు. ఆశాపరత్వం ఇంతకంటే దారుణమైంది కదా? అయితే నేం బ్రూటస్ ఆయన్ను ఆశాపరు డంటున్నాడు. బ్రూటస్ గౌరవనీయుడు. లూపర్కల్ ఉత్సవాలల్లో ముమ్మారు నేను ఆయనకు రాజకిరీటా న్నర్పిస్తే ఆయన ముమ్మారు తిరస్కరించటం మీరు కళ్లారా చూచారు? ఇది ఆశాపరత్వానికి లక్షణమేనా? అయితే నేం? బ్రూటస్ ఆయన్ను ఆశాపరు డంటున్నాడు; బ్రూటస్ గౌరవనీయుడు. బ్రూటస్ మాట్లాడింది కాదని నిరూపించటానికి నేను ఇక్కడికి రాలేదు; నా కేం తెలుసునో చెప్పటానికిమాత్రమే వచ్చాను. మీరంతా ఒకప్పుడు సీజర్ను మనసిచ్చి ప్రేమించారు. కారణం లేకుండా ప్రేమించారా? నేడు మీరు ఆయన మరణానికి దుఃఖించటంలేదు. ఇలా మిమ్మల్ని అరికట్టిన ఆ ప్రబలమైన కారణ మే మై ఉంటుంది. నిర్ణయమా! నీ వీనాడు వన్య మృగాలను ఆశ్రయించావా? మానవులు తమవిచక్షణాజ్ఞానాన్ని కోల్పోయారా? కాసేపు నా ప్రసంగాన్ని సహించండి. నాహృదయం అదిగో, అక్కడ, ఆశవ పేటికలో సీజర్తో బాటు నిలిచిపోయింది.

ప్రథమపౌరుడు: అతడు చెప్పేదాంట్లో ఏదో కొంత నిమిత్త మున్నట్లు నాకు గోచరిస్తున్నది.

ద్వితీయపౌరుడు: విషయాన్ని నీవు ఉచితరీతిని పరిశీలిస్తే సీజర్లో ఏదో దొడ్డదోషం ఉన్నట్లు అవగతమౌతుంది.

తృతీయపౌరుడు: అలాగా! అంతకంటే దుష్టుడైన నిరంకుశుడు అతడిస్థానాన్ని ఆక్రమిస్తాడేమో నని నాకు భయమేస్తున్నది.

చతుర్థపౌరుడు: "అతడు కిరీటాన్ని తిరస్కరించాడు" అన్న ఆంటొనీమాటను గమనించావా? సీజర్ ఆశాపరుడు కాడనటానికి ఇది నిదర్శనం.

ప్రథమపౌరుడు: సీజర్ ఆశాపరుడు కాదన్న అంశం నిరూపితమైతే హంతకులు తమఅకృత్యానికి తగ్గ అపరాధాన్ని చెల్లించి తీరవలసిందే.

ద్వితీయపౌరుడు: పాపం! ఏడ్చి ఏడ్చి ఆంటొనీకన్నులు ఎంత ఎర్రబడిపోయాయి!

తృతీయపౌరుడు: ఆంటొనీని మించిన మహోదాత్తుడు రోంలోనే లేడు.

చతుర్థపౌరుడు: అడుగో! అతడు మళ్ళీ ప్రసంగాన్ని ప్రారంభించాడు.

ఆంటొనీ: కానీ, నిన్నటివరకూ ప్రపంచమంతా ఒకటైనా సీజర్‌మాట నిల్వగలిగింది. ఈనాడో అతిదీనంగా అతడు తన్ను గౌరవించేవారైనా లేకుండా ఇక్కడ పడి ఉన్నాడు. నేను మీహృదయాలల్లో, మనస్సుల్లో విప్లవాన్ని, క్రోధాన్ని రెకెత్తే ఉద్దేశం కలవాణ్ణి కాదు. ఐతే బ్రూటస్‌యెడ ద్రోహం చేసినవాణ్ణౌతాను; కాషియస్ యెడ ద్రోహం చేసినవాణ్ణౌతాను. వారు ఇరువురూ గౌరవనీయులు — మీరందరూ ఎరుగుదురు. నేను వారికి ద్రోహం చెయ్యను. అది నా కిష్టంలేదు. అంతకంటే నేను మరణించిన సీజర్‌కు ద్రోహంచెయ్యటానికీ, నాకు ద్రోహం చేసుకోటానికీ, మీకు ద్రోహంచెయ్యటానికీ ఇష్టపడతాను. ఇదిగో! ఇది సీజర్‌ముద్రాంకితమైన అజచర్మలేఖనం. ఆయన అంతర్గృహంలో దొరికింది. ఇది ఆయన ఇచ్ఛాపత్రం! క్షమిం

చండి. కానీ దీన్ని నేను చదవబోవటం లేదు. ఇందులోని విశేషాలు మీరంతా వింటే వెంటనే వెళ్ళి సీజర్ క్షతాలంకృతమైన మృతకళేబరాన్ని ముద్దెట్టుకుంటారు. ఆయన పవిత్ర రక్తంలో మీహస్తవసనాలను ముంచెత్తుకుంటారు. అంతే కాదు, అతని ఒక కేశఖండాన్ని జ్ఞాపకార్థ మర్థిస్తారు. మరణ సమయంలో వ్రాసిఇచ్చే శాసనపత్రాలల్లో మీమీ సంతానానికి ఇచ్చిపోతూ ఉన్న అమూల్యవారసత్వంగా దీన్ని తరువాత మీరు పేర్కొంటారు.

*చతుర్థపౌరుడు* : మార్క్ ఆంటొనీ, మే మాపత్రాన్ని వినాలి. చదువు.

*అందరూ* : ఇచ్ఛాపత్రం! మేము దాన్ని విని తీరాలి.

*ఆంటొనీ* : ప్రియసోదరులారా! శాంతివహించండి. దాన్ని నేను చదవకూడదు. సీజర్ మిమ్మల్ని ఎంతగాఢంగా ప్రేమించాడో తెలుసుకోటం సమంజసం కాదు. మీరేమీ దారుమూర్తులుగానీ, శిలాఖండాలుకాని కాదు; మానవులు! మానవులు కావటంవల్ల సీజర్ ఇచ్ఛాపత్రాన్ని వింటే ఉద్రేకపూరితు లౌతారు. అది మిమ్మల్ని ఉన్మత్తులను చేస్తుంది. మీరు ఆయనకు వారసులు కారని తెలుసుకోకుండా ఉండటమే మీ కెంతో క్షేమాన్ని చేకూరుస్తుంది. ఎందువల్ల నంటారా? విన్నా రనుకోండి. అయ్యో! దాని వల్ల ఫలితమేమిటి?

*చతుర్థపౌరుడు* : ఇచ్ఛాపత్రాన్ని చదువు ఆంటొనీ, అది మేము వినదలిచాం. సీజర్ ఇచ్ఛాపత్రాన్ని చదివితీరాలి.

*ఆంటొని* : మీరు ప్రశాంతచిత్తంతో ప్రవర్తిస్తారా? మరికొంత సేపు శాంతివహిస్తారా? మీతో ఈపత్రప్రస్తావన

తెచ్చి నేను చాలా హద్దుమీరాను. ఎవరిఛురికలు సీజర్‌ను పొడిచాయో, ఆగౌరవనీయులయెడ అపచారం చేస్తున్నానని నా కెంతో భయం వేస్తున్నది. ఇదే నాభయం.

చతుర్థపౌరుడు : వారు గౌరవనీయులా? ద్రోహులు.

అందరు : సీజర్ ఇచ్ఛాపత్రం! ఆయన మరణశాసనం!!

ద్వితీయపౌరుడు : వారు ద్రోహులు, హంతకులు. ఇచ్ఛాపత్ర మేది? చదువు.

ఆంటొనీ : మీరు న న్నీఇచ్ఛాపత్రాన్ని చదివితీరా లని నిర్బంధిస్తున్నారా? అయితే మీరంతా చక్రాకృతిగా సీజర్ కళేబరంచుట్టూ చేరండి. ఈఇచ్ఛాపత్రాన్ని వ్రాసిన మహో దాత్తుణ్ణి మీకు చూపించటానికి నాకు అవకాశాన్నికల్పిం చండి. నేను దిగిరానా? మీరు నాకు అనుజ్ఞ నిస్తున్నారా?

అందరు : దిగిరా.

ద్వితీయపౌరుడు : దిగిరా.

తృతీయపౌరుడు : మాకందరికీ ఇది అంగీకారమే.

చతుర్థపౌరుడు : మనమందరం చక్రాకృతిగా నిలుద్దాము.

ప్రథమపౌరుడు : శవపేటికకూ, కళేబరానికీ కొంతదూ రంగా నిలవండి.

ద్వితీయపౌరుడు : మహాశయుడు ఆంటొనీకి దారి ఇవ్వండి.

ఆంటొనీ : మీరు నా కింత సన్నిహితంగా రావద్దు; కొంతదూరంగా ఉండండి.

ద్వితీయపౌరుడు: కొంత వెనక్కు సర్దుకోండి. స్థలం చేయండి. వెనక్కు జరగాలి.

ఆంటొనీ : మీకు కన్నీ రుందా ? ఉంటే కార్చటానికి సిద్ధపడండి. ఈమహోత్తరీయం మీకు చిరపరిచిత మైందే.

తొలుతగా సీజర్ దీన్ని ఎప్పుడు ధరించాడో నాకు బాగా జ్ఞాపకం. నెర్వ్యిలమీద విజయాన్ని చేకొన్నరోజున, తనశిబిరంలో ఒకనాటి గీష్మకాలసాయంసమయాన ఆయన దీన్ని ధరించాడు. చూడండి. కాషియస్ఛురిక దూసుకోపోయింది ఇక్కడే. ఈర్ష్యాపరుడైన కాస్కా ఎంతటిఘాతను కల్పించాడో చూడండి. దీనిద్వారానే అతిప్రియుడైన బ్రూటస్ పొడిచింది. బ్రూటస్ తనఛురికను బయటికి లాగగానే ఇంత కరుణారహితంగా పొడిచింది బ్రూటస్ ఔనో కాదో తెలుసుకుందామని హఠాత్తుగా తలుపులు తెరుచుకొని వచ్చినట్లు చిమ్మింది సీజర్ రక్తం. ఎందువల్లనంటే మీఅందరికీ తెలుసు; సీజర్‌కు బ్రూటస్ ద్వితీయరూపమేగదా! ఓ దేవతలారా! నిర్ణయించండి. ఇదే అన్నింటిలోకి అతికరుణావిహీనమైన ఘాత. మహోదాత్తుడు సీజర్ బ్రూటస్ తన్ను పొడవటం చూచాడు.

కృతఘ్నత ద్రోహుల బాహుదండాలకంటే బలవత్తరంగా కన్పించి తన్ను లోగొంటంవల్ల ఆయనహృదయం బ్రద్దలైపోయింది. తనరక్తంతో ప్లావితమై తడిసిఉన్న పాంపే ప్రతిమకు అది పాదదేశం అయినప్పటికీ మహత్తరుడు సీజర్ ఒరిగిపడిపోయాడు. ఈపతనంతో నేనూ, మీరూ ఇంకా ఇతరులుఅందరూ పతనమైనారు. రక్తారుణమైన రాజద్రోహం మనమీద విజయం చేకొన్నది.

అయ్యో! మీరు ఇప్పుడు దుఃఖిస్తున్నారు. మీరందరూ కరుణారసప్రభావానికి లొంగిపోతున్నారా? మీకన్నీరు ఎంత పవిత్రమైంది? ఓకరుణారసపూరితహృదయుల్లారా! ఏమిటి? సీజర్ ఉత్తరీయానికి తగిలిన గాయాలను చూచినంత

మాత్రానికే ఇంతగా దుఃఖిస్తున్నారా? చూడండి, హంత కులు పిండలిచేసిన ఆయన్నే చూడండి.

[ఉత్తరీయాన్ని తొలగిస్తాడు

ప్రథమపౌరుడు : ఎంత కరుణాన్వితదృశ్య మిది?

ద్వితీయపౌరుడు : మహోదారా! సీజర్ మహాశయా !!

తృతీయపౌరుడు : ఎంత దారుణమైన దిన మిది?

చతుర్థపౌరుడు : ఓ రాజద్రోహులారా! ఓకుటిలహంతకు లారా!!

ప్రథమపౌరుడు : అతిక్రూరదృశ్యం!

ద్వితీయపౌరుడు : ప్రతీకారం జరిగి తీరవలసిందే.

అందరు : ప్రతీకారం! వెతకండి!! వెన్నాడండి!! చంపడి!! హతమార్చండి!! ఈహంతకులను, ద్రోహులను బ్రతకనివ్వరాదు.

ప్రథమపౌరుడు : శాంతి వహించండి. మహోదాత్తుడు ఆంటొనీ ఏమో అంటున్నాడు. వినండి.

ద్వితీయపౌరుడు : అతడు చెప్పేది విందాం; అతణ్ణి అనుస రిద్దాం. అతడితో బాటు అవసరమైతే మరణిద్దాం.

ఆంటొనీ : ఉత్తమమిత్రులారా! ప్రియస్నేహితులారా!! నన్ను ఇంతటి విప్లవవాహినిని మేల్కొల్పినవాణ్ణిగా చేయ వద్దు. ఉద్రేకపడవద్దు.

ఈకృత్యాన్ని చేసినవారందరూ గౌరవనీయులు. ఈపనినిచేయటానికి వ్యక్తిగతాలైన వ్యథలు వారి కేము న్నవో నాకు తెలియదు. వారు విజ్ఞానులు : అంతే కాదు; గౌరవనీయులు. వారు మనకు తగినసమాధానాలు చెప్పగల రనే నానమ్మకం.

మిత్రులారా! నేను మీహృదయాలను దోచుకోపోవటానికి రాలేదు. బ్రూటస్ మహాశయునివలె నేనేమీ వక్తను కాదు. స్నేహితుణ్ణి గాఢంగా ప్రేమించిన కుటిలవర్తనలేని సూటైన మొరటువాణ్ణి. నాకు బుద్ధిబలం లేదు; మాటలు రావు. విలువలేనివాణ్ణి; కార్యాచరణ శూన్యుణ్ణి. చెప్పలేను. ప్రజారక్తాన్ని ఉద్రేకెత్తించగల ప్రసంగప్రావీణ్యం నాకు లేదు. ఇదంతా వారికి తెలుసు. అందువల్లనే సీజర్‌ను గురించి ప్రసంగించటానికి వారు నాకనుజ్ఞ నిచ్చారు. నేను సూటిగామాత్రమే మాట్లాడగలను. మీకు తెలిసిన విశేషమే; అయినా చెపుతున్నాను. మీతో నాబదులుగా మాట్లాడమని మధురహృదయుడూ, ప్రియుడూ అయిన సీజర్ మహాశయుని మూగనోళ్లయిన గాయాలను చూపిస్తున్నాను. కానీ, నేనే బ్రూటస్నై బ్రూటసే ఆంటొనీ అయితే ఆ ఆంటొనీ సీజర్ ప్రతిగాయానికీ ప్రాణంపోసి ఒకనాలుకిచ్చి పలికించి రోంలోని శిలాఖండాల నన్నింటికీ చైతన్యాన్ని కల్పించి తిరుగుబాటు చేయింపగలిగి ఉండేవాడు.

అందరు : ఇప్పుడు మేమూ విప్లవంచేస్తాం.

ప్రథమపౌరుడు : బ్రూటస్‌గృహాన్ని దగ్ధంచేస్తాం.

తృతీయపౌరుడు : అయితే, పదండి! ద్రోహులను వెదకండి.

ఆంటొనీ : అయినా, నామాట వినండి. నన్ను మాట్లాడనివ్వండి.

అందరు : శాంతించండి. ఆంటొనీప్రసంగం వినండి. అత్యుదాత్తుడు ఆంటొనీని వినండి.

ఆంటొనీ : మిత్రులారా! మీరంతా విషయం ఏమిటో తెలుసుకోకుండా ఏమో చేయటానికి వెళ్తున్నారు. సీజర్

మీకు ప్రేమపాత్రుడు ఎందుకైనాడో తెలుసుకున్నారా? అయ్యో! మీ కది తెలియదు. ఏ మైతేనేం! మీకు నేను దాన్ని తెలియజేస్తాను. మీరు మీఉద్రేకంలో నేను చెప్పిన ఇచ్ఛాపత్రాన్నిగురించి మరచిపోయినారు.

అందరు: సత్యం. ఏది ఆఇచ్ఛాపత్రం. మేమందరం ఆగివింటాం.

ఆంటొనీ: ఇదిగో, సీజర్ ముద్రాంకితమైన ఆయన ఇచ్ఛాపత్రం. ప్రతిఒక్కరోంపౌరుడికీ ఆయన కొంత ఇచ్చివెళ్ళాడు. వ్యక్తిగతంగా ప్రతిపౌరుడికీ ఆయన డెబ్బదిఐదు డ్రాక్మాల ధన మిచ్చాడు.

ద్వితీయపౌరుడు: అత్యుదాత్తా! సీజర్ మహాశయా!! మే మాయనఘోరమరణానికి తగ్గప్రతీకారాన్ని పొందితీరుతాం.

తృతీయపౌరుడు: రాచఠీవిగల సీజర్ మహాశయా!

ఆంటొనీ: ప్రశాంతచిత్తంతో వినండి.

అందరు: నిశ్శబ్దం! నిశ్శబ్దం!!

ఆంటొనీ: ఆయన తనస్థలాల నన్నిటినీ, తనఏకాంతప్రదేశాల నన్నిటినీ, టైబర్ నదిఆవలిఒడ్డున క్రొత్తగా నాటించు కొన్న వనాల నన్నిటినీ మీకోసం, మీభవిష్యత్సంతతివారికోసం సమిష్టివిహారభూములుగా ఇచ్చిపోయాడు. అలా మహాదానం చేసిన సీజర్ ఇడుగో! ఇటువంటి సీజర్ మళ్లీ ఎప్పుడు జన్మిస్తాడు; ఎప్పుడు వస్తాడు?

ప్రథమపౌరుడు: ఎన్నడూ రాడు, రాడు. రండి! పదండి. ఆయనశరీరానికి ఒకపవిత్రస్థలంలో దహనసంస్కారాన్ని కల్పించి ఆకొరువులతో ద్రోహులగృహాలను దహించివేద్దాం. పదండి. సీజర్ కళేబరాన్ని ఎత్తుకోండి.

ద్వితీయపౌరుడు : వెళ్లు. అగ్నిని తీసుకోరా !

తృతీయపౌరుడు: ఈఆసనాల నన్నింటినీ గుంజివెయ్యండి.

చతుర్థపౌరుడు: ఆసనాలను, వాతాయనాలను, ఏది చిక్కితే దాన్ని గుంజివెయ్యండి.

[ పౌరులు సీజర్‌కళేబరంతో నిష్క్రమిస్తారు.

ఆంటొనీ : ఈఉద్రేకం ఇక వ్యవహరించుగాక! ద్వేషమా! నీవు పయనమారంభించావు. స్వేచ్ఛానుసారంగా విహరించు.

ఒకసేవకుడు ప్రవేశిస్తాడు

ఇదంతా చూస్తున్నావుగదా ! ఎలా ఉంది ? నీఅభిప్రాయ మేమిటోయ్ ?

సేవకుడు : బాబూ ! ఆక్టేవియస్‌ప్రభువు రోంనగరానికి వచ్చేశారు.

ఆంటొనీ : అత డెక్కడున్నాడు ?

సేవకుడు : లెపిడస్‌సీజర్ ఇంట్లో.

ఆంటొనీ : అయితే నేను వెంటనే ఆతణ్ణి కలుసుకోవాలి. సరిగా అతడు నేను కోరుకొంటున్న సమయానికే వచ్చాడు. అదృష్టదేవత మహానందంతో నర్తిస్తున్నది. ఇప్పుడు మనం ఏమికోరుకుంటే దాన్ని ఇచ్చితీరుతుంది.

సేవకుడు : బాబూ ! బ్రూటస్, కాషియస్‌లు ఇరువురూ ఉన్మత్తవేగంతో రోంనగరంనుంచీ వెళ్ళిపోతున్నా రని చెప్పుకుంటుంటే విన్నాను.

ఆంటొనీ : బహుశః నేను ఏవిధంగా ప్రజలను ఉద్రేకపరిచానో వారు ముందుగా తెలుసుకొని ఉంటారు. నన్ను ఆక్టేవియస్ దగ్గిరికి తీసుకోపో.

# మూడో దృశ్యం

ఒకవీధి. సిన్నాకవి ప్రవేశిస్తాడు

సిన్నా : సీజర్‌తో బాటు విందులో పాల్గొంటున్నట్లు రాత్రి నాకొక కలవచ్చింది. రాబొయ్యే ఆపదలనుగురించి నామనస్సు కళవళపడుతున్నది. వీథుల్లో తిరగాలె నని నాకు ఆసక్తి లేదు; కాని ఏదో నన్ను ఇలా నడిపిస్తున్నది.

ప్రథమపౌరుడు : నీ పేరేమిటి ?

ద్వితీయపౌరుడు: నీవు ఎక్కడికి వెళ్ళుతున్నావు ?

తృతీయపౌరుడు : నీనివాసం ఎక్కడ ?

చతుర్థపౌరుడు : నీవు వివాహితుడ వౌనా ? కాదా ?

ద్వితీయపౌరుడు : అందరిప్రశ్నలకు సూటిగా సమాధానం చెప్పు.

ప్రథమపౌరుడు : ఔను. సంక్షేపంగా చెప్పు.

చతుర్థపౌరుడు : యోచించి విజ్ఞానయుతంగా చెప్పు.

తృతీయపౌరుడు : సత్యం చెప్తున్నాం; నిజంచెపితే నీకే క్షేమం.

సిన్నా : నాపేరేమిటా? నేను ఎక్కడికి వెళ్లుతున్నానా? ఎక్కడ నివసిస్తున్నానా? వివాహితుడను ఔనా కాదా? ప్రతిఒక్కదానికీ సూటిగా, సంక్షిప్తంగా, జ్ఞానయుతంగా, సత్యంగా సమాధానాలు చెప్పాలా? —జ్ఞానినై చెప్తున్నాను; నేను వివాహితుడను కాను.

ద్వితీయపౌరుడు : అంటే వివాహం చేసుకున్నవాళ్లు బుద్ధిహీనులని నీభావ మన్నమాట! ఇలా అయితే నీవు నాచేతిలో దెబ్బలుతింటావు. సూటిగా సమాధానం చెప్పు.

సిన్నా : సూటిసమాధానం కావాలా? నేను సీజర్ అంత్య క్రియలదగ్గిరికి వెళ్ళుతున్నాను.

ప్రథమపౌరుడు : మిత్రుడివిగానా? శత్రుడివిగానా?

సిన్నా : మిత్రుడిగానే!

ద్వితీయపౌరుడు : ఈవిషయంలో సూటిగా సమాధానం చెప్పాడు.

చతుర్థపౌరుడు : మరి నీనివాసం. సూటిగా చెప్పు.

సిన్నా : సూటిగానా — సభాభవనం ప్రక్కనే.

తృతీయపౌరుడు : సత్యంచెప్పు, నీపేరు?

సిన్నా : సత్యంగా నాపేరు సిన్నా.

ప్రథమపౌరుడు : ఇతణ్ణి ముక్కలక్రింద చీల్చివేయండి. ఇతడు ఒకహంతకుడు.

సిన్నా : నేను సిన్నాకవిని; సిన్నాకవిని.

చతుర్థపౌరుడు : చెడ్డకవిత్వం చెప్పినందుకు అతణ్ణి చీల్చి వేయండి. ముక్కలక్రింద చీల్చివేయండి.

సిన్నా : నేను ద్రోహినైన సిన్నాను కాను.

చతుర్థపౌరుడు : అయితేనేం. అతడిపేరు సిన్నా. అతడి గుండెలోనుంచి ఆపేరును లాగివేయండి. ఆతనువాత వెళ్లిపో నివ్వండి.

తృతీయపౌరుడు : చీల్చండి, చీల్చండి. రెండి, నిప్పుకాగడాలు. బ్రూటస్ఇంటికి పొండి. కాషియస్ఇంటికి పొండి. సర్వం దగ్ధంచేద్దాం. కొందరం డెషియస్ఇంటికి వెడదాం. కొందరం కాస్కాఇంటికీ, కొందరం లిగారియస్ఇంటికీ పోదాం. పదండి! వెళ్లండి!!

[ అందరు నిష్క్రమిస్తారు

# చతుర్థాంకం

## ఒకటో దృశ్యం

రోములో ఒకగృహం. ఆంటొనీ, అక్టేవియస్, లెపిడస్‌లు
ఒకబల్లముందుకూర్చొని ఉంటారు.

ఆంటొనీ : వీరందరూ మరణించి తీరాలి. మరణంకోసం వీరిపేర్లను గుర్తుపెట్టండి.

అక్టేవియస్ : మీఅన్నకూడా మరణించాలి; అంగీకరించావా లెపిడస్.

లెపిడస్ : ఆఁ. అంగీకరిస్తున్నాను.

అక్టేవియస్ : ఆంటొనీ. అతణ్ణికూడా గుర్తుపెట్టు.

లెపిడస్ : ఆంటొనీ మీమేనల్లుడు పబ్లియస్ సజీవుడుగా ఉండరాదనే షరతుమీద నేను ఇందుకు అంగీకరిస్తున్నాను.

ఆంటొనీ : అవును. అతడు సజీవుడై ఉండరాదు. ఇదిగో చూడు. ఒక్క చుక్కతో నేనే వాణ్ణి నాశనం చేస్తున్నాను. అయితే, లెపిడస్ నీవు సీజర్ ప్రాసాదానికి వెళ్ళు. ఆయన ఇచ్ఛాపత్రాన్ని ఇక్కడికి తీసుకోరా. మనం అందులోని వారసత్వాలల్లో ఒకభాగాన్ని ఎలా రద్దుచేయటమో ఆలోచిద్దాం.

లెపిడస్ : మీరు ఇక్కడనే ఉంటారా మరి?

ఆంటొనీ : ఇక్కడగానీ, సభాభవనంముందుగానీ ఉంటాం.

[ లెపిడస్ నిష్క్రమిస్తాడు

ఇతడు ఎంతో అయోగ్యుడు. ఇటువంటిపనులకు మాత్రమే పంపదగ్గవాడు, ప్రపంచాన్ని మూడుభాగాలుగా

పంచుకొనేటప్పుడు ఇతడు అందులోఒకభాగానికి అర్హుడౌ తాడా ?

అక్టేవియస్ : అలా భావించింది నీవే కదా! ద్రోహులను నిర్ణయించే టప్పుడు పట్టికలో ఆతడుకోరిన వ్యక్తులనుకూడా చేర్చి ఆయోగ్యతను కల్పించింది నీవే.

ఆంటొనీ : ఆక్టేవియస్! లోకంలో నేను నీకంటే ఎక్కువ కాలం జీవించాను. ఎక్కువఅనుభవాన్ని సంపాదించాను. మనఅపకీర్తిభారాన్ని తగ్గించుకోటంకోసం ఇతడి కీగౌర వాన్ని కల్పించినా గాడిద బంగారాన్ని మోసేసందర్భంలో లాగా ఇతడికి దానిభారంవల్ల గింజుకోటం, చెమటపట్టటం తప్ప ఏమీ చెందకుండా ఉండాలి. ఆభారవహనా నైనా మనం చెప్పినట్లు చెయ్యవలసిందే.

అక్టేవియస్ : నీఇష్టానుసారంగా జరిగించు; కానీ అతడు కాకలు తేరినవాడు; వీరయోధుడు.

ఆంటొనీ : నాఅశ్వంకూడా అటువంటిదే. అది నాకు చేసే సేవకు నేను దానికి తగినంతగా ఆహారమిస్తాను. పోరాడ టం. గాలిలో విహరించటం, ఆగటం, సూటిగా పరిగెత్తటం అన్నీ నేను నేర్పుతాను. దానిసర్వావయవసంచలనాన్నీ నాఇచ్ఛ పాలిస్తుంది. కొంతవరకు లెపిడస్‌కూడా ఇంతే. అతడు ఇట్టి జంతువుమాత్రమే. నాఅధికారంలోనే ఉంటు న్నాడు. మందబుద్ధి! సర్వం బోధించి, శిక్షఇచ్చి ఇలా నడుచుకోమని ఎవరోఒకరు ఆజ్ఞాపించవలసిందే. అత డెప్పుడూ ఇతరులు త్రొక్కివిడిచిన పాతపుంతలు పట్టుకొని పయనిస్తుంటాడు; ఇతరులను అనుకరించేవాడేగాని స్వతంత్ర శక్తికలవాడు కాడు. ఇతణ్ణిగురించి ఒకసాధనంగా మాత్రమే

భావించి వ్యవహరించు.

ఆక్టేవియస్! కొన్ని మహత్తరవిషయా లున్నవి. అవి విను. బ్రూటస్ కాషియస్‌లు సైన్యాలమీద అధికారం వహిస్తున్నారు. మనం వెంటనే వారిని ఎదుర్కొనుపోవాలి. ఇందుకోసం మనం ఒకబంధుబృందంగా ఏర్పడాలి. మన మిత్రు లెవరో వారి నందరినీ సమకట్టాలి. సాధనసామగ్రులను సంతనచెయ్యాలి. రహస్యతంత్రాలను తెలుసుకోటానికీ, బహిరంగంగా ఎదుర్కొనున్న అపాయాలకు ఎదురునిల్చి సమాధానాలు చెప్పటానికీ మనం వెంటనే ఒకపరిషత్తును ఏర్పాటుచెయ్యాలి.

ఆక్టేవియస్ : తప్పకుండా వెంటనే ఏర్పాటుచేయిద్దాం. ఇప్పుడు మనం శత్రువులమధ్య కట్టుకొయ్యలకు బంధింపబడి వేట కుక్కలుచుట్టూ నిలువగా ఉన్న ఎలుగుబంట్లలా ఉన్నాం. మనముందు మందహాసంచేసే కొంతమందిహృద యాలల్లో కోటానకోటి కుతంత్రా లున్నవని నాకు అనుమా నంగాకూడా ఉంది.

## రెండో దృశ్యం

బ్రూటస్ శిబిరంముందు, భేరీధ్వనులు వినిపిస్తుంటాయి. బ్రూటస్, లుసిలియస్, లుసిల్లస్ ఇతరసైనికులు ప్రవేశిస్తారు. టిటినియస్, పిండా రస్‌లు వారిని కలుసుకుంటారు.

బ్రూటస్ : ఆగండి.

లుసిలియస్ : సైన్యాలకు ఆజ్ఞను అందజేయండి; ఆగండి.

బ్రూటస్ : కాషియస్ వచ్చేశాడా ఏమిటి?

లుసిలియస్ : చాలాదగ్గరకు వచ్చేశాడు. తమయజమా

నికి ప్రత్యామ్నాయంగా మీకు ప్రణతులర్పించటానికి పిండా రస్ వచ్చాడు.

బ్రూటస్ : అతడు వచ్చి క్రమరీతిని ప్రణతు లర్పించ వచ్చు. — పిండారస్ ! తనలో కలిగిన మార్పువల్లనో, కొందరు దుష్టోద్యోగుల ప్రేరణవల్లనో కొన్ని అకృత్యాలు చేసి బాధకలిగించాడు. అయినా, అతడు దగ్గరఉంటే తగ్గ సంజాయిషీ తీసుకుండేవాణ్ణి.

పిండారస్ : ఉదాత్తుడైన మాయజమాని స్వతస్సిద్ధమైన ఆయనసుగుణానికి అనుగుణంగానే మహోద్దేశాలు పెట్టుకొని ప్రవర్తించినట్లే కనిపిస్తున్నారు.

బ్రూటస్ : ఆవిషయంలో అతనియెడ ఎవరికీ సంశయం లేదు. లుసిలియస్! అతడు నన్ను ఎలా ఆహ్వానించాడో నివేదించు.

లుసిలియస్ : తగిన కృతజ్ఞతాగౌరవాలతో ఆహ్వానించాడు గాని పూర్వం ఆయన చూపించే అతిపరిచయాన్ని గానీ, మిత్రభావాన్నిగానీ ప్రదర్శించలేదు.

బ్రూటస్ : ఈనీవర్ణననుబట్టి అనురాగపూర్వకమైన మైత్రి అతడిలో చల్లారిపోతున్నట్లు అర్థమౌతున్నది. లుసిలియస్! గమనించు. ఎప్పుడైతే ప్రేమ చల్లారిపోవటం ప్రారంభిస్తుందో అప్పుడు అది కృత్రిమరూపాన్ని ధరిస్తుంది. స్వచ్ఛమైన మైత్రికి అటువంటి కృత్రిమత్వం అనేది ఉండనేఉండదు. చేయివేసి ఉంచినంతవరకూ తమప్రతిభావిశేషాలను ప్రకటించుకోటంకోసం అశ్వాల్లా అత్యుత్సాహాన్ని ప్రకటిస్తారు. పరీక్షకు నిలవవలసినప్పుడు బోర ముంగిల పారేసి మొండి తట్టులా క్రుంగిపోతారు. — కాషియస్ సైన్యంతోటే

వస్తున్నాడా?

లుసిలియస్ : ఈరాత్రికి సార్డిస్‌లో బసచేద్దామన్నాడు. ఆశ్వికసైన్యంలో అధికాశం ఆయన వెంటనే ఉన్నది.

[ నేపథ్యంలో ఆశ్వికసైన్యం వస్తున్న ధ్వనులు

బ్రూటస్ : ఇస్. అతడు వచ్చేశాడు. అతడికోసం ప్రశాంతంగా ఎదురువెళ్ళదాం.

కాషియస్ అతనిసైనికులూ ప్రవేశిస్తారు

కాషియస్ : ఓహో సైనికులారా ! నిలవండి, ఆగిపొండి.

బ్రూటస్ : ఓహో సైనికులారా ! నిలవండి, ఆగిపొండి. ఆగిపొమ్మనే ఆజ్ఞను సైన్యాల కందజెయ్ !

ప్రథమసైనికుడు : ఆగిపొండి !

ద్వితీయసైనికుడు : ఆగిపొండి !

తృతీయసైనికుడు : ఆగిపొండి !

కాషియస్ : బావగారూ ! మీరు నాకు అపచారం చేశారు.

బ్రూటస్ : దేవతలారా ! ఈఅభియోగాన్ని మీరు విచారించండి. నాశత్రువులకైనా అపచారంచేయలేనే? అట్టిస్థితిలో నాబావమరదివైన నీకు నేనెలా అపచారం చేయగలుగుతాను.

కాషియస్ : మీరు చేసిన చెడ్డపనులకు మీప్రశాంత ప్రవర్తన మంచిముసుగుగా ఉంది. వాటిని మీరు చేసేటప్పుడు ...

బ్రూటస్ : కాషియస్ ! ఉద్రేకాన్నిపొందకు. నీ కేవైనా బాధలుంటే ప్రశాంతచిత్తంతో తెలియజెయ్. నిన్ను నేను బాగా ఎరుగుదును. గాఢంగా మనలను ప్రేమించే మనఉభయ

సైన్యాలముందు మనం వివాద పడవద్దు. నీసైన్యాలను పంపించివెయ్యి. తరువాత నీబాధలేమిటో చెప్పు; నేను వింటాను.

కాషియస్ : పిండారస్! మనసేనానాయకులను సైన్యాలను ఈప్రదేశానికి కొంతదూరంగా నిలుపమని ఆజ్ఞాపించు.

బ్రూటస్ : లూషియస్, మనసైన్యాలనుగూడా అలాగే దూరంగా నిలుపు. మాఇరువురిసంభాషణా పూర్తి అయ్యే దాకా నాశిబిరంలోకి ఎవరినీ ప్రవేశపెట్టవద్దు. ద్వారంవద్ద లుసిల్లియస్, టిటినియస్‌లను కాపలాఉంచు.

# మూడో దృశ్యం

బ్రూటస్‌గుడారంలో. బ్రూటస్, కాషియస్‌లు ప్రవేశిస్తారు.

కాషియస్ : సార్డియన్లవద్ద లంచాలు తీసుకొన్నాడని లూసియస్ పెల్లాను దోషిగా భావించి, విచారించి, శిక్షచెప్పి మీరు నాయెడ ద్రోహం చేశారు. అతడు గౌరవనీయుడని నాకు తెలియటంవల్ల అతణ్ణి వదలిపెట్టవలసిందని ఎన్నో మార్లు మిమ్మల్ని లేఖలమూలంగా ప్రార్థించాను.

బ్రూటస్ : ఈవిషయంలో లేఖలువ్రాసి నీకు నీవే ద్రోహం చేసుకున్నావు.

కాషియస్ : ప్రతిస్వల్పవిషయాన్ని ఇలా దోషంగా నిరూపించటానికి ఇది తగ్గసమయం కాదు.

బ్రూటస్ : ఈలంచగొండితనం అనేదోషం నీలోకూడా ఉందని నేను విస్పష్టంగా చెప్పకతప్పదు. బంగారానికి ఆశపడి నీవు మంచిఉద్యోగాల నన్నిటినీ అయోగ్యులైనవారికి అమ్మావు.

కాషియస్: ఏమిటి? నాలో లంచగొండితన ముందా? ఈమాట్లాడేది బ్రూటస్ అని తెలుసుకుంటే మీరు ఇలా పలికేవారు కారు.

బ్రూటస్: కాషియస్ పేరు లంచగొండితనంతో సంబంధం పెట్టుకొని దానికి గౌరవాన్ని ఆపాదిస్తున్నది. అందువల్ల శిక్షాకాంత సిగ్గుతో తలవంచుకోవలసివచ్చింది.

కాషియస్: ఏమిటి? శిక్షించటాన్ని గురించి ఆలోచిస్తున్నారా?

బ్రూటస్: ఔను. మార్చినెల జ్ఞప్తికి తెచ్చుకో. మార్చి పదిహేనును జ్ఞప్తికి తెచ్చుకో. ఘనుడైన జూలియస్ ఆనాడు న్యాయంకోసమేగదా తనరక్తాన్ని స్రవింపజేసుకొన్నది. న్యాయంకోసంకాక క్రౌర్యంతో అతణ్ణి పొడిచిన ద్రోహి ఆనాడు ఒక్కడైనా ఉన్నాడా? ప్రపంచంలోకల్లా ప్రథమగణ్యుడైన ఆవ్యక్తిని హతమార్చింది బందిపోటుదొంగలకు సాయపడటం కోసమేనా? మన అనంతగౌరవాన్ని పణంచేసి మనహస్తాలను లంచగొండితనంతో మలినంచేసుకోటానికేనా? ఆపనిచేసింది. ఇందుకే ఐతే నేను అట్టి ఒకరోమును పౌరునిమీద పడటంకంటే శ్వానాన్నై జన్మించి చంద్రుణ్ణి చూచి మొరుగుతూ ఉండేవాణ్ణి.

కాషియస్: బ్రూటస్, నన్ను ఒత్తిడిచెయ్యవద్దు; ఇది నేను సహించను. ఎలా నేను వ్యవహరించాలో ఆదేశిస్తూ నీవు నేనెవరోన్న మరిచిపోతున్నావు. నేను బహుకాలానుభవం ఉన్న సైనికుణ్ణి. ఏర్పాట్లు చేయటంలో నీకంటే సమర్థుణ్ణి.

బ్రూటస్: కాషియస్, ఇక చాలు. అంతటితో ఆపు. ఈవిషయంలో నీవు సమర్థుడివి కావు.

కాషియస్ : నేను సమర్థుణ్ణి!

బ్రూటస్ : సమర్థుడివి కావని నా అభిప్రాయం.

కాషియస్ : ఇక ఉద్రేకపరచవద్దు. నన్ను నేను మరిచి పోవచ్చు. నీ శరీరవిషయం శ్రద్ధతీసుకో. నన్ను ఇక విశేషంగా కదిలించకు.

బ్రూటస్ : అల్పుడా! ఇక వెళ్ళిపో.

కాషియస్ : అది ఎలా సాధ్యపడుతుంది?

బ్రూటస్ : అయితే విను. నీ ఉద్రేకాలకు నేను లొంగి పోవలసిందేనా? ఒక ఉన్మాదుడు ఉరిమిచూస్తే బెదరిపోవల సిందేనా?

కాషియస్ : దేవతలారా! ఇదంతా నేను సహించితీర వలసిందేనా?

బ్రూటస్ : ఇంతేనా? ఇంకా సహించవలసిఉంటుంది. మహాగర్వంతో కన్నులుగానని నీహృదయం బద్దలయ్యే టంతవరకూ కోపాన్ని వెళ్ళగక్కు. నీకెంతటి కోపశక్తి తీవ్రత ఉందో నీ బానిసలకు చూపించు. వారిని గజగజలాడించు. నేను నీకోపతాపాలను కనిపెట్టి నడుచుకోవాలా? నీకోపేచ్ఛను సారంగా నేను వంగిలేవాలా? దేవతలు సాక్షిగా చెప్తు తున్నాను. ఎంతటి కష్టమైనా సరే; నీప్లీహంలోని విషాన్ని జీర్ణించుకో! ఈనాటినుంచీ నీవు కోపం తెచ్చుకున్నప్పుడు నా కుత్సాహాన్ని కల్పించటానికి అలా పరిహాసకుడిలా నటించి నవ్విస్తున్నావని భావిస్తాను.

కాషియస్ : అయితే వ్యవహారం ఇంతదాకా వచ్చిందన్న మాట!

బ్రూటస్ : నేను నీకంటే గొప్పయోధుణ్ణన్నావు; నిరూ

పించు. నీ ప్రగల్భాలు సత్యాలని నిరూపించు. అప్పుడు నేను సంతోషిస్తాను. నావిషయం చెపుతున్నాను, విను; నాకంటే ఉదాత్తుడైన వ్యక్తి దగ్గిరనుంచీ నేర్చుకోటానికి నేనెప్పుడూ సంసిద్ధమే.

కాషియస్ నన్ను అవమానిస్తున్నావు బ్రూటస్! నీవు నన్ను సర్వరీతులా అవమానిస్తున్నావు. నేను నీకంటే వృద్ధసైనికుడ నన్నాను; గొప్పసైనికుడ నని అనలేదు. అన్నానా?

బ్రూటస్ : నీవు అన్నా నే నేమీ లక్ష్యం చెయ్యను.

కాషియస్ : సీజర్ సజీవుడై ఉన్ననాళ్లల్లో ఆయనకూడా నా కెప్పుడూ ఇంతగా కోపాన్ని తెప్పించటానికి సాహసించ లేదు.

బ్రూటస్ : ఆగు. నీవు ఆయనకు కోపం తెప్పించటానికి సాహసించి ఉండవు.

కాషియస్ : నేను సాహసించి ఉండేవాణ్ణి కానా?

బ్రూటస్ : కావు.

కాషియస్ : ఏమిటీ? నేను సాహసించిఉండేవాణ్ణి కానా?

బ్రూటస్ : నీకు జీవితంమీద తీపి ఉండటంవల్ల సాహసించి ఉండేవాడివి కావు.

కాషియస్ : బ్రూటస్! నీయెడ నాకున్న ప్రేమమీద ఎక్కువ ఆశపెట్టుకోకు. తరువాత చింతపడవలసి వచ్చే కృత్యాన్ని దేన్నైనా నేను చెయ్యవచ్చు.

బ్రూటస్ : చింతపడదగ్గపనిని పూర్వమే చేశావు. నేను అతిభద్రమైన సత్యకవచాన్ని ధరించాను. కాషియస్, నీబెదరింపులకు నే నేమీ చెదరను. అవి నాచాలాలైన వాయుఫుల్లా నాముందుగా వెళ్ళిపోతాయి. చెడ్డమార్గాలల్లో చేకూ

ష్ఛకో లేనందువల్ల నేను కొంతధనంకోసం నీదగ్గిరికి పంపిం చాను. ఇవ్వటానికి నీవు తిరస్కరించావు. కష్టజీవులైన కర్ష కులవద్దనుంచీ దుష్టమార్గాలల్లో ధనాన్ని సంపాదించే దాని కంటే నాహృదయాన్ని రక్తమాంసాలను నాప్రాణాలక్రిందికి మారుస్తాను. నాసైన్యాలకు భృత్యాలివ్వటానికి ధనంకోసం నీదగ్గిరికి పంపించాను; నీవు నిరాకరించావు. ఈపనిని కాషి యస్‌లాగానే చేశావా? కేయస్ కాషియస్ అడిగితే నేను అలాగే నిరాకరించేవాణ్ణా? మార్కస్ బ్రూటస్ లోభిగా పరిణమించి తుచ్ఛమైన ధనాన్ని గుప్తం చేసే టట్లయితే ఓ దేవతల్లారా! సమస్తమైన ఉల్కలనూ ఆతడిమీద విసర టానికి సంసిద్ధులుకండి; అతణ్ణి ఛిన్నభిన్నం చెయ్యండి.

కాషియస్: ధనమివ్వటానికి నేను నిరాకరించలేదు.

బ్రూటస్: నిరాకరించావు.

కాషియస్: నిరాకరించలేదు. నాసమాధానాన్ని మీదగ్గిరికి తీసుకోవచ్చినవాడు మందబుద్ధి. బ్రూటస్ మీరు నాహృదయాన్ని కలచివేశారు. మిత్రుడైనవాడు స్నేహితుని దోషాలను సహించాలి. కానీ బ్రూటస్ నాదోషాలను ఉన్న వాటికంటే ఎన్నోరెట్లు అధికంచేస్తున్నాడు.

బ్రూటస్: లేదు, నీవు వాటిని నామీద ప్రయోగించనంతవరకూ చేయలేదు.

కాషియస్: మీరు నన్ను ప్రేమించటం మానివేశారా?

బ్రూటస్: నీదోషా లంటే నా కిష్టంలేదు.

కాషియస్: మిత్రునికంటికి ఆదోషాలు కనిపించవే కనుపించవు.

బ్రూటస్: అవి ఒలింపస్‌పర్వతాలవలె దొడ్డవై కని

పిస్తున్నా స్తుతిపాఠకుడు గమనించ లేమో కాని వాటిని సత్యసంధుడైన ఉత్తమమిత్రుడు గుర్తించకుండా ఉండలేడు.

కాషియస్ : ఆంటొనీ, రా! యువకుడా ఆక్టేవియస్ రా!! ప్రపంచమంటే కాషియస్ విసిగిపోయాడు. రండి. మీ ప్రతీకారాన్ని తీర్చుకోండి. తాను హృదయపూర్వకంగా ప్రేమించినవ్యక్తి, అతడి బావ, అతణ్ణి అసహ్యించుకుంటున్నాడు. అతడిసోదరుడు అతణ్ణి సేవకుణ్ణి తిట్టినట్లు తిడుతున్నాడు. అతడు నాముఖాన దులపటానికి నాదోషాల నన్నింటినీ గమనించాడు, గ్రంథస్తం చేశాడు, చదివి కంఠస్థంచేశాడు.

అబ్బా! నేను నాకన్నుల్లోనుంచి జీవనజ్యోతిని తొలగించుకో గలను. ఇదే నావక్షస్థలం. ఇందులో ఫ్లూటస్‌గని కంటే, కనకంకంటే ప్రియమైన నాహృదయ ముంది. ఇదిగో నాఛురిక! బ్రూటస్ మహాశయా! మీరు రోమ్‌పౌరులే అయితే అందుకోండి, దాన్ని అందుకోండి. ధనాన్ని నిరాకరించిన నేను మీకు హృదయాన్నిస్తున్నాను. పొడవండి. మీరు పూర్వం సీజర్ నెలా పొడిచారో అలాగే పొడవండి. నాకు తెలుసు— అతణ్ణి అత్యాధికంగా అసహ్యించుకుంటున్నప్పుడే మీరు కాషియస్‌ను ఎన్నడూ ప్రేమించ నంతటి అధికంగా ప్రేమించారు.

బ్రూటస్ : నీ ఛురికను ఒరలో నిల్పు. నీవు కోపగించ దలచినపుడు కోపగించు. అది స్వేచ్ఛగా వ్యవహరించ దలచుకొన్నప్పుడు వ్యవహరించనీ. నీవు నీఇష్టంవచ్చినట్లుప్రవర్తించు. నీవుచేసిన అప్రతిష్ఠాకరమైన ప్రకృత్యాన్నైనా నే నొక తాత్కాలికచేష్టగా భావిస్తాను. కాషియస్, నీవు గొఱ్ఱెవంటి సౌమ్యునితో జోడుకోడె వైనావు. అతడికోపం క్షణకాలం.

అది చెకుముకిరాయి నిప్పురవ్వను ధరించినంతకాలంమాత్రమే ఉంటుంది. చాలా గట్టిగా కొట్టినప్పుడు ఒకరవ్వను పొందుతుంది. వెంటనే చల్లారిపోతుంది.

కాషియస్ : కాషియస్ తనదుఃఖంతో, కోపంతో మీకు విలాసాన్ని, హాస్యాన్ని కల్పించటానికి జీవించిఉన్నా డన్న మాట !

బ్రూటస్ : ఆమాట అన్నప్పుడు నామానసికస్థితి ఏమీ బాగాలేదు.

కాషియస్ : ఇంతవరకైనా ఒప్పుకుంటున్నారు. ఏదీ మీ హస్తాన్ని ఇలా అందించండి.

బ్రూటస్ : నాహస్తాన్నే కాదు; హృదయాన్నికూడా అందిస్తాను.

కాషియస్ : బ్రూటస్ మహాశయా!

బ్రూటస్ : విషయ మేమిటి?

కాషియస్ : ఈ మీ మిత్రుడికి మాతృగర్భంలోనే అబ్బిన కోపం అతణ్ణి మరపించినవేళకూడా సహించగలిగినంతటి గాఢానురాగం నామీద మీకు లేదా?

బ్రూటస్ : లేకేం; కాషియస్! ఇక ముందు నీకు కోపం వస్తే నీస్నేహితుడు బ్రూటస్ దాన్ని మీతల్లివల్ల సంక్రమించిన గుణంగా భావించి సహిస్తాడు.

కవి : [ లోపల ] సేనాపతులను చూడటానికి వెళ్లనివ్వండి. వారిమధ్య ఏదో కలహం వచ్చినట్లుంది. వారిని ఒంటరిగా ఉండనీయటం సమంజసంకాదు.

లుసిలియస్ : [ లోపల ] నీవు వెళ్లటానికి అనుజ్ఞ లేదు.

కవి : [ లోపల ] మృత్యువుతప్ప నన్నేమీ ఆపలేదు.

లుసిలియస్, టిటినియస్, లుసియస్‌లతో కవి ప్రవేశిస్తాడు.

కాషియస్ : విశేషా లేమిటి? ఎందు కొచ్చావు.

కవి : మీ ప్రవర్తనకు మీరు సిగ్గుపడండి. సేనాపతు లారా! ఇలా కలహించుకోటంలో మీ అభిప్రాయ మేమిటి? మీవంటి ఇరువురువ్యక్తులు ఉండవలసిన రీతిగా ఉండి అన్యోన్యం అనురాగం వహించండి. 'ఎక్కువకాలం బ్రతికిన వాణ్ణి; విశేషాలు నే చూచిన వాణ్ణి.'

కాషియస్ : హాఁ, హాఁ, హాఁ. అంత్యప్రాసలో పాదాలను అతిక్రూరంగా పారేశాడు.

బ్రూటస్ : ఛీ! అవివేకీ! అవతలికి వెళ్ళిపో.

కాషియస్ : బ్రూటస్ మహాశయా! శాంతివహించండి సహించండి. ఇది అతడిశైలి.

బ్రూటస్ : సమయోచితజ్ఞానం వీడి కున్నట్లయితే ఈ హాస్యాన్ని అవగతం చేసుకోగలిగేవాణ్ణి. యుద్ధసమయా లల్లో బుద్ధిహీనులైన ఇటువంటి హాస్యకవులకు తావులేదు. వెళ్ళవయ్యా, వెళ్ళు.

కాషియస్ : వెళ్ళిపోయ్యా! వెళ్ళు!!

బ్రూటస్ : లుసిలియస్! టిటినియస్!! ఈరాత్రి తమ సైన్యాలను నిలపటానికి డేరిజాలను వేయించవలసిం దనిసేనా నాయకులను ఆజ్ఞాపించండి.

కాషియస్ : మీరు మెసెల్లాను వెంటబెట్టుకొని తక్షణమే మాదగ్గిరకు రండి.

[ లుసిలియస్, టిటినియస్‌లు నిష్క్రమిస్తారు

బ్రూటస్ : లుసియస్! ఒకచషకంనిండా ద్రాక్షాసవాన్ని తీసుకోరా.

కాషియస్ : మీకు ఇంతకోపం వస్తుందని నేను ఎన్నడూ భావించలేదు.

బ్రూటస్ : కాషియస్! అనేకబాధలవల్ల నేను సరిగాలేను.

కాషియస్ : ఏవో తాత్కాలికాలైన బాధలకు నీవు లొంగిపోతే తత్వజిజ్ఞాసవల్ల మీకు పొందిన ప్రయోజన మేముంది?

బ్రూటస్ : కాషియస్! ప్రస్తుతం బ్రూటస్‌కంటే అధిక దుఃఖాన్ని ఎవరూ భరించటం లేదు. ...పోర్షియా మరణించింది.

కాషియస్ : ఏమిటి! పోర్షియా మరణించిందా?

బ్రూటస్ : అవును. ఆమె మరణించింది.

కాషియస్ : ఇందాక మీకు అంతటికోపాన్ని తెప్పించి నప్పుడు నన్ను చంపలేదేమా అని నా కిప్పుడు ఆశ్చర్యం వేస్తున్నది. మీచేతిలో చావును ఎంతగా తప్పించుకొన్నాను. అబ్బా! ఎంతభరించరాని బాధ! ఇది నాహృదయాన్ని గాయపెడుతున్నది. జబ్బేమిటి?

బ్రూటస్ : నావియోగాన్ని సహించలేకపోవటం. ఆమె మరణవార్తతోబాటు యువకుడైన ఆక్టేవియస్ మార్క్ ఆంటోనీతో చేరి నాకు వ్యతిరేకంగా బలవత్తరులైనా డన్న వార్తకూడా వచ్చింది. ఆమె ఉన్మత్తురాలైందట. సేవకులు లేనప్పుడు నిప్పు మ్రింగిందట!

కాషియస్ : అందువల్ల మరణించిందా?

బ్రూటస్ : అవును.

కాషియస్ : అమరులారా! దేవతలారా!!

లుసియస్ ద్రాక్షాసవంతోబాటు కొన్ని లేఖాపత్రాలను కూడా తీసుకొని ప్రవేశిస్తాడు.

బ్రూటస్ : ఆవిడనుగురించి ఇంక ప్రస్తావించకు. నాకో పాత్రికనిండా ద్రాక్షాసవాన్ని పోసి ఇవ్వు. కాషియస్! దీంతో నీయెడ చూపిన నిర్దాక్షిణ్యాన్నంతటినీ నిర్మూలించివేస్తాను.

[ఆసవాన్ని సేవిస్తాడు.

కాషియస్: ఈఉదాత్త ప్రతిజ్ఞకోసమే నాహృదయం విదాహం వహిస్తున్నది. లూసియస్, పాత్రిక పొర్లిపోయే దాకా పానీయాన్ని నింపు. బ్రూటస్ ప్రేమను నేను విపరీతంగా గ్రోలగలను.

[సేవిస్తాడు.

బ్రూటస్ : లోపలికిరా టిటినియస్!

[లుసియస్ నిష్క్రమిస్తాడు

మెసెల్లాతో టిటినియస్ ప్రవేశిస్తాడు.

ఉదాత్తుడా, మెసెల్లా నీకిదే స్వాగతం. ఈకొవ్వొత్తి దగ్గిర కూర్చొని మనం కర్తవ్యాలనుగురించి సమాలోచిద్దాం.

కాషియస్ : పోర్షియా! నీవు వెళ్లిపోయావా?

బ్రూటస్: ఆమెనుగురించి ఇక చాలించు. నిన్ను ప్రార్థిస్తున్నాను. మెసెల్లా! యువకుడైన ఆక్టేవియస్ ఆంటోనీతో కూడా ఫిలిప్పీవైపుకు జైత్రయాత్రను సాగిస్తూ మనమీదికి గొప్పసైన్యంతో వస్తున్నట్లు వార్తవచ్చింది.

మెసెల్లా : ఇదే ధోరణిలో నాకూ లేఖలువచ్చాయి.

బ్రూటస్ : ఇంకా విశేషాలేమైనా ఉన్నవా?

మెసెల్లా : ఆక్టేవియస్, ఆంటోనీ, లెపిడస్‌లు ముగ్గురూ సభాసభ్యులలో నూరుమందిని చట్టవిద్రోహులనుగా ప్రకటించి శిక్షించారుట!

బ్రూటస్ : మనఉభయులలేఖలూ ఇక్కడ భేదిస్తున్నవి. నాకు వచ్చిన లేఖల్లో వారు ప్రాణాలుతీసిన సభాసభ్యులు డెబ్బదిమంది మాత్రమే ; వారిలో సిసెరో ఒకడు.

కాషియస్ : సిసెరో వాళ్లలో ఒకడా?

మెసెల్లా : సిసెరో అయిపోయినాడు — చట్టవిద్రోహు లని వారు చేసిన ప్రకటనవల్లనే. ప్రభూ! మీకు వచ్చిన లేఖలు మీభార్యగారు వ్రాసినవా?

బ్రూటస్ : లేదు మెసెల్లా!

మెసెల్లా : ఆమెగారిని గురించి మీకు వచ్చిన లేఖల్లో ఏమీలేదా ?

బ్రూటస్ : ఏమీలేదు మెసెల్లా !

మెసెల్లా : ఇది చాలా విచిత్రంగా ఉంది.

బ్రూటస్ : ఏమి ఇలా ఆమెనుగురించి ప్రశ్నించావు ? నీకు వచ్చిన లేఖలవల్ల ఆమెనుగురించిన విశేషాలేమన్నా తెలుసుకున్నావా ?

మెసెల్లా : ఏమీ లేదు ప్రభూ !

బ్రూటస్ : మెసెల్లా ! నీవు రోంపౌరుడవు. రోంపౌరుడిలా సత్యంచెప్పు.

మెసెల్లా : అయితే రోంపౌరుడిలా సత్యం చెప్తున్నాను. ఆమెగారు మరణించారు. ఇది నిజం. ఆమరణం సామాన్య రీతిగా సంభవించలేదు.

బ్రూటస్ : ఎలాగైతేనేం; పోర్షియా గతించింది. ఎప్పుడో ఒకప్పుడు మనకూ మృత్యువు తప్పదు. ఎప్పుడో ఒకప్పుడు ఆమె మరణించి తీరవలసిందే గదా అన్నభావంతోనే శాంతి వహించి ఆమె మరణవార్తను భరిస్తున్నాను.

మెసెల్లా : మహనీయులు ఎల్లవేళలా ఇదేరీతిగా తమకు వచ్చిన అన్ని ఆపదలనూ భరిస్తుంటారు.

కాషియస్ : సిద్ధాంతదృష్ట్యా నాకూ ఇంతటి ప్రశాంత గుణ మంటే ఇష్టమేగాని కార్యాచరణలోమాత్రం ఇటువంటి కష్టాలను భరించలేను.

బ్రూటస్ : సరే. మనం ప్రస్తుతకార్యక్రమానికి వద్దాం. తక్షణమే మనం ఫిలిప్పీమీాదికి వెళ్లటాన్నిగురించి నీ అభిప్రాయ మేమిటి?

కాషియస్ : అది శ్రేయమని నేను భావించను.

బ్రూటస్ : ఎందువల్ల?

కాషియస్ : వెదుకుకుంటూ శత్రువును మనకోసం రానివ్వటమే మంచిది. అందువల్ల వారి సాధనసంభారాలు తరిగిపోతవి. సైన్యాలకు శ్రమకలుగుతుంది. ఇక్కడ కదలకుండా ఉండటంవల్ల మనకు విశ్రాంతి చేకూరుతుంది. రక్షణకు మార్గాలను చేకూర్చుకోవచ్చు. సర్వవిధాలా మనం సిద్ధపడవచ్చు.

బ్రూటస్ : నీవు చెప్పినకారణాలు చాలా మంచివే. కానీ నేను సూచించేవి అంతకంటే మంచివిగా ఉన్నప్పుడు అవి లొంగిపోవలసిందే. ఈ ప్రదేశానికీ, ఫిలిప్పీకీ మధ్యలో ఉన్న ప్రజలు మనలను మనఃపూర్వకంగా అనుసరించేటట్లు కన్పించటం లేదు. వారు ఇష్టంతో మనసైన్యాల కేమీా విరాళాలిచ్చినట్లు లేదు. మనశత్రువులను ఈప్రదేశంగుండా రానివ్వనిస్తే వారు వీరిని సైన్యంలో చేర్చుకొని, సంఖ్యను వృద్ధిచేసుకోటానికీ, నూతనోత్తేజాన్ని పొందటానికీ అవకాశం లభిస్తుంది. ఫిలిప్పీవద్దనే మనం శత్రువులను ఎదుర్కొంటే

వారి కేలవకాశాలు కలగకుండా చేయగలం. అంతేకాక ప్రజలుకూడా మనకు అండగా ఉంటారు.

కాషియస్ : బావగారూ! నా అభిప్రాయాన్ని మన్నించండి.

బ్రూటస్ : క్షమించు. అంతే కాదు. చక్రనిమిత్రులను పొందాం; సైన్యాలనూ, సాధనసంపత్తినీ చేకూర్చుకున్నాం. మనపథకాలు ఎంతో పరిపక్వమైనవి. శత్రువు ప్రతినిత్యం వృద్ధిపొందుతున్నాడు. ఇటువంటి స్థితిగతులున్నా మనం పతనోన్ముఖం కాకతప్పదు. సకాలంలో వ్యవహరిస్తే మానవులను విజయం వరిస్తుంది. లేకపోతే వారిజీవితనౌక భగ్నమై దుర్భర దుస్థితిని కల్పిస్తుంది. ఇటువంటి మహాసముద్రంలో మనం ఇప్పుడు ప్రయాణం చేస్తున్నాం. ప్రవాహం మనకు అనుకూలంగా ఉన్నప్పుడే ప్రయోజనాన్ని పొందాలి; లేకపోతే మనసాహసం సమస్తం వ్యర్థమాతుంది.

కాషియస్ : అయితే, మీ ఇచ్ఛానుసారంగా సైన్యాలను బయలుదేరదీయండి; ఫిలిప్పీవద్దనే శత్రువును ఎదుర్కొందాం.

బ్రూటస్ : మన సంభాషణలో రాత్రి ఎంతగా గడిచిపోయిందో గమనించలేదు. కొంతవిశ్రాంతిని తీసుకోటం మనశరీరాలకు సహజధర్మం కదా! ఇంకా మాట్లాడుకోవలసిందేమైనా ఉందా?

కాషియస్ ఏమీ లేదు. సునక్తం. రేపు ఉదయమే పెందలకడ సైన్యాలను బయలుదేరదీద్దాం.

బ్రూటస్ : లూసియస్! [లుసియస్ ప్రవేశిస్తాడు] నానిచోళ మేది? శుభాకాంక్షలోయ్ మెసెల్లా; మహాశయా! సునక్తం.

[లుసియస్ నిష్క్రమిస్తాడు

టిటినియస్! మహోదాత్తా, కాషియస్! సునక్తం. మంచి విశ్రాంతిని పొందుదువుగాక!

కాషియస్ : బ్రూటస్ మహాశయా! ఈరాత్రి మనమధ్య కలహంతో ఆరంభమైంది; మనఅంతరాత్మల్లో అటువంటి విభేదా లుండకుండుగాక!

బ్రూటస్ : సర్వం శుభోదర్కంగానే ఉంటుంది.

కాషియస్ : మహాశయా, సునక్తం!

బ్రూటస్ : సునక్తం కాసియస్!

టిటినియస్ : మెసెల్లా : సునక్తం బ్రూటస్ ప్రభూ!

బ్రూటస్ : అందరికీ నాశుభాకాంక్షలు

బ్రూటస్తప్ప మిగిలినవారందరూ నిష్క్రమిస్తారు

లుసియస్ నిచోళంతో తిరిగిప్రవేశిస్తాడు.

నానిచోళాన్ని ఇలా ఇవ్వు. నీసంగీతసాధన మేది?

లుసియస్ : శిబిరంలో ఉంది.

బ్రూటస్ : అలా నిద్రమత్తుగా ఉన్నా వేమిటి? పాపం, వెర్రివాడివి; నీదోషం కాదు. నీవు చాలాసేపు మేల్కొన్నావు. నామనుష్యులను క్లాడియస్ను మరికొందర్ని పిలు.

లుసియస్ : వర్రో! క్లాడియస్!!

వర్రో క్లాడియస్లు ప్రవేశిస్తారు.

వర్రో : పిలిపించారా ప్రభూ!

బ్రూటస్ : మీరు నాశిబిరంలో శయనించి నిద్రపొండి. కాషియస్తో పనిఉంది. నేను మిమ్మల్ని అప్పుడప్పుడూ మేల్కొల్పవలసి వస్తుంది.

వర్రో : మీకోరికైతే మేము రాత్రంతా మేల్కొనే

ఉంటాము.

బ్రూటస్: అవసరం లేదు; మీరు నిద్రపోవచ్చు. మిమ్మల్ని లేపటానికికూడా నాకు అసలు అవసరం కలగకపోవచ్చు. నేను వెతుక్కొంటున్న పుస్తకం, ఇదిగో, నా జేబులోనే పెట్టుకొన్నాను.

[వర్రో క్లాడియస్‌లు విశ్రమిస్తారు

లుసియస్: ప్రభూ! మీరు దాన్ని నాకు ఇవ్వనట్లు బాగాగుర్తు.

బ్రూటస్: నేను నిన్నే మన్నదీ మరచిపో. నాకు మరుపు ఎక్కువైంది. కాసేపు మేల్కొని ఒకటిరెండుగీతాలు వినిపించగలవా?

లుసియస్: మీ ఆనందం కోసం తప్పక వినిపిస్తాను.

బ్రూటస్: పాపం! నిన్ను చాలా శ్రమపెడుతున్నట్లున్నాను; కానీ నీవు ఇష్టంజూపిస్తున్నావు.

లుసియస్: అది నాకర్తవ్యంకదా ప్రభూ!

బ్రూటస్: శక్తిమించిన కర్తవ్యాన్ని చెయ్యమని నేనెవరినీ బలవంతపెట్టను. యువకులు ఎప్పుడూ విశ్రాంతిని కోరుతుంటారని నాకు తెలుసు.

లూసియస్: ప్రభూ! నేను కొంతగా నిద్రతీసి మేల్కొన్నాను.

బ్రూటస్: మంచిపని చేశావు; మళ్లా నిద్రపోదువుగాని. నిన్ను ఎక్కువసేపు మేల్కొనబెట్టనులే. నేనే బ్రతికిఉంటే నిన్ను ఎంతో ప్రేమతో చూస్తాను. [సంగీతం ఒకగీతం వినిపిస్తుంది.] ఇది బాగా నిద్రనిచ్చే ఫణితిలా ఉంది.

నిద్రా, ఓహంతకీ! మహాభారోపేతమైన అధికారదండాన్ని గీతాలు వినిపించే నాబాలుడిమీదకూడా మోపు

తున్నావా? ఒకేయ్, వెర్రివాడా! వెళ్ళు. విశ్రాంతి తీసుకో, నిన్ను మేల్కొని ఉండమనటం మహాపచారం. ఇలాగే తూగుతూ మేల్కొంటే నీవు వీణనుకూడా బద్దలు కొట్టుకుంటావు. దాన్ని ఇలాతే. వెళ్ళు. నిద్రపో. నేను చదువుతున్నపుట మూరిపోయిందే! చాలా చిత్రంగా ఉంది; బాగా మూరింది.

సీజర్ భూతాకృతి ప్రవేశిస్తుంది.

ఈదీపం ఇలా వణికిపోతూ ప్రకాశిస్తున్న దెందుకు? ఏయ్! ఎవరు? లోపల ప్రవేశించి దెవరు? లేదు. ఇది నా దృష్టిలోపంవల్లనే కలుగుతున్నదనుకుంటాను. భూతరూపం ఏదో గోచరిస్తున్నది. అయ్యో! ఇది నామీదకే వచ్చే స్తున్నది: నీవు సత్యమైన మూర్తివేనా? లేక కృత్రిమ రూపానివా? నారక్తాన్ని చల్లబడేస్తూ, నా కేశాలను నిక్క పొడుచుకొని నిలుచునేటట్లు చేస్తూ ఉన్న నీవు దేవతవా? గంధర్వుడవా? లేక భూతానివా? నీవెవరు! నాతో మాట్లాడు.

భూతం: బ్రూటస్! నేను నీదుష్టాత్మను.

బ్రూటస్: నీ వెందు కిక్కడికి వచ్చావు?

భూతం: నేను నీకు మళ్లీ ఫిలిప్పీలో దర్శన మిస్తా నని చెప్పిపోవటానికి.

బ్రూటస్: మంచిది. అయితే నిన్ను మళ్లీ అక్కడ చూస్తాను.

భూతం: అయితే ఫిలిప్పీదగ్గిర కలుసుకుందాం.

బ్రూటస్: తప్పక. నిన్ను మళ్లీ ఫిలిప్పీదగ్గర కలుసు కుంటాను.

[ భూతం నిష్క్రమిస్తుంది.

నీవు వెళ్లిపోయావు. నాకు మళ్లీ ధైర్యం వచ్చింది. ఓదుష్టభూతమా! నీతో బహుకాలం సంభాషిస్తాను. ఒరేయ్ లుసియస్, వర్రో, క్లాడియస్, మేల్కొండి, మేల్కొండి.

లుసియస్ : ప్రభూ! నావీణతంతులు బాగాలేవు.

బ్రూటస్ : పాపం! వీడు ఇంకా తాను వీణవాయిస్తున్నా ననే అనుకుంటున్నాడు.

లుసియస్ : ప్రభూ!

బ్రూటస్ : ఇలా కేకపెడుతున్నావు? నీ వేదైనా కల గంటున్నావా?

లుసియస్ : కలా, లేదు ప్రభూ!

బ్రూటస్ : మళ్లీ నిద్రపో! క్లాడియస్ [వర్రోతో] నిన్నె నోయ్ వర్రో, మేల్కొండి.

వర్రో : ప్రభూ!

క్లాడియస్ : ప్రభూ!

బ్రూటస్ : నిద్రలో మీరు ఎందు కలా కేకపెట్టారు?

వర్రో : క్లాడియస్ : నిజమా ప్రభూ!

బ్రూటస్ : ఔను. నిద్రలో మీ కేమైనా కనిపించిందా?

వర్రో : నా కేమీ కనిపించలేదు ప్రభూ!

క్లాడియస్ : నాకూ ఏమీ కనిపించలేదు ప్రభూ!

బ్రూటస్ : నాఅభినందనలు మీబావమరది కాషియస్‌కు అందజేయండి. అతణ్ణి మనకంటే బాగా ముందుగా సైన్యాలను బయలుదేరదీయమని చెప్పండి. మనం అతణ్ణి అనుసరిద్దాం.

వర్రో ; క్లాడియస్ : చిత్తం. అలాగే ప్రభూ!

[నిష్క్రమిస్తారు

# పంచమాంకం

## ఒకటో దృశ్యం

ఫిలిప్పీమైదానాలు. ఆక్టేవియస్, ఆంటోనీలు వారిసైన్యాలతో ప్రవేశిస్తారు.

ఆక్టేవియస్: ఆంటోనీ! మనఆశలన్నీ నెరవేరాయి. మన శత్రువులు కొండలను దిగి రారనీ, మైదానభూముల్లోనే, ఉపత్యకల్లోనే ఉంటారని నీ వన్నావు. అలా జరగటంలేదు. వారిసైన్యాలు అతివేగంతో మనమీదికి వచ్చేస్తున్నాయి. ఈఫిలిప్పీవద్దనే మనమీద పడటానికి వారు వస్తున్నట్లున్నారు. మనకు వారు సమాధానం చెప్పటానికి బదులుగా మనమే వారికి సమాధానం చెప్పవలసి వచ్చేటట్లు కనిపిస్తున్నది.

ఆంటోని: వారిమనోభావాలు నాకు బాగా అవగతమైనవే. వారు మనవంకకు రారు. ప్రక్కగా తప్పుకొనిపోవటంతో తృప్తిపడతారు. ఈదృశ్యంద్వారా మహావీరుల్లాగా మనమీదికి వచ్చిపడేటట్లు మనకో అభిప్రాయం కలిగించటానికి కనిపిస్తారేగాని అటువంటి పరాక్రమం వారిదగ్గర లేదు.

ఒకవార్తావహుడు ప్రవేశిస్తాడు.

వార్తావహుడు: సేనాపతులకు ఆజ్ఞలిచ్చి సిద్ధపడండి. శత్రువులు భయంకరపరాక్రమంతో వచ్చేస్తున్నారు. తమయుద్ధచిహ్నమైన సిందూరవర్ణకంచుకాన్ని తగిలించుకొని వస్తున్నారు. మీరు వెంటనే ఏమైనా చెయ్యాలి.

ఆంటోనీ: ఆక్టేవియస్! ప్రశాంతంగా ఉత్తరభాగయుద్ధభూమిని నీవు కాచుకో.

ఆక్టేవియస్: నేను దక్షిణభాగాన ఉంటాను. ఉత్తర

బాగాన్ని నీవు కాచుకో.

ఆంటొని : ఈక్లిష్టసమయంలో నీవు నాతో వ్యతిరే కిస్తున్నా వెందుకు?

అక్టేవియస్ : నిన్ను వ్యతిరేకించటం కాదు. నే నిపని చేస్తాను. అంతే.

[ బయలుదేరుతారు

యుద్ధఘంటుఘోషలు వినిపిస్తుంటవి. బ్రూటస్, కాషియస్, వారి సైన్యాలు, లుసిలియస్, టిటినియస్, మెసెల్లా ఇతరులూ ప్రవేశిస్తారు.

బ్రూటస్ : వారు నిలువబడ్డారు; మనతో సంప్రదించ దలచిన ట్లున్నారు.

కాషియస్ : టిటినియస్! ఆగిపో. ముందుకువెళ్లి మనం వారితో మాట్లాడాలి.

అక్టేవియస్ : మనం యుద్ధచిహ్నాన్ని వారికి అందిద్దామా?

ఆంటొని : లేదు. సీజర్, వారి ఎత్తేమో చూచి సమాధానం చెబుదాం. ముందుకు పోదాం. బ్రూటస్, కాషియస్ల సేనాపతులు మనతో మాట్లాడదలచిన ట్లున్నారు.

అక్టేవియస్ : సంజ్ఞ చేసేటంతవరకూ కదలవద్దు.

బ్రూటస్ : దేశీయులారా! పోటీలకు ముందు మాటలా?

అక్టేవియస్ : మాటలంటే మాకు మీకంటే ఇష్టమని కాదు.

బ్రూటస్ : మంచిమాటలు పోటులకంటే మంచివి.

ఆంటొని : చెడ్డపోటులు పొడిచేటప్పుడు, బ్రూటస్, నీవు మంచిమాటలేచెపుతావు. 'చిరంజీవ! జై సీజర్' అన్న నినాదాలు చేస్తూనే సీజర్ను పొడిచిన పోటు ఇందుకు సాక్ష్యం.

కాషియస్ : ఆంటొని! నీపోటులు ఏవంకకు పడతాయో

ఇంకా తెలియదు. కాని నీమాటలు హైబ్లా తేనెటీగలు దాచుకున్న తేనెనంతటినీ కాజేసి వాటికి లేకుండా చేసినట్లు కన్పిస్తున్నవి.

అంటొనీ: తేనె లేకుండా చేయటమే కాదు; కుట్టటంకూడా లేకుండా చేసినట్లున్నవి నీవి.

బ్రూటస్: అవును. వాటిఝుంకారాన్ని నీవు పుచ్చుకొన్నావు గనక నీవి రొదకూడా కాజేసినట్లున్నవి. కానీ కుట్టబోయ్యేముందు తెలివితేటలతో ప్రవర్తించు.

అంటొనీ: ద్రోహులారా! నన్ను భయపెడుతున్నారా? మీచురికలు ఒకదానితో ఒకటి సీజర్ శరీరంలో రాచుకొంటున్నప్పుడే మీరు అలా ప్రవర్తించలేదు. అందుకు ప్రతిగా మీరు కాన్కా పిచ్చిగజ్జకుక్కలా సీజర్ మెడమీద వొంగపోటు వేసినప్పుడు స్తోత్రపాఠకులారా! ముబ్బల్లా, పళ్లికిలించి, కుక్కలా కాళ్ళమీదపడ్డారు.

కాషియస్: బ్రూటస్, ఇందుకు నిన్ను నీవే అభినందించుకోవాలి. కాషియస్ మాట చలామణి ఔతుంటే ఈనాలుక ఈనాడిలా కారులు ప్రేలగలిగేదా?

ఆక్టేవియస్: ఈవ్యర్థభాషణాన్ని చాలిద్దాం. ప్రస్తుతానికి వద్దాం. వాగ్వాదనవల్ల చెమటబిందువులు రాలితే దానిఫలితంవల్ల రక్తస్రావం జరుగుతుంది. ఈహంతకులమీద నేను కత్తినిదూస్తున్నాను. ఇది తిరిగి ఒరలో ఎప్పుడు చేరుతుందో మీకు తెలుసునా? సీజర్‌కు తగిలిన ముప్పదిమూడు గాయాలకూ తగిన ప్రతీకారం జరిగేటంతవరకూ పోదు; లేదా మరొకసీజర్ హంతకద్రోహులకత్తులకు బలిఅయ్యేటంతవరకూ చేరదు.

బ్రూటస్ : సీజర్ నీవు అటువంటివారిని వెంటతెచ్చుకుంటేతప్ప వారిహస్తాలల్లో మృతినొందటానికి వీలుండదు.

అక్టేవియస్ : నేనూ అలాగే అనుకుంటున్నాను. నేను బ్రూటస్ కత్తితో చావటానికి పుట్టలేదు.

బ్రూటస్ : నీవంశంలో నీవు మహోదాత్తుడవై జన్మించినప్పటికీ నీకు అంతకంటే గౌరవనీయమైన చావు కలుగదు.

కాషియస్ : ఒకవేషధారితో (మాడుమొగం)తో, తిని త్రాగి(తుళ్ళే)వాడితో చేరిన బడిపిల్లవాడికి అంతటి గౌరవార్హతకూడానా?

ఆంటొనీ : సరిగా పరిహాసకుడవైన కాషియస్‌లా మాట్లాడావు.

అక్టేవియస్ : వచ్చెయ్ ఆంటొనీ! ఇదిగో మాతిరస్కారం. అందుకోండి. ఎదుర్కోండి. మీకు ధైర్యముంటే ఈనాడు యుద్ధభూమికి రండి. లేకపోతే మీకు ఇష్టంవచ్చిననాడు రండి.

[అక్టేవియస్, ఆంటొనీలు వారిసైన్యాలతో నిష్క్రమిస్తారు

కాషియస్ : పెనుగాలులు వీచాయి, కల్లోలితాలై అలలు చెలరేగాయి; తుపాను వచ్చింది. మనసర్వస్వం ఉన్న నౌకను అలలమీద వదిలాం.

బ్రూటస్ : లుసియస్! నీతో కొంత మాట్లాడాలి.

లూసియస్ : [నిలువబడి] ప్రభూ!

[విడిగా బ్రూటస్ లూసియస్‌లు మాట్లాడు తుంటారు

కాషియస్ : మెసెల్లా!

మెసెల్లా : [నిలిచి] సేనాపతులఆజ్ఞ ఏమిటి?

కాషియస్ : కాషియస్ జన్మించింది ఈనాడే; కనక

ఈనాడు నాజన్మదినం. ఏదీ నీహస్తం. ఒకనాటి పాంపే లాగా, నాఇష్టానికి వ్యతిరేకంగా, మనసమస్తసాహసాన్నీ ఈయుద్ధంకోసం పణంపెట్టవలసివచ్చింది. ఎపిక్యూరస్‌కు నేను అనుయాయినని, నీకు తెలుసు. కానీ నే నిప్పుడు నాఅభిప్రాయాలను మార్చుకున్నాను. శకునాలు సత్యాలని నమ్ముతున్నాను. సార్డిస్‌నుంచి మనం వస్తుండగా భరతపక్షులు రెండు మనప్రధానధ్వజంమీద వ్రాలాయి. అవి అక్కడ మనసైనికుల హస్తాలను తింటూ కూర్చున్నవి. ఈపక్షులు మనను పాంపేవరకూ అనుసరించి ఈఉదయమే అవి పారిపోయాయి. వాటిస్థానంలో కాకులు గ్రద్దలు కాకోలాలు మనను తమ అనిశ్చయాహారంగా భావించి తలలమీద తిరుగుతూ మృత్యుసూచకాలై ఆచ్ఛాదిస్తున్నవి.

మెసెల్లా : మీరు వీటి నన్నింటినీ నమ్మకండి.

కాషియస్ నేను వాటిని కొంతవరకు నమ్ముతాను. నన్నేదో నవచైతన్యం ఆవేశించింది. కానీ నేను నిశ్చలంగా సమస్తమైన ఆపదలనూ దృఢశక్తితో ఎదుర్కొంటాను.

బ్రూటస్ : [దూరంగా లుసిలియస్‌తో] లుసిలియస్ ! సర్వదా అలాగే.

కాషియస్ : మహోదాత్తా బ్రూటస్ ! శాంతిసమయంలో స్నేహితులంగా ఉన్న మనం వృద్ధాప్యంవరకూ అలాగే ఉండటానికి ఉంటాం. నిశ్చయంగా దేవతలు మనయెడ మిత్రభావమే వహించారు. కానీ, మానవులవ్యవహారా లన్నీ అనిశ్చయాలు కనక. ఎంతటి కీడు కలగటానికి వీలుందో అంతా ఊహిద్దాము. ఈయుద్ధంలో. మనకు అపజయమే ప్రాప్తిస్తే మనం ఇద్దరం కలిసి మాటాడుకోటానికి ఇదే తుది

సారి జౌతుంది. మీ రేంచేయదలచుకున్నాను.

బ్రూటస్ : నేను నేర్చుకొన్న తత్వశాస్త్రధోరణి ఇది కాదు. భవిష్యత్తులో ఏమి కానున్నదో అన్నభయంతో జీవితకాలాన్ని తగ్గించుకోటం నాతత్వం కాదు. ఇందుకే నేను ఆత్మహత్య చేసుకొన్నాడని కేటోను నిందించాను. మనలను పాలించే దేవతలనిర్ణయంకోసం నేను ప్రశాంత చిత్తంతో వేచిఉంటాను.

కాషియస్ : ఈయుద్ధంలో మనం ఓడిపోతే వారు తమ విజయోత్సవసందర్భాలల్లో మిమ్మల్ని రోంఘుంటాపథాలల్లో ఈడ్చుకోపోవటానికి ఇష్టపడుతున్నారా?

బ్రూటస్ : లేదు. ఓఉదాత్తరోంపౌరుడా, కాషియస్! లేదు. బందీఐ బ్రూటస్ రోంకు వెళతాడని భావించకు. అతడు మహామనస్వి. మార్చిపదిహేనున ఆరంభమైనపని ఈనాటితో పరిపూర్ణమౌతుంది. ఈనాడు మనం గడచి బ్రతుకుతామో లేదో. అందువల్ల మనం నిత్యమైన వీడ్కోలును పొందుదాం. కాషియస్! సర్వకాలాలకూ నీకు ఇదే నావీడ్కోలు. మళ్లీ కలుసుకుంటామనుకో, మందస్మితంచేద్దాం. లేదనుకో. ఈవిప్రయోగం అత్యుత్తమంగా జరిగిపోయిందౌతుంది.

కాషియస్ : సర్వకాలాలకూ ఇదే నావీడ్కోలు! మనం మళ్లీ కలుసుకుంటే నిశ్చయంగా మందస్మితంచేద్దాం కదూ! నిజానికి మనవీడ్కోలు అత్యుత్తమంగా జరిగిపోతున్నది.

బ్రూటస్ : ఇక ఆలశ్యమెందుకు? నడిపించు. ఈనాటిఫలితాన్నిగురించి ముందుగా తెలుసుకోటానికి నేనెంతో కుతూహలపడుతున్నాను. ఈదినం ఏరీతిగానైనా అంత

మొందితే చాలు. ఫలితం తెలిసిపోతుంది. ఇక పద! నడవండి!!

## రెండో దృశ్యం

అదే ప్రదేశం యుద్ధభూమి. యుద్ధధ్వనులు వినిపిస్తుంటాయి. బ్రూటస్, మెసెల్లాలు ప్రవేశిస్తారు.

బ్రూటస్ : వెళ్ళు మెసెల్లా. వేగంగా వెళ్లు. ఈవార్తలు అవతలవైపు ఉన్న సైన్యానికి అందించు. [పెద్దకోలాహలం వినిపిస్తుంది] ఆక్టేవియస్ పక్షంలో శక్తి క్షీణించినట్టు కనిపిస్తున్నది. వెంటనే కాషియస్‌ను సైన్యంతో వారిమీద పడమను. హఠాత్తుగా పైబడితేవారు లొంగిపోతారు. వెళ్లు. వేగంగా వెళ్ళు. వాళ్ళందరినీ క్రిందికి రమ్మను.

[నిష్క్రమిస్తాడు

## మూడో దృశ్యం

యుద్ధభూమిలో మరొకభాగం. యుద్ధకోలాహలం వినిపిస్తుంటుంది. కాషియస్, టిటినియస్‌లు ప్రవేశిస్తారు.

కాషియస్ : చూడు టిటినియస్ ! ద్రోహులు పారిపోతున్నారు. నామనుష్యులకు నేనే శత్రువుగా ప్రవర్తించాను. నాధ్వజవాహకుడు పారిపోవటానికి యత్నిస్తుంటే వాణ్ణి చంపి ఆధ్వజాన్ని అందుకున్నాను.

టిటినియస్ : కాషియస్ ! బ్రూటస్ చాలా ముందుగా పైబడమని ఆజ్ఞాపించారు. ఆక్టేవియస్ సన్నగిలటాన్ని చూచి వెంటనే విజయంచేకూరుతుందని భ్రాంతిపడి ఉంటాడాయన. మనను ఆంటొనీ చుట్టివేస్తుంటే 'అతడిసైనికులందరూ దోపిడికోసం శత్రుశిబిరాలమీద పడ్డారు;

పిండారస్ ప్రవేశిస్తాడు

పిండారస్: ప్రభూ! దూరంగా వెళ్ళిపొండి; దూరంగా వెళ్ళిపొండి. మార్క్-ఆంటొని మీశిబిరాలల్లో ప్రవేశించాడు. ఉదాత్తుడా, కాషియస్, దూరంగా వెళ్ళిపోండి.

కాషియస్: ఈకొండ చాలాదూరాన్నే ఉంది. టిటినియస్! చూడు, చూడు! ఆ అగ్నిదగ్ధమౌతున్న శిబిరాలు నావేనా!

టిటినియస్: అవును ప్రభూ! మీవే.

కాషియస్: టిటినియస్! నీకు నా మీద ప్రేముంటే అశ్వాన్ని ఆరోహించి తరిమి పసుగెత్తించి పారిపో. ఆదూరపు సైన్యాలదగ్గిరికి వెళ్ళి అవి మిత్రసైన్యాలో, శత్రుసైన్యాలో తెలుసుకోరా.

టిటినియస్: భావవేగంతో వెళ్ళి తిరిగివస్తాను.

[నిష్క్రమిస్తాడు

కాషియస్: పిండారస్! కొండపైకి వెళ్ళు- నాకు చూపు బాగాలేదు. టిటినియస్‌ను చూస్తుండు. యుద్ధభూమిలో జరిగే విశేషాలు నాకు అక్కడినుంచి నివేదిస్తుండు.

పిండారస్ కొండఎక్కుతాడు

నేను ఈనాడే జన్మించాను; నేపుట్టిన ఈనాడే మరణిస్తాను. నాజీవితం తనయాత్రను పూర్తిచేసుకొన్నది. ఒరేయ్! విశేషాలేమిటి?

పిండారస్: (పైనుంచి) ప్రభూ!

కాషియస్: విశేషాలేమిటి?

పిండారస్: టిటినియస్‌ను అశ్వికులు చుట్టుముట్టారు అయినా అతడు ఇంకా అశ్వాన్ని తరుముతూ పరువులు

వెట్టిస్తూనే ఉన్నాడు. వారు ఇప్పుడు అతడికి చాలా దగ్గరగా చేరారు. టిటినియస్! పరుగెత్తిపో!! శత్రువుల్లో కొందరు అశ్వికులు దిగుతున్నారు. టిటినియస్‌కూడా దిగాడు. అయ్యో! వారు అతణ్ణి పట్టుకొన్నారు.

[ దూరంనుంచి హర్షధ్వని వినిపిస్తుంది

కాషియస్ : దిగిరా. ఇకచూడకు. అయ్యో! నాకళ్ళఎదుటనే నాప్రియమిత్రుడు బందీఐపోతే నేను ఇంకా బ్రతికే ఉన్నాను. నే నెంత పిరికివాణ్ణి.

పిండారస్ దిగివస్తాడు.

ఒకేయ్, ఇక్కడికిరా! పార్థియాలో నిన్ను నేను బందీగా పట్టుకొన్నాను. అప్పుడు నీకు ప్రాణదానం చేస్తూ 'మీఆజ్ఞలనన్నింటినీ పాలిస్తా' నని నీచేత ప్రమాణం చేయించాను. రా. నీప్రమాణాన్ని నిలువబెట్టుకో. ఇప్పుడు నీవు స్వతంత్రుడివి. ఇదిగో, సీజర్ ఊపిరితిత్తుల్లో దూరిన ఈ కత్తితో నాకడుపును గాలించు. సమాధానం చెప్పటానికి ఆగకు. ఇదిగో! ఊఁ, అందుకో. నేను ఇలా చేతుల్తో మూసుకోగానే కత్తిని కడుపులోకి నడిపించు.

పిండారస్ అతణ్ణి పొడిచివేస్తాడు.

సీజర్, నీవు ప్రతీకారాన్ని పుచ్చుకొన్నావు. నిన్ను చంపిన కత్తితోనే ప్రతీకారాన్ని పుచ్చుకొన్నావు.

[ చనిపోతాడు

పిండారస్ : నేను ఇప్పుడు స్వతంత్రుణ్ణి. కాని నేను ధైర్యం చేసి స్వతంత్రించి ఆయన్ను కాదని వ్యవహరించి నట్లైతే స్వతంత్రు ణ్ణయ్యేవాణ్ణి కాను. అయ్యో! కాషియస్ మహాశయా! ఎప్పుడూ ఏరోంపౌరుడూ నన్ను గుర్తించని ఏదూర

దేశానికో ని ఈపిండారస్ పారిపోతున్నాడు.

టిటినియస్, మెసెల్లాలు తిరిగిప్రవేశిస్తారు

మెసెల్లా : టిటినియస్! ఇది కేవలం స్వల్పమైన మార్పే నా? బ్రూటస్ మహాశయుని సైన్యం ఆక్టేవియస్‌ను జయించింది. కాషియస్ సైన్యాలు ఆంటొనీ చేజిక్కాయి.

టిటినియస్ : ఈవార్త కాషియస్‌కు సంతోషాన్ని చేకూరుస్తుంది.

మెసెల్లా : నీవు అతణ్ణి ఎప్పుడు వదలిపెట్టివచ్చావు?

టిటినియస్ : నేను వదలివచ్చినప్పుడు నిరాశ పూర్ణంగా ఆయన్ను ఆవరించి ఉంది. అప్పుడు ఆయన తన బానిస పిండారస్‌తో ఈకొండమీద ఉన్నాడు.

మెసెల్లా : ఈ నేలమీద పడిఉంది ఆయనకదూ?

టిటినియస్ : సజీవుడుగా ఉన్నట్లు లేదే. అయ్యో! హృదయమా!

మెసెల్లా : ఇది ఆయన కాదేమో!

టిటినియస్ : పొరబడకు మెసెల్లా! ఇది ఆయనే. ఇక కాషియస్ మనకు లేడు.

ఓఅస్తమించేసూర్యుడా! ఈరాత్రి అరుణకాంతులతో ఎలా నీవు అస్తమిస్తున్నావో అలాగే తనఅరుణారుణరక్త కాంతులతో కాషియస్ ఈనాడు అస్తమించాడు. రోమక భానుడు అస్తమించాడు.

మనరోజు గడిచింది. మేఘాలు, పొగమంచు, ఆపదలు ఆవరించాయి. మనపని పూర్తైంది. నేనెళ్లినపనివిషయంలో ఉన్న అనుమానం ఇంతపని చేసింది.

మెసెల్లా : విజయం చేకూరదన్న అనుమానమే ఈపని

చేసింది. ఓచింతాదేవిదుహితా! నీచదోషమా!! అసత్య దృశ్యాలను అమాయకుల ఎదట ఎందుకు ప్రదర్శిస్తావు. ఓదోషమా! నీవు చింతామూర్తిహృదయాన జన్మిస్తావు. నీజన్మవల్ల అందుకు కారణభూతురాలైన నీమాతృమూర్తి చింతాదేవి నశిస్తుంది.

టిటినియస్ : పిండారస్! ఎక్కడున్నావు ?

మెసెల్లా : టిటినియస్! వీ డెక్కడున్నాడో వెతుకు. నే నీవార్తను బ్రూటస్ చెవి కెక్కించివస్తాను. ఎక్కించటం కాకేమిటి? దూసుకోపోయే కత్తికంటే, విషపుటీటెకంటే ఈదృశ్యానికి సంబంధించినవార్త ఆయన కెంతో దారుణంగా ఉంటుంది.

టిటినియస్ : మెసెల్లా! నేను పిండారస్‌ను వెతుకుతాను. నీవు వెళ్లు.

[మెసెల్లా నిష్క్రమిస్తాడు

వీరుడా! కాషియస్, మీరు నన్నెందుకు పంపించావు? నేను మీమిత్రులను కలుసుకోలేకపోయినానా? వారు ఈవి జయ పుష్పమాలలను నాకిచ్చి నీఫాలదేశాన్ని అలంకరించ మన్నారే! వారి ఆనందకోలాహలాన్ని వినలేదా? అయ్యో! మీరు సమస్తాన్నీ అపార్థం చేసుకొన్నారు. ఇదుగో చూడండి. ఈపుష్పమాలతో మీ ఫాలాన్ని అలంకరించుకోండి. ఇది మీ కివ్వమని మీ బ్రూటస్ నన్ను ఆజ్ఞాపించాడు. నేను ఆయన ఆజ్ఞను పాలిస్తున్నాను. బ్రూటస్! మహాశయా! రండి! వేగంగారండి!! చూడండి. నేను కేయస్ కాషియస్‌ను ఎలాగౌర విస్తున్నానో చూడండి. ఇది రోమనుల ఆచారం. ఓ దేవత లారా! మీఅనుజ్ఞ నివ్వండి. రా, కాషియస్ మహాశయునికర

వాలమా! రా. టిటినియస్ హృదయాన్ని పరిశీలించు.

[ఆత్మహత్య చేసుకొంటాడు

యుద్ధధ్వనులు వినిపిస్తుంటవి. బ్రూటస్, యువకుడైన కాటో, స్ట్రాటో వొలుమ్నియస్, లుసిలియస్‌లతో మెసెల్లా ప్రవేశిస్తాడు.

బ్రూటస్ : ఎక్కడ? ఎక్కడ? ఏదీ అతనిశరీరం?

మెసెల్లా : అదిగో, దూరంగా. టిటినియస్ దానిమీద పడి దుఃఖిస్తున్నాడు.

బ్రూటస్ : టిటినియస్ ముఖం వెల్లికిలపడి ఉందే!

కాటో : అతడు చంపబడ్డాడు.

బ్రూటస్ : సీజర్ నీవు మరణాంతరంకూడా బలవంతుడివే. నీఆత్మ స్వేచ్ఛగా విహరిస్తూ, మాకడుపుల్లోకి మాకత్తులనే నడిపిస్తున్నది.

మందంగా యుద్ధధ్వనులు వినిపిస్తుంటవి.

కాటో : వీరుడా టిటినియస్!!...చూడండి. అతడు మరణించిన కాసియస్‌ను కిరీటాలంకృతుణ్ణి చేశాడు.

బ్రూటస్ : సజీవులైనవ్యక్తుల్లో ఈఇద్దరువంటి రోమను పౌరులు మన కెవరైనా లభిస్తారా? రోంనివాసుల్లో తుది మహోదాత్తవ్యక్తుల్లారా! మీకు వీడ్కోలు. రోంలోమీకు సాటిఐనవారు జన్మించటం కల్ల.

మిత్రులారా! ఈనాడు నే కార్చే కన్నీరు మరణించిన ఈవ్యక్తిఋణాన్ని తీర్చుకోలేవు. కాసియస్, సమయం చూచుకొని వచ్చి మరికొంత కన్నీరు కారుస్తాను. పదండి. అతడిశరీరాన్ని థసాస్‌కు పంపించండి. అతని అంత్యక్రియలు మనశిబిరంలోనే జరిగిస్తే మనపక్షానికి నిరాశకలుగుతుంది. లుసిలియస్, పద. కేటో యువకా! పద. యుద్ధభూమికి

పోదాం పదండి. లేబియో, ఫ్లేవియస్‌లు మనయుద్ధాలను నడిపిస్తారు. ఇప్పుడు మూడైంది. రాత్రి వచ్చేలోగా రెండోమారు యుద్ధంలో మనఅదృష్టాన్ని పరీక్షిద్దాం.

[నిష్క్రమిస్తారు

## నాలుగో దృశ్యం

యుద్ధభూమిలో మరోభాగం; యుద్ధధ్వనులు వినిపిస్తుంటవి. ఉభయ సైనికులు సమరం సాగిస్తుంటారు. తరువాత బ్రూటస్, కేటో, లుసీలియస్‌లు ఇతరులూ ప్రవేశిస్తారు.

బ్రూటస్ : సోదరులారా! ధైర్యంవహించండి.

కేటో : ధైర్యాన్ని కోల్పోయే టంతటి నీచులమా మనం? నావెంట ఎవరు వస్తారు? యుద్ధభూమిలో నా పేరు నిలువబెట్టుకుంటాను, తెలుసునా? నేను మార్కస్ కేటో కుమారుణ్ణి; నిరంకుశులకు శత్రువును. దేశమిత్రులకు మిత్రుణ్ణి.

బ్రూటస్ : నేను బ్రూటస్‌ను. మార్కస్ బ్రూటస్‌ను; బ్రూటస్ దేశానికి మిత్రుడు. నన్ను బ్రూటస్ అని గ్రహించు.

[బ్రూటస్ నిష్క్రమిస్తాడు.

లుసీలియస్ : యువకేటో! పడిపోయినావా? టిటినియస్ వలె వీరుడిలా మరణించావా? నీవు కేటోపుత్రుడవన్న గౌరవాన్ని నిలవబెట్టుకున్నావు.

ప్రథమసైనికుడు : లొంగిపో. లేకపోతే మరణిస్తావు.

లుసీలియస్ : మరణించటానికి లొంగిపోతాను. ఇదిగో, ఈధనాన్ని తీసుకో. నన్ను వెంటనే చంపు. [ధనమిస్తాడు]. బ్రూటస్‌ను చంపు. ఆయనున్న చంపా నన్న గౌరవాన్ని పొందు.

ప్రథమసైనికుడు : నిన్ను జీవగ్రాహంగా పట్టుకోరమ్మని

మా కాజ్ఞాపించారు. నీవు ఉదాత్తుడవైన బందీవి.

ద్వితీయసైనికుడు : దారి ఇవ్వండి. ఆంటొనీకి బ్రూటస్ బందీఐనా డని తెలియజేయండి.

ప్రథమసైనికుడు : నే నీవార్త చెప్తాను. అడుగో మా సేనాపతి వస్తున్నాడు. బ్రూటస్‌ను బందీచేశాం! బ్రూటస్‌ను బందీచేశాం!!

ఆంటొనీ : అత డెక్కడున్నాడు ?

లుసిలియస్ : ఆంటొనీ! ఆయన తగినంత భద్రంగా ఉన్నాడు. ఏశత్రువైనా బ్రూటస్‌మహాశయుణ్ణి జీవగ్రాహంగా పట్టుకోలేడు. నేను నొక నిర్ణయంగా చెప్తున్నాను. విను. దేవతలు ఆయన్ను అట్టి అవమానంనుంచి రక్షించెదరు గాక! ఎట్టిస్థితిగతుల్లోనైనా మీరు ఆయన్ను నిర్జీవుడిగాగాని, సజీవుడుగాగాని చూచినప్పుడు ఆయన ఆమహోదాత్తుడైన బ్రూటస్‌గానే కనిపిస్తాడు.

ఆంటొనీ : మిత్రులారా! ఇతడు బ్రూటస్ కాదు; మీరు పొరబడ్డారు. కానీ ఇతణ్ణి జాగ్రత్తగా చూడండి; ఇతడు బ్రూటస్‌తో తుల్యమైన విలువగలవాడు. ఇతణ్ణి మిక్కిలి కనికరంతో చూడండి. ఇటువంటివాళ్ళు నాకు శత్రువులుగా ఉండటంకంటే మిత్రులుగా ఉండవలెనని ఎంతగానో కోరుకుంటాను పదండి. బ్రూటస్ సజీవుడో నిర్జీవుడో వెదకండి. వ్యవహారం ఎలా పరిణమించిందో నాకు వార్తలందజేయండి. మేము ఆక్టేవియస్‌గుడారంలో ఉంటాము.

## ఐదో దృశ్యం

యుద్ధభూమిలో మరోభాగం. బ్రూటస్, డార్డానియస్, క్లైటస్, స్ట్రాటో, వోలమ్నియస్‌లు ప్రవేశిస్తారు.

బ్రూటస్ : రండి. మిత్రుల్లో మిగిలిన అల్పసంఖ్యాకులారా! ఈతిప్పమీద విశ్రాంతి తీసుకోండి.

క్లిటస్ : స్టాటిలియస్ కాగడాను చూపించాడేగాని తిరిగి రాలేదు; బహుశః మరణించిఉంటాడు. శత్రువులు అతణ్ణి బందీనైనా చేసిఉంటారు, లేకపోతే—

బ్రూటస్ : క్లిటస్! కూర్చో. విశ్రాంతితీసుకో. మరణించటమే ఈనాటి వార్తైపోయింది. అది ఆచారమైంది. మనం అనుసరిద్దాము, క్లిటస్.

[ పిలిచి రహస్యంగా సంభాషిస్తాడు.

క్లిటస్ : ఏ మన్నారు? మిమ్మల్ని చంపమన్నారా, ప్రభూ; సమస్తప్రపంచాన్ని నాకు కట్టబెట్టినా అపని చేయలేను.

బ్రూటస్ : అయితే, గొడవపెట్టకు.

క్లిటస్ : ఇంతకంటే నన్ను నేను చంపుకుంటాను గాని మిమ్మల్ని చంపటమా!

బ్రూటస్ : డార్డినస్, ఇలారా.

క్లిటస్ : డార్డినస్!

డార్డినస్ : క్లిటస్!

క్లిటస్ : బ్రూటస్ నిన్ను ఎంత చెడ్డకోరిక కోరుతున్నారో గమనించావా?

డార్డినస్ : ఆయన్ను చంపమంటున్నాడు క్లిటస్. ఆత్మ భావచయంలో ఆయన ఎలా మగ్నమైపోయినాడో చూడు.

క్లిటస్ : ఈ బ్రూటస్ హృదయపాత్ర దుఃఖంతో నిండి పొర్లిపోతున్నది. అకన్నీరును గమనించు.

బ్రూటస్ : ఇలారా, వొలుమ్నియస్. నేను చెప్పింది విను.

వొలుమ్నియస్ : ఏమంటున్నారు ప్రభూ!

బ్రూటస్ : సీజర్ భూతరూపం నాకు రెండుమార్లు దర్శన మిచ్చింది — ఒకమారు సార్డిస్‌లో, మరోమారు రాత్రి ఫిలిప్పీయుద్ధభూమిలో. నాఅంత్యం దగ్గిరకు వచ్చింది; నాకు తెలుసు.

వొలుమ్నియస్ : లేదు ప్రభూ! అలా అనకండి.

బ్రూటస్ : లేదు. నాకు నిశ్చయంగా తెలుసు. వ్యవ హారాలెల్లా నడుస్తున్నవో నీకు తెలుసు. శత్రువులు మన లను గొయ్యిందాకా తరుముకొచ్చారు. నాను వచ్చి అందు లోకి నెట్టేదాకా తారట్లాడటంకంటే ఈప్రపాతంనుంచి దుము కటం మనకు క్షేమం.

వొలుమ్నియస్! నీవూ నేనూ బాల్యమిత్రులం; కలిసి బడికి వెళ్ళాం. ఆ అపూర్వమైత్రికి సాక్షిగా నీవు నాకత్తిని పట్టుకో. నేను దానిమీదికి పరుగెత్తి ప్రాణాలు కోల్పో తాను.

వొలుమ్నియస్ : ఇది మిత్రుడికి ఆదేశింపదగ్గ ఉద్యోగం కాదు ప్రభూ!

[ఇంకా యుద్ధకోలాహలం వినిపిస్తుంటుంది.

క్లిటస్ : ఇక్కడ తారాడి ప్రయోజనం లేదు. ప్రభూ! పరుగెత్తిపొండి, పరుగెత్తిపొండి.

బ్రూటస్ : మీకు ఇదే నావీడ్కోలు. నీకు క్లిటస్! నీకు వొలుమ్నియస్! స్ట్రాటో! ఇంతవరకూ నీవు నిద్దరలో మునిగున్నావు. నీకూ నావీడ్కోలు. జీవితంలో ఒకటే నాకు పరమానందం. నాకుదిదాకా నామిత్రులందరూ నాయెడ సత్యసంధులై వర్తించారు. ప్రయోజనరహితమైన

విజయంవల్ల ఆక్టేవియస్, ఆంటొనీలు పొందేదానికంటే అప జయంవల్లనే నేను అధికంగా సాధించగలిగాను ఇక మీకు, మీఅందరికీ వీడ్కోలు. బ్రూటస్ జీవితచరిత్ర ఇంతటితో అంత మొందినట్లే. రాత్రి నాకనురెప్పలమీద కూర్చున్నది. నాఅంతరాత్మ విశ్రాంతికోసం ఆతురతనపొస్తున్నది. ఇంత కాలం నాశరీరం శ్రమించింది ఈపుణ్యసమయంకోసమే.

లోపల యుద్ధధ్వనులు, పరిగెత్తిపొండి, పరిగెత్తిపొండి అన్న కేకలు వినిపిస్తుంటవి.

క్లిటస్: పరుగెత్తిపొండి! ప్రభూ, పరుగెత్తిపొండి!

బ్రూటస్: పదండి, నేను అనుసరిస్తున్నాను.

[ క్లిటస్, డార్డానియస్, వొలుమ్నియస్‌లు నిష్క్రమిస్తారు

స్ట్రాటో! నిన్ను ప్రార్థిస్తున్నాను. నీప్రభువుకు అండగా నిలు. మంచికీర్తిని సంపాదించుకున్నవాడివి. నీజీవితంనిండా గౌరవామోదం నిబిడమైఉంది. నాకత్తిని పట్టుకో. నీ ముఖాన్ని ప్రక్కకు త్రిప్పు; నేను దానిమీద పడిపోతాను.

స్ట్రాటో: ప్రభూ! ముందు మీహస్తచాలనసౌభాగ్యాన్ని నాకు ప్రసాదించండి. ఇదే మీకు వీడ్కోలు.

బ్రూటస్: ఉత్తముడా, స్ట్రాటో, ఇదే నీకు వీడ్కోలు!

[ బ్రూటస్ కత్తిమీద పడిపోతాడు

సీజర్, ఇక శాంతించు. నన్ను నేనే చంపుకుంటు న్నప్పటి చిత్తస్ఫూర్తిలో అర్థాంశంతోనైనా నిన్ను నేను చంపలేదు.

యుద్ధధ్వనులు వినిపిస్తుంటాయి. ఆక్టేవియస్, ఆంటొనీలు ప్రవేశిస్తారు. మెసెల్లా, లుసిలియస్, సైన్యాలు ప్రవేశిస్తారు.

ఆక్టేవియస్: ఆవ్యక్తి ఎవరు?

మెసెల్లా : మా యజమానికి సేవకుడు. స్ట్రాటో! ప్రభువా రెక్కడ?

స్ట్రాటో : మెసెల్లా! నీవుపడ్డబానిసత్వాన్ని తప్పించుకొన్నారు. విజేతలు వారిచితాగ్నినితప్ప చూడజాలరు. ఆయన తన్నుతాను చంపుకున్నారు. ఆయనను చంపానని సగర్వంగా చెప్పుకొనే అవకాశం ఎవరికీ లేదు.

లుసిలియస్ : మహోదాత్తుడు బ్రూటస్ తనఆధిక్యానికి అనుగుణంగా ప్రవర్తించాడు. బ్రూటస్ మహాశయా! నీవు లుసిలియస్ అంటున్నట్లే చేశావు.

ఆక్టేవియస్ : బ్రూటస్‌ను సేవించేవారందరినీ నేను ఉద్యోగాలిచ్చి పోషిస్తాను. ఏమోయ్! నా సేవలో కుదరటం నీకిష్టమేనా?

స్ట్రాటో : మెసెల్లా ఇందుకు అంగీకరిస్తే అలాగే.

ఆక్టేవియస్ : ఉత్తముడా మెసెల్లా! అతణ్ణి అలా ఆజ్ఞాపించు.

మెసెల్లా : స్ట్రాటో! నాప్రభువు బ్రూటస్ ఎలా మరణించారు?

స్ట్రాటో : నేను కత్తిని నిల్పాను; వారు దానిమీదపడి ప్రాణాలు తీసుకున్నారు.

మెసెల్లా : ఆక్టేవియస్ మాప్రభువుకు తుదిసేవ చేసిన ఇతణ్ణి మీకొల్వులోకి తీసుకోండి.

ఆంటొని : వారందరిలో ఇతడే మహోదాత్తుడు. ఇతడు తప్ప మిగిలిన వారందరూ సీజర్‌ను ఈర్ష్యవల్ల హత్యచేశారు. సత్యబుద్ధితో ప్రజాసామాన్య సంక్షేమాన్ని భావించి వారిలో చేరింది ఇతడొక్కడే. ఇతడిజీవితం అతికోమలమైంది. సమస్త

భూతాలూ నిలిచి మానవుడంటే ఇతడు అని ప్రపంచానికి చాటిచెప్ప దగ్గట్లుగా సర్వసద్గుణాలు ఇతడిలో సంకలితాలయ్యాయి.

ఆక్టేవియస్ : ఇతడి మహోత్తమగుణాల కనుగుణంగానే మనం ఇతణ్ణి గౌరవిద్దాం. మహావీరుడికి యోగ్యమైన సమస్తాచారాలతో అంత్యక్రియలు జరుపుదాం. ఇక సైన్యాలను యుద్ధంమాని ప్రశాంతి వంహించవలసిం దని ఆజ్ఞాపించు. పద. మహానందకరమైన ఈ సుదినంనాటి కీర్తిప్రతిష్ఠలను పంచుకోటానికి ఇక మనం నిష్క్రమిద్దాం.

[నిష్క్రమిస్తారు

# అనుబంధం

**1.** వక్షస్త్రాణము : చర్మపుదాలు — వడ్రంగిపని చేసేటప్పుడు శరీరానికి దెబ్బతగలకుండా కట్టుకుండేది.

చెడ్డ చర్మాలకు : ఇక్కడ షేక్స్పియర్ 'బాడ్ సోల్స్' అన్నపదాన్ని ఉపయోగించాడు. సోల్స్ శబ్దానికి చెప్పుతకలనీ, ఆత్మలనీ, ఆంగ్ల భాషలో ఉన్న శ్లేషార్థాలు రెండూ ఈసందర్భంలో వర్తిస్తాయి. ఈసొగసు అనువాదంలో కనిపింపచేసే అవకాశం లేదు.

**3.** పాంపే—'వీరత్రయకూటమి' (ట్రయంవిరేట్) క్రీ. పూ. ౧౦౬—౪౮ లో గొప్పసేనాపతి. రోంకోసం అనేకవిజయాలను చేకొన్నవాడు. సీజర్‌కు ప్రబల శత్రువు. ఇతణ్ణి ఈజిప్టులో హత్యచేశారు.

టైబర్ — రోంమహానగరం ఈనదీతీరాన్నే నిర్మితమైంది.

**4.** సభా మందిరం — కాపిటోలైన్ కొండమీద కట్టిన జూపిటర్ దేవాలయం. జైత్రయాత్రచేసి విజయాలతో రోంనగరంలో ప్రవేశించిన వీరులందరూ ఉత్సవంతో ఈఆలయానికి వచ్చి సర్వదేవతాధిపతి అయిన జూపిటర్‌కు వినతులు చెల్లిస్తారు. ఇది సభాభవనమని షేక్స్పియర్ పొరబడ్డాడు.

లూపర్‌కల్ ఉత్సవాలు — ఫానస్ అనే దేవతాగౌరవచిహ్నాలుగా ప్రాయశ్చిత్త, పవిత్రీకరణంకోసం రోంమహానగరంలో ఫిబ్రవరి పదిహేనున జరిగే ఉత్సవాలు. యువకులు నిరలంకృతులై నగ్నంగా నగరంలో పరుగెత్తుతూ తమకు ఇష్టంవచ్చిన వాళ్ళను గట్టిగా చరుస్తూ పరుగెత్తిపోతుంటారు. వారు తట్టినవాళ్ళు గర్భవతులైతే సుఖంగా ప్రసవిస్తారనీ, వంధ్యలైతే గర్భవతులౌతారనీ రోంప్రజల విశ్వాసం.

కల్పూర్నియా — సీజర్‌ను క్రీ. పూ. 44 లో నాల్గవభార్యగా వివాహమాడిన వనిత. కల్పూర్నియాస్ పిసో కుమార్తె.

**10.** ఏయనియస్ — ఒక ట్రాయ్‌వీరుడు. ఇడామౌంట్ మీది డార్డానస్‌కు రాజైన అన్‌చెసిస్‌కు వీనస్‌వల్ల జన్మించాడు. పదిసంవత్సరాలు ముట్టడించి గ్రీకులు ట్రాయ్‌ని పట్టుకొని దగ్ధంచేసినప్పుడు ఇతడు తన తండ్రిని తనభుజాలమీద ఏత్తుకొని నగరంలోనుండి బయటపడవేసినట్లు వర్జిల్ కవి. ఈదటానికి - ఏనిడ్ వల్ల తెలుస్తున్నది. — సీజర్ గజఈతగాడని ఎన్నో

కథ లున్నాయి. కానీ షేక్స్పియర్ మానసిక శారీరక దౌర్బల్యంగల సీజర్ రోమక సామ్రాజ్యాన్ని ముందుగా కలగని అందుకు యత్నిస్తున్నట్లు చూపించటానికి చరిత్రకు భిన్నంగా ఇలా కాషియస్‌చే పలికించాడు.

**11.** *లిసినియస్* —సీజర్‌కు స్పెయిన్‌లో మిత్రుడు, పారిపార్శ్వకుడు.

కొలోసస్ - అప్పాలో దేవతకు రోహొడ్సు రేవులో నిల్పిన ఒక పరిష్ఠ ప్రతిమ. ఈవిగ్రహంపాదాలక్రిందుగా తెరచాపలు దించకుండానే నౌకలు ప్రయాణించ వచ్చునట! రోడ్సు వద్ద కొలొసస్ అని ప్రఖ్యాతి వహించిన ఈమూర్తి ప్రపంచసప్తవైచిత్ర్యాలల్లో ఒకటి.

**12.** *మహాప్రళయానంతరం* — క్రీ. పూ. ౧౫౦౩ న ఈ ప్రళయం థెస్సలీలో జరిగినట్లు భావింపబడుతున్నది. ప్రొమిథియస్ పుత్రుడైన డ్యూకాలియన్ కాలంలో **మానవులు** చేసే అపచారాల మీద కలిగిన కోపం వల్ల ఈ ప్రళయాన్ని జూపిటర్ కల్పించాడట! ఈ ప్రళయంనుంచి డ్యూకాలియన్ అతడిభార్య పైర్రాహ్ థెమిసిస్ దివ్యవాణి ఇచ్చిన సలహాను అనుసరించి మౌంట్ పార్నాసస్ మీద నిలిచి బ్రతకగలిగినట్లూ, **మానవజాతి** నష్టాన్ని తీర్చటంకోసం వాళ్లు నారి జేజెమ్మ ఎముకలను వెదజల్లారనీ, డ్యూకాలియన్ చల్లినవి పురుషులూ, అతనిభార్య చల్లినవి స్త్రీలూ అయినట్లు గ్రీకుపురాణగాథలవల్ల తెలుస్తున్నది.

పూర్వం ఒకానొకప్పుడు ఒక బ్రూటస్ - ఇది టార్క్విన్సుపారద్రోలి రాచరికాన్ని రద్దుచేయటంలో ప్రముఖపాత్ర వహించిన లుసియస్ జూనియస్ బ్రూటస్. ఇతడు రోంకు మొదటి కాన్సల్; టార్క్విన్స్ రాజ్యపాలనను పునరుద్ధరించటానికి యత్నించిన తన కుమాళ్ళ నిద్దరిని చంపుకొన్న దేశాభిమాని. ఇతని తృతీయ పుత్రుని సంతతివాడు నాటకం నాటి బ్రూటస్.

**13.** *టోగాకాన* – రోమనులకు చొక్కా లేదు; 'టోగా' అనే పేరుగల ఉత్తరీయాన్ని నాగ ధరిస్తారు-

**14.** *అతడు బలిసి ఉంటె* — బలిసి చియ్యబట్టిన వాళ్లు సంతృప్తితో జీవిస్తుంటారనీ, అందువల్ల వాళ్లు కుట్రలు పన్నరనీ సీజర్ భావం.

**18.** *నాకు గ్రీక్ గానే ఉంది* — అర్థంకాని అయోమయ సంభాషణ మన్నమాట!

**24.** మన పితృపితామహుల — మన తండ్రితాతల శరీరసౌష్ఠవం మనలను వదలక పోయినా మానసికంగా మనం మన తల్లుల లక్షణాలను పొంది స్త్రీత్వం వహించాము.

# ద్వితీయాంకం

ప్రథమాంకంలో సీజర్ హత్యకు కుట్రలోని ప్రాథమికావస్థలు కనిపిస్తాయి. ద్వితీయాంకంలో కుట్ర పరిపూర్ణమౌతుంది. తృతీయాంకంలో హత్య జరుగుతుంది.

**28.** ఘంట ఎంత కొట్టిందో — షేక్స్పియర్ మహాకవి ప్రకృతి పరిశీలనా సామర్థ్యానికిది నిదర్శనం.

**31.** బావమరది — కాషియస్ జూనియా అనే బ్రూటస్ సోదరిని వివాహమాడటంవల్ల అతడికి బావమరిది.

**38.** శృంగాశ్వం : 'యూనికార్న్' అన్న పేరుగల గ్రీకుపురాణాలలోని కల్పితజంతువు. దీనికి తలమీద కొమ్ముంటుందిట !

**38.** లిగారియస్ : బ్రూటస్కు ఆప్తమిత్రుడు. అతడియెడ గురుభావంకలవాడు. ఇతడు క్రీ. పూ. 43 లో 'వీరత్రయకూటమి' నిర్ణయాలవల్ల తన ఇరువురు సోదరులతో బాటు ప్రాణాలను కోల్పోయాడు.

**40.** గుండీలు లేకుండా — షేక్స్పియర్ రోమనులకు ఆంగ్లేయదుస్తులిచ్చాడు. ఇది పొరబాటు.

# తృతీయాంకం

సభాభవనం ముందు — సత్యానికి సీజర్ హత్య "క్యూరియా పాంపైయానా"లో జరిగినట్లు ప్లూటార్కు చరిత్రకారుని రచనవల్ల తెలుస్తున్నది. ఇది పాంపే నాట్యశాలకు ఒక అనుబంధ మందిరం. షేక్స్పియర్ జూపిటర్ దేవమందిరాన్ని' సభాభవనంగా భావించి భ్రాంతిపడ్డాడు. కానీ సీజర్ హత్యను నగరకంఠమైన ఈదేవమందిరం ముందు జరిపించటం సమంజసంగానే ఉంది. పాంపే నాట్యశాలలో ఉన్న పాంపే ప్రతిమనుగూడా అతడు పొరబడిన సభాభవనానికి మార్చాడు. అయినా సీజర్ తాను

జయించిన తనప్రబలశత్రువు పాంపే ప్రతిమముందు వధింపబడి ఒరిగిపోవటం షేక్స్పియర్ చేసిన ఉచితకల్పన అని అనిపించుకుంటున్నది.

**57.** *ఈరీతిగా ప్రణమిల్లావని* — ఇక్కడ సీజర్ చేసిన ఆత్మ ప్రాతోన్మీలనం గమనింపదగ్గది. ఇందులో చక్రవర్తులదృష్టి, వర్తనలు ఎలా ఉండాలో ఆయన నిరూపించాడు. ఆయన అభిప్రాయంలో చక్రవర్తి భయరహితుడు, అచంచలుడు, స్వతంత్రుడు — మానవరూపాన్ని ధరించిన పరమేశ్వరుడు.

**58.** *ఒలింపస్ పర్వతాన్ని* — గ్రీసుదేశంలోని ఒకపర్వతం. ఇది సమస్తగ్రీకుదేవతలకూ నివాసభూమి అని గ్రీకుపురాణగాథలు.

**60.** *మహాప్రళయసమయం* — 'డూమ్స్‌డే'.

**64.** *వీరాధివీరుడవైన నాకాస్కా* — ఇందులోని వ్యంగ్యధ్వని గమనార్హము.

**67.** *లేకపోతే* — హంతకులను దూషించకపోవటం, సీజర్‌ను కీర్తించటం తప్ప ఇతరం చేయకపోవటం, బ్రూటస్ అనుజ్ఞతోనే మాట్లాడుతున్నానని సభలో ప్రకటించటం, బ్రూటస్ మాట్లాడిన వేదికమీదనే ఆయన తరువాత మాట్లాడటం, — అన్నవి అంగీకారం కాకపోతే.

**68.** *ఏతీ* — ప్రతీకారాదిదోషాలకు మూర్తిత్వం వహించిన గ్రీకుదేవత. జూయస్ అనే పరమేశ్వరుడు ఆయన్ను త్వరపెట్టి ఒకదుష్కృత్యాన్ని చేయించినందుకు ఈదేవతను దేవతానివాసభూమి ఐన ఒలింపస్ నుంచి నరకంలోకి విసిరివేసినట్లు గ్రీకుపురాణగాథ.

**69.** *రోం ప్రమాదరహితం కాదని* — జూలియస్ సీజర్‌ను హత్య చేయటంవల్ల హంతకులు ఆక్టేవియస్ సీజర్‌నుకూడా హతమార్చే అవకాశం ఉండటంచేత.

**70.** *మిత్రులారా!* — ఇది జూలియస్ సీజర్ నాటకంలోకెల్లా ప్రపంచవిఖ్యాతిపొందిన ప్రసంగం. పైకి వినయాన్ని ప్రకటిస్తున్నా మార్క్ ఆంటొనీ ఒక జిత్తులమారి రాజకీయవేత్త అనీ చతురుడైన వక్త అనీ దీనివల్ల వెల్లడౌతున్నది.

**76.** *అజచర్మలేఖనం* — కాగితాలు లేని ఆకాలంలో అజచర్మం మీద వ్రాసేవారు.

79. నెర్వీలు: బెల్జిక్ జాతుల్లో మహావీరులని పేరుపొందిన వర్గం. వీరిని సీజర్ క్రీ. పూ. 57లో 'సంబ్రి' యుద్ధంలో జయించాడు. ఈ యుద్ధం శీతాకాలంలో జరిగింది; గ్రీష్మకాలంలో జరగలేదు.

నాకు బాగా జ్ఞాపకం — కానీ ఆంటొనీ ఆయుద్ధభూమిలో లేడు;

108. ఒక పవిత్రస్థలంలో — రోమనుల కాలంలో దహనానికి పవిత్రస్థలాలంటూ లేవు. ఇది షేక్స్పియర్ ప్రవేశపెట్టిన క్రైస్తవమతసంబంధమైన భావం. ఇది కాలీనవ్యత్యస్తకం (అనాక్రానిజం).

112. అతణ్ణి లాగివేయండి — . సీజర్‌ను హత్యచేసిన వారిలో 'సిన్నా' నామం కలవాడు ఒకడు కావటంవల్ల.

# చతుర్థాంకం

114 ఇటువంటి పనులకు మాత్రమే పనికివస్తాడు: షేక్స్పియర్ లెపిడస్‌ను ప్రజ్ఞాహీనుణ్ణిగానూ, క్షుద్రకార్యకరణానికి పంపదగ్గవాణ్ణిగానూ చిత్రించాడే గాని ఇతడు కాకలుదీరిన సేనవీరుడైనట్లు ప్లూటార్క్ రచనల వల్ల తెలుస్తున్నది. 'వీరత్రయకూటమి'లో మిగిలిన ఇరువురూ ఇతణ్ణి తమకంటె తక్కువగా చూడటం చారిత్రాత్మకసత్యమే. అందువల్లనే ఇతడు క్రీ. పూ. 43 లో తనస్థానాన్ని పొందటానికి తిరుగుబాటుచేసి ఓడిపోయినప్పుడు ఆక్టేవియస్ ప్రాణదానం చేస్తాడు. ద్రోహులను నిర్ణయించేటప్పుడు — ఈ దృశ్యంలో వీరత్రయకూటసభ్యులైన ఆక్టేవియస్, ఆంటొనీ, లెపిడస్‌లు అధికారంకోసం ఆత్మబంధువుల సంహారణానికికూడా ఎలా అంగీకరిస్తున్నారో గమనించదగింది. ఈసందర్భంలో రోంమహానగరంలో జరిగిన హత్యాకాండ అతి దారుణమైంది.

118 సార్డిస్: ఆసియామైనర్‌లో ప్రసిద్ధిపొందిన ఒక ప్రాచీననగరం. రోంలో తమమీద ఆంటొనీ వ్యతిరేకత ఫలితంగా తిరుగుబాటు వచ్చినప్పుడు బ్రూటస్ కాషియస్‌లు తూర్పుకు పారిపోయారు. ఆక్టేవియస్, ఆంటొనీలు ఇది గమనించి వారిని వెన్నాడుతూ వచ్చారు.

119 ఇదే ప్రసిద్ధమైన 'కలహదృశ్యం'. మహాకవి షేక్స్పియర్ నాటకాల రీతిశక్తి కలవాడని నమ్మటానికి మిగిలిన అన్నిరచనలకంటె కలహదృశ్యం

ఎక్కువగా ఆకర్షించింది అని సుప్రసిద్ధాంగ్లవిమర్శకుడు, కవి ఐన కోల్రిడ్జ్ అన్నాడు.

**120** లూసియస్ పెల్లా : కాషియస్ క్రింద ఉన్నతసైనికోద్యోగి.

**121** చంద్రుణ్ణిచూచి మొరుగుతుండేవాణ్ణి — ఈపనిచేయటం మూర్ఖత్వాన్ని వెల్లడిస్తుంది. చంద్రుణ్ణిచూచి భయపెట్టటానికి మొరగేకుక్క నచ్చిది కాకేమిటి ?

**122** నీప్లీహంలోని విషాన్ని పట్టించుకో — నీకోపాన్ని నూపుమాపు అని అర్థం, ప్లీహం కోపం, ఈర్ష్య, చింతాదిదోషాలకు జన్మస్థానమని పూర్వుల అభిప్రాయం.

**126** ప్లూటస్‌గని — గ్రీకులధనాధిపతి ప్లూటస్. విచక్షణలేకుండా తనధనాన్ని ఇస్తూ ఉండటంకోసం జూయస్ అతణ్ణి అంధుణ్ణి చేశాడని గ్రీకు పురాణగాథ.

**132** "పర్రత్రయకూటమి" హననంచేయటానికి గుర్తించిన సభాసభ్యుల సంఖ్య ౨౦౦ అయినట్లు ప్లూటార్క్.

**133.** సత్యసంధుడైన — బ్రూటస్ మెసల్లాతో తనభార్య పోర్షియాను గురించి ఎటువంటివార్తా రాలేదనటం బహుశః అతడికి వచ్చినలేఖల్లో ఆమెనుగురించిన వివరాలు ఏమైనా ఉంటాయో తెలుసుకోటానికై ఉంటుంది.

ఎలాగైతేనేం : పోర్షియా గతించింది — ఇది బ్రూటస్ అనుద్వేగానికి ప్రబల నిదర్శనం.

**138.** రోమనులు ధరించే 'టోగా' ఉత్తరీయంవంటిది. దానికి జేబు లుండవు.

**139.** నేను నీదుష్టాత్మను — ప్లూటార్క్ కూడా భూతాన్ని గురించిన ప్రశంస చేశాడు. కానీ అది సీజర్‌భూతాకృతి అని వ్యవహరించలేదు.

**140.** మళ్లీ ఫిలిప్పైదగ్గర కలుసుకుందాము — భూతాన్ని చూచి బ్రూటస్ మహాభయభ్రాంతుడైపోయినట్లు ప్లూటార్క్. షేక్స్పియర్ పాత్ర పోషణకోసం అతణ్ణి స్థైర్యమూర్తినిగా చిత్రించాడు.

# పంచమాంకం

**144.** హైబ్లా: సిసిలీలో తేనెకు ప్రసిద్ధి వహించిన ఒక ప్రాంతం.

**145.** మరొక సీజర్ — అతడి పేరు ఆక్టేవియస్ సీజర్ కావటంవల్ల అతడే.

నేను జన్మించింది ఈనాడే. రోమనులకు జన్మదినోత్సవాలు చేసుకొనే ఆచారం లేదు.

**146.** ఒకనాటి పాంపేలాగా — అనుభవరహితులైన అనుచరులతో ఫార్సలీలోని ఫారస్లేలియావద్ద క్రీ. పూ. 48 లో పాంపే సుశిక్షితులైన సీజర్ నాయకత్వాన నడిచివచ్చిన సైన్యాలను ఎదుర్కొని ఓడిపోయాడు. అంతటితో సీజర్‌కు రోమనుసామ్రాజ్యంమీద ఆధిపత్యం లభించింది.

**147.** ఎపిక్యూరస్‌కు అనుయాయి — ఎపిక్యూరస్ క్రీ. పూ. 241-270 లో జీవించి ప్రత్యేక తాత్వికశాఖకు మార్గదర్శియైన సుప్రసిద్ధ గ్రీకు తత్వవేత్త. దేవతలకు మానవుల జీవితాలమీద ఎట్టి ప్రభావం లేదని, వారికి సదాచారసంపత్తిగల జీవితాన్ని గడిపే ఆనందానుభవాన్ని పొందటమే చరమలక్ష్యమని ఆతడి తత్వసిద్ధాంతాలకు సారం. ఆతడిదృష్టిలో శకునాలు కేవలం ఇంద్రియవిభ్రాంతులు.

పరతుపకులు: 'ఈగిల్స్'. శుభసూచకాలు. కాకులు, గ్రద్దలు, కాకోలాలు దుశ్శకునసూచకాలు.

**148.** కేటో: బ్రూటస్ భార్యపోర్షియాకు తండ్రి. ఫారిసేలియా యుద్ధంలో పాంపేవైపు చేరి సీజర్‌కు వ్యతిరేకంగా పోరాడాడు. పాంపే ఓడిపోయిన తరువాత 'ఉటికా' వైపుకు పోయినాడు. అప్పుడు సీజర్ హస్తాలల్లో పడిపోకుండా ఉండటానికగాను ఆత్మహత్య చేసుకున్నాడు.

**152** పార్థియాలో ఇప్పుడు నేను — నేటి ఖోరాసాన్‌కు రోమకసామ్రాజ్యంనాటి నామం పార్థియా. కాషియస్, క్రాసస్‌లు పార్థియన్లలను ఛార్హైఅనే యుద్ధంలో ఓడించారు. ఆసందర్భంలో కాషియస్ పిండారస్‌ను దానిసగా గైకొన్నాడు.

**154** సూర్యుడు అస్తమించాడు — కాషియస్ మరణంతో రోంలో

ఆదర్శమైన ప్రజాస్వామిక భావం నశిస్తుంది. అందువల్లనే అతడు 'రోం భానుడు' అయినాడు.

157 తుది మహోదాత్త రోమను వ్యక్తులారా! బానిసత్వంకంటె ఆత్మ హత్య ద్వారా గౌరవాన్ని పోషించుకోవటంవల్ల బ్రూటస్ ఇలా వీరిద్దరినీ సంబోధించాడు.

థసాస్ — ఫిలిప్పైకి, థేసస్ కు సన్నిహితంగా ఉన్న ఒక ద్వీపం. కేటో యువకుడు — పోర్షియా తమ్ముడు. బ్రూటస్ బావమరిది.

ఇప్పుడు మూడైంది — పైన అస్తమయసమయమని చెప్పి మళ్ళీ మూడైంది అనటం స్వవచనవ్యాఘాతము.

వెల్కం ప్రెస్ (ప్రైవేట్) లిమిటెడ్, గుంటూరు-2

